5 సంవత్సరాలు గ్యారంటీ గల మెరి సూపర్ స్పెషల్ బంగారు కవరింగ్ నగలను 15 సంవత్సరాల పరిశోధన ఫలితంగా – భారత దేశంలో ప్రప్రథమంగా తయారు చేస్తూ, దేశమంతటా విరివిగా వి. పి. పి. ద్వారా పంపే సంస్థ. ఉచితంగా కేటలాగ్ పొంది అన్ని వివరాలు చూడగలరు. ఇందులోని సంఖ్యలు సూచిస్తూ, ఉత్తరం రాస్తే, వి. పి. పి. ద్వారా వస్తువులు పంపబడతాయి. (వి. పి. పి. చార్జీలు అదనం)




# MERI GOLD COVERING WORKS

P.O. BOX 1405, 14, RANGANATHAN STREET
T. NAGAR MADRAS-600 017 INDIA







ముఖచిత్రం : శరత్కాళ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# "ఇష్టంగా చేసేపనులు ఎప్పటికీ మానను."

"చిత్తం వచ్చిన రీతిలో జీవించడం.
వళ్లు సమంగా ఉండేలా వ్యాయామం చేయడం.
గుర్రాలపై స్వారి చేయడం, కార్లలో దూసుకెళ్లడం.
వెళ్లిన చోటల్లా వింత ఆనందం పొందడం.
అన్నిటికీ మించి, నా చర్మ సౌందర్యాన్ని ఎప్పటిలాగే
లక్స్‌తో కళకళలాడేలా ఉంచుకోవడం."

Poornima.




శుద్ధమైన సౌమ్యమైన లక్స్–
సినిమా తారలకు సౌందర్యాన్నిచ్చే సబ్బు

LL 8716

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన

## సెప్టెంబరు నెల భావపరిచయ పోటీ

### బహుమానం రూ 25-00





ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి సెప్టెంబర్ 18వ తేదీలోగా పంపాలి

---

## ఆగష్టు నెల భావపరిచయ పోటీ

### రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

"అప్పుచేసిననాడు సంబరం
అప్పు తీర్చలేక నేడు దిగంబరం''

—ఆర్ పట్టాభిరామరాజు
తిరుపతి

## మీ చర్మం రంగును నిర్ణయించేది ఏమిటి?

మీ చర్మం లోపల మెలానిన్ అనే నల్లని రంగు పదార్థం వుంది. ఇది చర్మంలో ఎంత ఎక్కువగా వ్యాపిస్తే మనుషులు అంత నల్లగా కనబడతారు. మీ చర్మం రంగు మీద ప్రభావం చూపే బయటి కారణాలు కూడా ఉన్నాయి. ఎండలో మీరు బయటకి వెళ్లినప్పుడు సూర్యరశ్మిలోని అల్ట్రా వయొలెట్ కిరణాలు మిమ్మల్ని మరింత నల్లబరుస్తాయి.

## వంటి ఛాయను పెంచడానికి సరియైన పద్ధతి ఏదైనా ఉందా?

ఉంది. మొట్టమొదటిసారిగా సాధించిన ఓ వైజ్ఞానిక విజయం ఫెయిర్ అండ్ లవ్‌లీ . నల్ల చర్మాన్ని తెల్లపరిచే క్రీమ్ ఇది మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టి తిరిగి ఎర్రగా రంగు తేలేలా చేస్తుంది.

## ఫెయిర్ అండ్ లవ్‌లీ ఎలా పనిచేస్తుంది?

లోపలా, బయటా 2 విధాలుగా.

చర్మం లోపల· ఫెయిర్ అండ్ లవ్‌లీ క్రీము చర్మం అడుగున మృదువుగా, సురక్షితంగా పనిచేసి, నల్లబడుతున్న చర్మం తిరిగి రంగు తేలేలాగ చేస్తుంది

చర్మం బయట ఫెయిర్ అండ్ లవ్‌లీలో గల 'సూర్యరశ్మిని వడబోసే' ప్రత్యేక పదార్థాలు. అల్ట్రా వయొలెట్ కిరణాలు మీ చర్మాన్ని నల్లబరచకుండా అడ్డగిస్తాయి అయినప్పటికీ, సూర్యరశ్మిలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు

## రంగు తేలడానికి కేవలం 6 వారాలు!

ఫెయిర్ అండ్ లవ్‌లీని ఆరు వారాలపాటు క్రమం తప్పకుండా రోజుకు రెండుసార్లు రాసుకోండి మొదట చర్మంమీద కాస్త జిమజిమలాడవచ్చు ఫెయిర్ అండ్ లవ్‌లీ పనిచేస్తున్నదనడానికి అది నిదర్శనం ఆరు వారాల్లో ఖచ్చితమైన తేడా మీకు కన్పిస్తుంది, ఇతర్లకీ కన్పిస్తుంది క్రమం తప్పకుండా వాడుతూ ఉండండి, ఫెయిర్ అండ్ లవ్‌లీ శరీర ఛాయతో అలాగే వుంటారు.

ఫెయిర్ అండ్ లవ్‌లీ గురించి మీరు మరిన్ని వివరాలు తెలుసుకోవాలనుకుంటే ఈ చిరునామాకు వ్రాయండి·

FAIR & LOVELY ADVISER
P. O BOX 758, BOMBAY 400 021.

**ఫెయిర్ అండ్ లవ్‌లీ**

నల్ల చర్మాన్ని ఎర్రపరిచే క్రీమ్




**ఇది సహజంగా, మృదువుగా మీ వంటి ఛాయను పెంపొందిస్తుంది.**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# యువ

## దీపావళి రజతోత్సవ సంచిక

పాతికేళ్ళ క్రితం ఉత్తమ కాల్పనిక సాహిత్యాన్ని తెలుగు పాఠక లోకానికి అందించాలనే సదుద్దేశంతో ప్రారంభమైన 'యువ' వచ్చే దీపావళికి అత్యంత ప్రత్యేకమైన, ప్రతిష్ఠాకరమైన 'దీపావళి రజతోత్సవ సంచిక'ను మీ అభిరుచులకు దర్పణంలా వెలువడబోందని ప్రకటించడానికి సంతోషిస్తున్నాం.

తెలుగు కాల్పనిక సాహితీ జగత్తులో రెండున్నర దశాబ్దాల పరిణామ వికాసానికి ఈ సంచిక ప్రయోజనపూరితమైన ప్రతీక.

అప్పటి రచనలు వేరు; ఇప్పటి రచనలు వేరు.

అప్పటి పాఠకులు వేరు; ఇప్పటి పాఠకులు వేరు.

కాల్పనిక సాహిత్యంలో, పాఠకుల అభిరుచుల్లో తరతరాల అంతరాలకు ఈ ప్రత్యేకాతి ప్రత్యేకమైన సంచిక మేలైన వారధిగా నిలుస్తుంది.

రెండున్నర దశాబ్దాల 'యువ'కు ఈ సంచిక ప్రతిబింబం:

రెండు నవలలు

ఎన్నో కథలు

మరెన్నెన్నో కార్టూన్లు

త్రివర్ణ చిత్రాలు

తెలుగువారి ప్రతి ఇంట్లోనూ తప్పకుండా ఉండాల్సిన ప్రత్యేక సంచిక.

ఈ దీపావళికి ముందుగా వెలువడుతుంది

మీ కొనుగోలు వ్యయానికి పదిరెట్లు సంతృప్తిని అందించే ప్రత్యేక సంచిక.

ఆ సంచిక కోసం ఇప్పట్నుంచే ఎదురుచూసే బదులు– వెంటనే రిజర్వు చేసుకోండి

వెల: పన్నెండు రూపాయలు మాత్రమే!

# యువ

## సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 50 | అక్టోబర్ 1984 | సంచిక 4

మూడు రోజుల్లో ఆంధ్రప్రదేశ్ రాజకీయాల్లో అనూహ్యమైన, అవాంఛనీయమైన నాటకీయ పరిణామాలు ఏర్పడ్డాయి. ఆగస్టు 14న అమెరికా నుంచి 'బై పాస్' ఆపరేషన్ చేయించుకొని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు రావడం, అదేరోజున ఆర్థిక మంత్రి శ్రీ నాదెండ్ల భాస్కర్రావ్‌ను డిస్మిస్ చేయడం, మరి ముగ్గురు మంత్రులు రాజీనామా చేయడం, తెలుగుదేశం ఎం.ఎల్.ఎ.లల్లో కొంతమంది చీలడం, తన మెజారిటీని రెండు రోజుల్లో నిరూపించుకొంటానని శ్రీ ఎన్. టి. ఆర్. తన బలగంతో గవర్నర్ దగ్గరకు వెళ్ళడం, శ్రీ ఎన్. టి. ఆర్ మంత్రివర్గానికి మెజారిటీ లేదని తాను నమ్ముతున్నానని బర్తరఫ్‌చేసి, శ్రీ నాదెండ్ల చేత ముఖ్యమంత్రిగా గవర్నర్ ప్రమాణ స్వీకారం చేయించడం — మన రాష్ట్ర రాజకీయ చరిత్రలో కనీవినీ ఎరుగని నాటకీయ ఫక్కీలో పరిణామాలు జరిగాయి. మూడున్నర దశాబ్దాల కాంగ్రెస్ పాలనను అంతమొందించి చరిత్ర సృష్టించిన శ్రీ నందమూరి తారక రామారావు

పంథొమ్మిది మాసాల తర్వాత పదవిచ్యుతుడయ్యాడు. ఈ హఠాత్పరిణామాన్ని అరుకోట్ల ఆంధ్రప్రదేశ్ ప్రజలు స్వప్న సూచనప్రాయంగానైనా ఊహించ లేదు. అందుచేతనే ప్రజల ఆగ్రహాగ్ని అగ్నిపర్వతంలా ప్రజ్వరిల్లింది. రాష్ట్ర మంతటా బంద్ జరిపారు నిరసన వెల్లువతో ఆగ్రహావేశాల్ని ప్రదర్శించారు. దాదాపు 24 మంది పోలీసు కాల్పులకు బలిఅయ్యారు. ప్రభుత్వ ఆస్తికి ఎంతో నష్టం జరిగింది. కొన్ని రోజులపాటు ప్రజాజీవనం స్తంభించింది.

ఈ విపరీత, విపత్కర, నాటకీయ, హఠాత్ పరిణామాలకు ముఖ్యకారకు లెవరు? తెరవెనుక ఎంతోమంది వ్యక్తులూ, ఎన్నో శక్తులూ ఉన్నప్పటికీ-అప్పటి గవర్నర్ శ్రీ రామ్‌లాల్ చర్యను తొందరపాటు చర్యగా, రాజ్యాంగ విరుద్ధ మైందిగా, నిరంకుశమైందిగా దేశంలో పెక్కుమంది రాజకీయ వృద్ధులూ, పండి తులూ, పామరులూ, జాతీయ ప్రతిపక్ష నాయకులూ ఏకవాక్యతగా గర్హించారు. శ్రీ ఎన్. టి. ఆర్‌కు బలం నిరూపించుకోవడానికి రెండ్రోజులపాటు కాలవ్యవధి ఇవ్వకపోవడం అన్యాయమనీ, మెజారిటీ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడం ప్రజా స్వామ్యాన్ని నిలువునా ఖూనీ చేయడమేననీ, గవర్నర్‌ను వెంటనే డిస్‌మిస్ చేసి, మెజారిటీ వున్న శ్రీ ఎన్.టి.ఆర్‌కు మళ్ళీ పట్టంకట్టాలనీ- ప్రజాభిప్రాయం దేశం నలుమూలల నుంచీ వెల్లువలా ఉప్పొంగింది. శ్రీ ఎన్ టి.ఆర్ తన బలాన్ని రాష్ట్రపతి వద్ద కూడా ప్రత్యక్షంగా ప్రదర్శించాడు. పార్లమెంట్‌లో ప్రతిపక్ష నాయకులు ఈ అక్రమచర్యను తీవ్రంగా ఖండించారు. శ్రీ ఎన్.టి ఆర్ ప్రభుత్వాన్ని అన్యాయంగా బర్తరఫ్ చేసిన విషయం జాతీయ పొలిమేరలు దాటి అంతర్జాతీయ రాజకీయ రంగాని కెక్కింది. విదేశ పత్రికలూ, రేడియోలూ ఈ ప్రజావ్యతిరేకతను వ్యక్తపర్చాయి. ఆందోళన దశదిశలూ వ్యాపిస్తున్నా- ఇంకేం జరుగుతుందోనన్న ఉత్కంఠ ప్రజల్లో శిఖరాగ్రస్థాయిలో నిలిచేఉంది. బలాబలాల నిర్ధారణ విధానసభలో జరగాల్సి వుంది.

గవర్నర్ శ్రీరామలాల్ ఆగస్టు 24న రాజీనామా చేయడం రాజకీయ నాటకంలో మరో అంకంకి దారితీసింది. అది రాజకీయ వ్యూహంలో ఒక భాగమేనని పలువురు విజ్ఞులు భావించడం జరిగింది. విధానసభను ఎప్పుడు సమావేశపరుస్తారు? బలాబలాల ప్రదర్శనకు ఎప్పుడు వేదికను సిద్ధపరుస్తారు? అప్పటివరకూ ప్రజాస్వామ్య పరిరక్షణకోసం దేశవ్యాప్తంగా ఉద్యమం

కొనసాగవల్సిందేనా? ఈ ఉద్యమాల్లో, ఆందోళనల్లో, బంద్‌లలో, ప్రజానిరసన సభల్లో ఎంతమేరకు ధన, జన నష్టం జరగాల్సి వుంది?

అస్తవ్యస్తంగా, అసందిగ్ధంగా, అనిశ్చితంగా, అయోమయంగా ఉన్న ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు ఎంత త్వరగా పరిష్కారమైతే రాష్ట్రానికి, దేశానికి అంత మంచిదని భావించవచ్చు.

సాయంకాలం ఆఫీసు వొదిలాక ఓ ఫ్రెండ్ ఇంటికెళ్లి, ఆ తర్వాత ద్దరూ కలిసి నికాంక్లబ్ కెళ్లి, ఓ గంటసేపు 'తీర్థప్రసాదాలు' సేవిస్తూ కులాసాగా కబుర్లు చెప్పుకొని, ఇంకా అయిదు నిముషాలకు ఎనిమిది అవుతుందనగా ఇంటికొచ్చాడు మురళీమోహన్‌రావు తేలిపోయే కళ్ళతో, బరువెక్కిన మొహంతో, చెదిరిన క్రాపుతో.

"ఇప్పటిదాకా ఆఫీసుందా?" అంది భార్య కనుబొమలతో వెక్కిరిస్తూ.

"నేను ఆఫీసర్ని. ఇరవై నాలుగు గంటలూ నాకు ఆఫీసు డ్యూటీయే!— ఆఫీసులో వున్నా ఆఫీసు అవతల వున్నా" అన్నాడు మురళీమోహన్‌రావు టి. వి. కి మూడు మీటర్ల దూరంలో ఫ్రేంకుర్చీలో కూర్చుంటూ.

"ఈ కోతలకేంలెండి! కొయ్యడానికి మార్కెట్‌లో సొరకాయలు కూడా మండిపోతున్నాయి. భోజనం వడ్డించమంటారా? నిషా దిగేవరకూ వుంటారా?" అంది రామేశ్వరి డైనింగ్‌టేబుల్ మీద పళ్ళాలు సర్దుతూ.

"అసలు ఆడవాళ్ళతో వున్న చిక్కే ఇది. మొగుడు గంట లేటుగా ఇంటికొస్తే ఏ బార్‌కో, క్లబ్‌కో వెళ్ళి కుతికెమీర తాగొచ్చాడని అనుకుంటారు. అదే గంటముందుగా ఆఫీసు వొదిలి, ఆరు పెగ్గులు ఏ బార్‌లోనో పుచ్చుకొని, బుద్ధిమంతుడిలా అయిదుంబావుకు ఇంటికొస్తే అవగింజలో అరవై ఆరో వంతు కూడా అనుమానపడరు" అంటూ డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చున్నాడు మురళీ మోహన్.

పళ్ళెంలో కూరలూ, అన్నం వడ్డించి – తాను వడ్డించుకుంది రామేశ్వరి. అప్పటివరకూ భార్యాభర్తల మధ్య వాతావరణం మబ్బువిడిచిన వెన్నెల్లాగానే వుంది.

"మా అన్నయ్య ఉత్తరం వ్రాశాడు" అంది రామేశ్వరి నిశ్శబ్దాన్ని నిలువునా చీలుస్తూ.

"ఏమని?" అన్నట్టు ఆమెకేసి చూశాడు మురళీమోహన్‌రావు పకోడితో వేయించిన వంకాయవేపుడు కలుపుకుంటూ.

"అదే పంటడబ్బు ఓ నెలరోజుల్లో పంపిస్తాడట. రావాల్సిన బిల్లులు ఇంకా రాలేదట. మీకంత అర్జంటయితే ఎక్కడయినా తీసుకొని పంపిస్తానన్నాడు."

నోట్లో ముద్ద పెట్టుకోవడం మానేశాడు మురళీమోహన్‌రావు

"ఈ కూరగాయల కబుర్లకేమొచ్చె! మూడునెల్లనాడు ధాన్యం అమ్మాగా ఆ డబ్బుకోసం రెండుత్తరాలు రాసి, ముగ్గురికి కబురుపెడితే—ఇదా సమాధానం! మీవాళ్ళంతా ఇంతే! అప్పు దొరికిందంటే అమ్మాయి పెళ్ళి కుదిరినంత ఆనందపడతారు; అది తీర్చాలంటే పుత్రుడు పోయినంత దుఃఖపడతారు." అన్నాడు మురళీమోహన్‌రావు తుస్కారంగా.

తన వాళ్ళను అంత తేలిగ్గా మాట్లాడేసరికి రామేశ్వరి మొహం కోపోద్రేకాలతో తాటిపండులాగా ఎర్రబడింది. అమె కళ్ళల్లో నీళ్ళు కదిలాయి; ముక్కుపుటాలు అదిరాయి; కనుబొమలు ముడిపడ్డాయి. ఒకపట్టాన గొంతులోంచి మాటలు పూడిరాలేదు. ఒక నిముషంపాటు మొగుడికేసి కళ్ళప్పజెప్పి తీక్షణంగా చూస్తూ కూర్చుంది.

"మా వాళ్ళంతా యింతేనా! ఎంత మాటన్నారు! మా వాళ్ళు మీకేం డబ్బు ఎగవేశారు? పెళ్ళికి వారంరోజులకు ముందుగానే కట్నండబ్బు మీ నాయన పుచ్చుకున్నాడుగా! పెళ్ళిరోజు మీ చెల్లెలికి పెట్టిన రత్నావళి రంగు కలనేత కంచిపట్టు చీర బాగోలేదని మూతి మూడువంకర్లు తిప్పితే, మళ్ళీ పన్నెండొందలు పెట్టి మరో రంగులో కొనిచ్చాం, గుర్తులేదూ! మీ అమ్మా, నాన్నా రాక్షసులు. పిసినారి వాళ్ళు. ఎప్పుడైనా కోడలు పండక్కి ఇంటికెళ్ళితే జాకెట్టుగుడ్డ కూడా పెట్టరు. నాలుగు కూరలొండితే నాలుగు రూపాయలు అయిపోతాయనే రకం. మీ అక్కచెల్లెళ్ళ సంగతి చెప్పనే అక్కర్లేదు. ధనియాల ఖాతాగాళ్ళు. ఏదో గురివెంద గింజ సామెతగా.. మీ వాళ్ళల్లో యిన్ని లోపాలు పెట్టుకొని మావాళ్ళ నంటారా?" అంది రామేశ్వరి ఆడపులిలా గాండ్రుపెడుతూ.

మురళీమోహన్‌రావు కపాళంలోకి ఎక్కిన విస్కీ నిషా మువ్పాతిక మువ్వీసం దిగొచ్చింది. ఆ నిషా స్థానే కోపం ఆక్రమించింది.

"మీ నాన్న మోసగాడు. కట్నం తాలూకు పదివేలు ఇవ్వకుండానే 'అదుగో, ఇదుగో' నంటూ పరలోకానికి టపాకట్టేశాడు. శోభనంనాడు స్కూటర్

"కొనిస్తానని మీ అమ్మ బింకాలు పలికి, శోభనమై పదేళ్లు గడిచినా, ఇద్దరు పిల్లలు పుట్టినా ఇప్పటికి అతీగతీ లేదు. పైసాకు పైసా ముడుపుకట్టి కూతుళ్ళకు దోచిపెడు తూంది. మీ అన్నయ్య సంగతి, తమ్ముల సంగతి నా నోటిమీదుగా నేను చెప్ప నక్కర్లేదు. వాళ్ళను గురించి వూళ్లోవాళ్ళే చెబుతారు."

"మీ నాన్న మోసగాడు. మీ అమ్మ మోసగత్తె"

"మీ అమ్మ"

"మీ వాళ్లు...."

"మీ గుంపు...."

—అ విధంగా భార్యాభర్తలు రోషంగా, జేవురించిన ముఖాలతో పోట్లాడుకున్నారు.

అన్నంతినే కంచాన్ని వొదిలేసి చివుక్కున లేచింది రామేశ్వరి.

మురళీమోహన్‌రావు కంచంలోనే చేతులు కడిగి, బెడ్‌రూమ్‌లో పడు కున్నాడు దుస్తులు మార్చుకోకుండానే.

ఆ రాత్రి అ భార్యాభర్తల మధ్య మరి మాటలు లేవు.

రామేశ్వరి పిల్లల బెడ్‌రూమ్‌లోనే పడుకుంది తనవాండ్లను తల్చుకుంటూ.

మురళీమోహనరావు ఒంటరిగా డబుల్‌కాట్స్ మీద అటూ ఇటూ దొర్లుతూ ఏ అర్ధరాత్రికో నిద్రకొరిగాడు.

'మమ్మీ! మమ్మీ!' అంటూ పిల్లలు కేకలేస్తూ ఇంట్లో తిరుగుతూంటే చటుక్కున లేచాడు మురళీమోహన్‌రావు.

ఇంట్లో రామేశ్వరి లేదు. ఓ చీటీ వ్రాసిపెట్టి ఆ రోజు ఉదయం కృష్ణా ఎక్స్‌ప్రెస్ ఎక్కిందామె. ఆ చీటీలో ఇట్లా వుంది. "నేను మా అన్నయ్య దగ్గర కెళుతున్నాను, రెండ్రోజుల్లో పంటడబ్బు తీసుకొస్తాను—రామేశ్వరి"

*తన భార్యతరపు బంధువుల్ని భర్త నిందించరాదు*




తూర్పుకొండ మెల్లమెల్లగా వెలుగుని సంతరించుకొంటూ లేత్రాయపు బంగారుకాంతు లీనుతోంది. చీకటి ముసుగుని విదిలించి స్వచ్ఛమైన నీలి రంగులోకి మారుతోంది అనంతాకాశం. చెట్లమీద సేదదీరిన కాకులు, గువ్వలు, పిచ్చుకలూ మొదలైన పక్షులు రకరకాల కూతలతో లోకాన్ని లేపుతూ రెక్కల చప్పుళ్ళతో మరో మధురమైన రోజుకి స్వాగతం పలుకుతున్నాయి. వూరు వళ్ళు విరుచుకొని కళ్ళుతెరిచింది. ఆ వూరికోటి వురి మధ్యలోనున్న జమీను కూడా మేల్కొంది.

ఆ జమీనుకి ముఖ్యుడైన ధర్మయ్య అతి ముఖ్యమైన పనిమీద తన వూతకర్ర సాయంతో ఎక్కలేక ఎక్కాడు ఆ మేడమెట్లు. అతనికి అలసట ఎక్కువయింది. గోడను ఆసరాజేసుకొని కొంచెంసేపు నిలబడి తలుపు మీద 'టకటకా' శబ్దం చేశాడు.

అతని అలసట అయితే తగ్గింది గాని తలుపులు తెరుచుకోలేదు. అలక్ష్యాన్ని భరించలేని ధర్మయ్య కిటికీలోంచి లోపలికి తొంగిచూసి చకితుడయ్యాడు.

విజయ్ చేతిలో....ఫ్రేమ్‌లో బిగించిన అతని భార్య శ్యామల ఫోటో సున్నితంగా నలిగిపోతోంది. దాదాపు ఆ పెద్ద ఫ్రేమ్‌ని కౌగిలించుకొనివున్నాడు విజయ్. అతని కళ్ళవెంట కారిన నీటి బిందువులు స్పష్టంగా అతని చెక్కిలి మీద జారుతున్నాయి. అతను ఎంతసేపట్నుంచో అలా కూర్చొనివున్నట్టు అతని వునికే విశదపరుస్తోంది.

అలా అతన్నే చూస్తున్న ధర్మయ్య కంటివెంటకూడా కన్నీ రొలికింది. అందుకు కారణం లేకపోలేదు........

విజయ్ తండ్రి జగన్మోహన్‌రావ్ బహద్దూర్ అవసానదశలో గుమస్తాల్లో నమ్మకస్తుడైన ధర్మయ్యకి అతని పదేళ్ళ కుమారుడ్ని, ఆ ఎస్టేట్‌ని అప్పజెప్పి కన్నుమూశాడు. ఆనాటినుండీ ధర్మయ్య విజయ్‌ని కంటికి రెప్పలా కాపాడి పెంచి పెద్దచేశాడు. విజయ్ ప్రేమించానన్న శ్యామలనే తెచ్చి పెళ్ళి జరిపించడమే గాకుండా అతని తండ్రి అప్పజెప్పిన ఎస్టేట్‌ని కూడా తిరుగులేకుండా అతని స్వాధీనం చేశాడు.

కానీ విధి వక్రించింది....

విజయ్ భార్య శ్యామల ఓ ఆడబిడ్డను కని పురిటిలోనే కన్నుమూసింది. జమీన్‌కే విచారకరమైన ఆ వార్త విజయ్ హృదయాన్ని కలిచివేసింది.

ఆమెనుండి ఆతను ఎన్నో అనుభూతుల్ని మిగుల్చుకున్నాడు. ఆమెను మరిచిపోలేనంత అనురాగాన్ని విజయ్ హృదయంలో నింపి చప్పున తప్పుకుంది శ్యామల. ఆమె మరణం అతన్ని వివశుణ్ణి చేయడమేగాక, ఆమె జ్ఞాపకాలనుండి తప్పుకోలేనంత బలహీనుణ్ణి చేసింది. అందుకే ఎక్కువకాలం శ్యామల ఫొటో ముందు కూర్చొని గతస్మృతులు నెమరువేసుకోవడం అలవాటు చేసుకున్నాడు విజయ్. ఎక్కువ కాలం గదిలోనే గడుపుతున్నాడు. ఎప్పుడోగాని బయటకురాడు. వచ్చినా ఎక్కడికి వెళ్తాడో, ఎప్పుడు తిరిగివస్తాడో ఎవరికీ అర్థంకావడంలేదు. మనిషి దినదినానికి చిక్కి నీరసించిపోతున్నాడు.

"ప్రేమ గుడ్డిది" అన్న సూక్తి వాడుకలోవున్నా "మితిమీరితే ప్రేమ పిచ్చిని కూడా ప్రాప్తిస్తుంది" అన్న నిజాన్ని నిరూపిస్తాడా అన్న భయాన్ని కలగ జేస్తున్నాడు.

ఆతని ప్రవర్తనకి నౌకర్లుకూడా విస్తుపోయారు. ఎన్నోసార్లు ధర్మయ్యకి తాము చూసింది చూసినట్లు చెప్పారు. కానీ ధర్మయ్య మాత్రం ఏం చెయ్యగలడు.. ?

'నారు పోసినవాడు నీరుపోయక మానడు' అన్న మనస్తత్వమున్న ధర్మయ్య....కొన్నాళ్ళకి విజయ్‌బాబు తనను తానే అర్థంచేసుకుంటాడు.... మామూలు మనిషిగా మారిపోయి అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేస్తాడు' - అని తన మనసుకి సమాధానం చెప్పుకునేవాడు.

కానీ ఆత ననుకొన్నది జరగలేదు....యీనాడు యదార్థం కళ్ళముందే కనిపించింది.

యీ లోకంలో అనేక రకాలయిన మానవులు జీవిస్తున్నారు. కానీ, అను రాగం, మమత, ఆప్యాయతలు అందరికీ స్వంతం కావు. అవి కొంతమందికే పరిమితం. అది భగవంతుని సృష్టిలోని గూఢమైన యదార్థం.

ఆ గదిలోని దృశ్యం ధర్మయ్యని కదిలించింది. అతని హృదయాంత రాళాల్లో ఆలజడి తెచ్చింది.

విజయ్—శ్యామలల ఆనందమయ సంసారాన్ని చూశాడు ధర్మయ్య వాళ్ళ మధ్యనున్న ఆన్యోన్యత, అనురాగాలకు ఆనందించాడు. యీనాడు శ్యామల లేని విజయ్ దుర్భరస్థితినీ గమనించాడు.

చెమ్మగిలిన కళ్ళను వుత్తరీయంతో ఒత్తుకొంటూ మరికాస్త పెద్దగా విని పించేట్టు తలుపు తట్టాడు.

విజయ్ వూహకి అంతరాయం కలిగింది. చివుక్కున తలఎత్తి చూశాడు. ఎవరో తలుపు తడుతున్నట్టు గమనించాడు. ఫోటోని టేబుల్‌పై వుంచేసి వెళ్ళి తలుపులు తెరిచాడు. ఎదురుగా ధర్మయ్య....దారికి అడ్డుతొలగి ప్రక్కనున్న అద్దంలోకి చూశాడు విజయ్. అతని వునికి అతనికే వెగటనిపించింది.

వుబ్బిన కళ్ళు, చెంపలమీద పీటిచారికలు, అస్తవ్యస్తంగా రేగిపోయిన జుత్తు....

వెంటనే బేసిన్‌దగ్గరికెళ్ళి ముఖాన్ని శుభ్రంగా కడుక్కున్నాడు. తల వెంట్రుకలు సర్దుకొని లోనికొచ్చి కూర్చున్న ధర్మయ్య కెదురుగా తనూ కూర్చొంటూ ప్రశ్నార్థకంగా చూశాడు విజయ్.

తన్ని తాను సర్దుకొంటూ "మీరింకా యిలాగే వుండిపోయారా బాబూ"? అన్నాడు ధర్మయ్య.

"మరింకెలావుండాలి!" విజయ్ కంఠం విసుగ్గా ధ్వనించింది.

ఆ రోజు ఆ వూరికో పర్వదినం. ఆ చుట్టుప్రక్కలా పదిపదిహేను గ్రామాలకు హైస్కూల్ సౌకర్యం లేదు. విజయ్ ఎక్కువ మొత్తం ఖర్చుచేసి ఆ వసతి కల్పిస్తున్నాడు. అదంతా ధర్మయ్య సలహా మీదనే జరిగింది. అంతా ధర్మయ్య దగ్గరుండి చూసుకున్నాడు. ఆనాటి స్కూల్ ప్రారంభోత్సవం ఒక విధంగా ఆ వూరికంతా పండుగనిపించుకొంటోంది. అతి ఘనంగా జరగబోయే ఆ ప్రారంభోత్సవానికి హైదరాబాదు నుండి మంత్రిగారు కూడా వస్తున్నారు

ముహూర్త సమయం దగ్గర పడుతున్నా విజయ్ మాత్రం ఎటువంటి ఆర్భాటమూ లేకుండా గదిలోనే వుండిపోయాడు. "ఇంకా యిలాగే వున్నారే" అని ప్రశ్నించిన ధర్మయ్యని "యింకెలా వుండాలి?" అని ఎదురుప్రశ్న వేస్తున్నాడు.

"అదికాదు బాబూ. మీ నాన్నగారి జ్ఞాపకార్థం కట్టించిన స్కూలది. ముహూర్తం వేళ దగ్గరపడుతోంది. మినిస్టర్‌గారు కూడా వచ్చే వేళయింది. కనీసం మీరు ఆ స్కూలు దోనర్‌గానైనా అక్కడుండాలిగా" సౌమ్య స్వరంతో అన్నాడు ధర్మయ్య.

విజయ్ వందనం వన్నె తరిగింది.

"క్షమించండి. ప్రస్తుతం నే నక్కడికి రాలేను" అని అనకుండా వుండ లేకపోయాడు. విజయ్ కళ్ళు శ్యామల ఫోటోమీదనే నిల్చివున్నాయి.

అతని మనస్సుని అర్థంచేసుకోగలిగాడు ధర్మయ్య.

"అవును బాబూ. మా కళ్ళకి కనువిందుగా కనిపిస్తూవుండిన మీ జంటలో ఒకరు లేకపోవడం మాకూ విచారాన్ని కలిగిస్తోంది. పెద్దవాడిగా మీకు నాదో సలహా.... ..."అంటూ ఆగాడు ధర్మయ్య.

"ఏమిటది....?" ముఖం చిట్లించాడు విజయ్.

"మీరు త్వరలో ఒక యింటివారు కావాలి."

"ధర్మయ్యా!"....అది కేక కాదు. పిడుగు. ఆ గదంతా దద్దరిల్లినట్టయింది.

వినరాని మాట తన చెవిన పడ్డట్టు విలవిలా తన్నుకుంది విజయ్ హృదయం.

క్షణం తర్వాత తమాయించుకొన్నాడు. తన తప్పు తనకే తీక్షణంగా అర్థమైపోయింది. తండ్రిలా పెంచిన ధర్మయ్యను అలా ఎప్పుడూ అగౌరవ

పరచలేదు. విచక్షణ కోల్పోయి పేరుపెట్టి అరవలేదు. కానీ అరిచాడు.... త్రుటిలో తప్పు జరిగిపోయింది.

విజయ్ హృదయం స్పందించింది.

ఎదురుగా వున్న ధర్మయ్య మనస్సు చివుక్కుమంది.

"క్షమించండి. ఆవేశంలో నన్ను నేనే మర్చిపోతున్నాను".... ధర్మయ్య కేసి చూసేందుకు మనసొప్పక తల దించుకున్నాడు విజయ్.

ధర్మయ్య కళ్ళు సామభూతిని వర్షించకుండా వుండలేకపోయాయి. దయ చేసి యిక ముందెప్పుడూ నా ముందు పెళ్ళి ప్రస్తావన ఎత్తకండి" అన్నాడు విజయ్ వికల మనస్సుతో.

"అదికాదు బాబూ........"

"ప్లీజ్ ... యిప్పుడు మన మెక్కడికి వెళ్ళాలి .. ... ఎవ్. స్కూల్‌కు కదూ. పదండి" మేడమెట్లు దిగాడు విజయ్.

## 2

గదిలో కూర్చొనివున్న విజయ్ దగ్గరికి ఒక్కుమ్మడిగా పనివాళ్ళందరూ కట్టకట్టుకొని వచ్చారు.

వాళ్ళని చూసి విస్తుపోయాడు విజయ్. "ఏవిటిలా వచ్చారు?" అని అనకుండా వుండలేకపోయాడు ముందు ఎవరికీ ధైర్యంచిక్కలేదు లోలోపలే భయపడుతూ నిల్చున్నారు.

"ఏవైంది?" అన్నాడు విజయ్ రెట్టింపుగా. "మీ రెప్పుడూ అమ్మాయిగారి ఫోటో ముందు కూర్చోవడం బాగాలేదు బాబూ"- భయంతో పెదాలు ఆడించినా ముందుగా వంటావిడ మంగమ్మే ధైర్యంచేసింది.

అప్రతిభుడై చూశాడు విజయ్. వాళ్ళెందుకొచ్చిందీ అతని కర్థమైంది. అందరూ మంగమ్మ మాటనే బలపరుస్తున్నట్టు అర్థంచేసుకున్నాడు.

"అవును బాబూ. మీకు మేము చెప్పేటంతటోళ్ళం కాదు. మీరలా మనోవేదనతో కృంగిపోవడం మమ్మల్ని ఎన్నాళ్ళిలా చూడమంటారు బాబూ. చచ్చిపోయినోళ్ళు మళ్ళీ తిరిగిరారుగా. తిన్నగా అమ్మాయిగార్ని మర్చిపోండి" అణకువగా పలికింది మంగమ్మ గొంతు.

కళ్ళప్పగించి అందరికేసి చూస్తూ వుండిపోయాడు విజయ్. వాళ్ళని సమాధానపరచడం ఎలా? -"యం[illegible]వాద్"

తులసీ [illegible] పత్రి

"[illegible]వండి.

"అందుకే మంగమ్మా అందుకే శతవిధాలా ప్రయత్నిస్తున్నాను" అన్నాడు పూడుకుపోయిన గొంతుతో.

"మీరిలా ఎప్పుడూ ఆమె ఫోటోముందు కూర్చుంటే ఆమెని మరువలేరు బాబూ" అన్నాడు పాలేరు పాపయ్య.

అతని పక్కనే నిల్చున్న మూగ పాలేరు కన్నయ్య కూడా తన మూగ భాషలో, ప్రవర్తనలో విజయ్‌ని అర్థిస్తున్నట్టుగా నిల్చొని వున్నాడు.

అందరి కళ్ళూ ప్రశ్నార్థకంగా విజయ్ మీదనే వున్నాయి "మరి నన్నేం చెయ్యమంటారు"? విసుగు ధ్వనించింది విజయ్ కంఠంలో.

"మీరు మళ్ళీ పెళ్ళిచేసుకోవాలి" పాపయ్య కంఠం ఖరేల్ మంది.

కన్నయ్య మూగభాషలో సంతోషాన్ని వ్యక్తం చేశాడు అందరూ విజయ్ సమాధానం కోసం ఎదురుచూస్తున్నారు.

విజయ్ కడుపులో చేయి పెట్టి కెలికినట్టయింది తన కిష్టంలేని పనికి అందరూ బలవంత పెట్టడం అతని కెంతమాత్రమూ నచ్చలేదు

శ్యామల అతని హృదయేశ్వరి ఆరాధ్య దేవత అతని స్మృతి పథం నుండి ఆమె బొమ్మ చెరిగిపోవడం కష్టసాధ్యం

"పాపయ్యా! మరింకెప్పుడూ అలా మాట్లాడకు. యిక్కణ్ణుంచి వెళ్ళిపో" గద్దిస్తున్నట్లుగా అన్నాడు విజయ్. అతనిలో హృదయఘాతం ఎక్కువయింది.

పనివాళ్ళందరూ కించిత్ భయపడ్డారు. కాపీ అడుగు వెనక్కి వేయలేదు.

"మీకే చెప్పేది దయచేసి వెళ్ళిపోండి" అర్థింపుగా వున్నాయి విజయ్ చూపులు.

"ఆ మాటకొస్తే మీరిలా బాధపడిపోవడం మేం చూళ్ళేం బాబూ. మీరు మళ్ళీ మునుపటి మనిషిగా మారాలి ఆడకూతురు లేకపోతే యిల్లెంత వెలవెల బోతోందో చూడండి పైగా చిట్టెమ్మని చాకడానికి తల్లి కావాలి కదా!"

చనువుగా మాట తూలినా పాపయ్య యదార్థం మాట్లాడాడనిపించింది విజయ్‌కి.

"అవును బాబూ. మీరు తప్పక పెళ్ళిచేసుకోవాలి"- అన్ని కంఠాలు ముక్తకంఠంగా మారాయి.

ఏమ్మాట్లాడాలో పాలుపోక నిలబడిపోయాడు విజయ్ ఓ ప్రక్క అతని మనస్సు గింజుకొంటూనే వుంది. పనివాళ్ళు తాడో పేడో తేలందే అక్కణ్ణుంచి కదిలేట్టు లేరు!






ఆపద్బాంధవుడిలా ధర్మయ్య అక్కడికొచ్చాడు.

విజయ్ మనస్సు తేలికయింది.

"చూడండి. వీళ్ళంతా నన్ను అనవసరంగా సతాయిస్తున్నారు నా మనస్సు నర్థంచేసుకోకుండా మళ్ళీ పెళ్ళిచేసుకోమని బలవంతపెడుతున్నారు దయచేసి మీరైనా వీళ్ళకి నచ్చజెప్పండి" అంటోన్న విజయ్‌కేసి అదోరకంగా చూస్తూ నవ్వాడు ధర్మయ్య.

అతనెందుకు నవ్వాడో విజయ్‌కి అర్థంకాలేదు.

"అవును బాబూ మీరే వాళ్ళని తీక్షణంగా అర్థంచేసుకోలేదనిపిస్తోంది నాకు. వాళ్ళు చెప్పిందాంట్లో అన్యాయమేముంది చెప్పండి. యిల్లాలుంటే యిల్లంతా కళకళలాడుతుందనే కదా వాళ్ళంటున్నారు" అంటూ పనివాళ్ళ పలుకుల్ని బలపరిచాడు ధర్మయ్య.

స్థబ్దుగా నిలబడిపోయాడు విజయ్. ఎదురుగా కనిపించిన దారి కూడా వున్నట్టుంది మూసుకున్నట్టయింది విజయ్‌కి.

"ఆలోచించకండి విజయ్‌బాబూ మీరు పెళ్ళిచేసుకొని మరెవరికీ అన్యాయం చేయడంలేదుగా. యీ యింటికి యిల్లాలిని తీసుకొచ్చి తల్లిలేని బిడ్డకి తల్లిని ఏర్పరచడమేగాకుండా యీ యింటికి మరో రకమయిన శోభను సంతరింపజేస్తున్నారు. అంతే " అన్నాడు ధర్మయ్య సౌమ్యకంఠంతో.

అక్కడి వారినందరినీ శాసించగల అధికారం విజయ్‌కొక్కడికే వుంది. కానీ అలా చేయలేడు విజయ్ ఎందుకేతనంటే

వాళ్ళలో మంచితనముంది అతనంటే యజమాననే గౌరవమర్యాదలే గాకుండా ప్రేమాభిమానాలు పుష్కలంగా వున్నాయి. ఆ అమాయక ప్రాణాలన్నీ విజయ్ జీవితంతో పెనవేసుకొనే వున్నాయి.

వాళ్ళనుండి తప్పుకోలేక వాళ్ళనే చూస్తూ నిలబడిపోయాడు విజయ్.

3

డ్రైవర్ చేతిలో కీలుబొమ్మలా అతనాడించినట్టాడి పది గంటలకల్లా రామ్‌నగర్ చేరుకుంది పచ్చరంగు ఫియట్ కారు.

రామ్‌నగర్ పట్టణం కాకపోయినా విశాలమైన వీధులతో, గులకరోడ్డుతో పల్లె వాతావరణాన్ని జ్ఞప్తికి తెస్తోంది. వీధులు మరీ రద్దీలేకపోయినా పిల్లలు గోలతో సందడి కల్పిస్తున్నాయి

కారు స్పీడు తగ్గించి చావిడికి దగ్గరగా ఆపిన డ్రైవరు కారుచుట్టూ మూగిన పిల్లల్ని కసురుకుంటూ అక్కడే కూర్చొనివున్న వ్యక్తి నడిగాడు "ముకుందంగారిల్లెక్కడా ?" అని.

"అదిగో! ఆ కనిపించే రామాలయానికి కుడిప్రక్క కనిపించే పెంకిటిల్లే" అన్నాడా వ్యక్తి కారులోని మనుష్యులకేసి పరీక్షగా చూస్తూ.

కారుని ముందుకి పోనిచ్చి పెంకుటింటి ముందాపాడు డ్రైవరు.

కారు శబ్దం విని ముకుందం బయటికొచ్చాడు. కారులోంచి దిగిన ధర్మయ్య వేపు, స్కూల్ హెడ్మాష్టరు రాఘవయ్య వేపు ఆనందంగా చూస్తూ లోనికి ఆహ్వానించాడు

ఇల్లు చాలా పెద్దది కాకపోయినా పొందిగ్గా వుంది. ఏవి ఎక్కడుండాలో అక్కడ అమర్చి అందాన్ని సంతరింపజేస్తోంది.

కాంపౌండులోని రెండు కొబ్బరిచెట్లు అంగరక్షకుల్లా నిల్చొని వింజామరలు విసురుతున్నట్టున్నాయి.

చిన్న పందిరికి అల్లిన సన్నజాజి నుండి పరిమళం ముక్కుపుటాలను తాకుతోంది

లోనుండి సంగీత మాధుర్యమైన స్త్రీ కంఠంనుండి "శుక్లాంబరధరం " కర్ణపుటాలను తాకుతోంది

అతిధులు కూర్చోగానే అందమైన ముఖవర్చస్సులో లక్ష్మీదేవిలాంటి అమ్మాయి దేవుడి గదినుండి బయటకొచ్చింది.

అతిధులిద్దరూ ఆమెకేసి ఆనందంగా చూశారు

మంచి అంగసౌష్టవం పచ్చని బంగారు ఛాయ చూడ ముచ్చటగా వుంది

లోనికెళ్ళి అతిధులిద్దరికీ చెరోగ్లాసు మంచితీర్థం తెచ్చి అందించింది. ముగ్దులౌతూ అందుకున్నారు ఇద్దరూ

"నీ పేరేమిటమ్మా" అన్నాడు ధర్మయ్య.

"లక్ష్మి."

తామరల్లా వికశించిన ఆమె కళ్ళు టపటపా కొట్టుకున్నాయి సిగ్గుతో బుగ్గలు చొట్టలుబడ్డాయి

పెద్ద ఆడంబరాలు కనిపించకుండా అతి సామాన్యమైన వాయిల్‌చీరలో ఎంతో హుందాగా కనిపించింది లక్ష్మి

విజయ్‌బాబుకి సరిపోయే జోడీ అని అనుకున్నాడు ధర్మయ్య. ఖాళీగ్లాసు లందుకొని లోనికెళ్ళిపోయింది లక్ష్మి

రాఘవయ్యకేసి విషయం కదపమన్నట్టు చూశాడు ధర్మయ్య. ఎదురుగా కూర్చొన్న ముకుందానికేసి చిరునవ్వు నవ్వాడు రాఘవయ్య. "లక్ష్మిని విజయ్ బాబుకి అడగాలని వచ్చాం" అన్నాడు సంభాషణ పొడిగించకుండా.

నమ్మలేనంత ఆశ్చర్యంగా చూశాడు ముకుందం.

వాళ్ళెంతసైక్కడ? తవెంతసైక్కడ? నక్కకీ నాగలోకానికీ వున్నంత తేడా లేదూ? ఇది సంభవమా?

ముకుందానికి పూర్తిగా నమ్మకం కుదరలేదు.

"విజయ్‌బాబు మీకు తెలుసనుకుంటాను. ఆయన భార్య శ్యామలగారు యీ మధ్యనే పోవడంతో రెండవపెళ్ళయింది. అతని వయస్సు మీకు తెలిసిందేగా మీ కిష్టంలేకపోతే యిందులో బలవంతానికి తావులేదు. ఆలోచించుకొనే మీ అభిప్రాయం చెప్పండి" అన్నాడు ధర్మయ్య.

"అహహ అంత మాటనకండి మీ అంతటివారు వియ్యమందుతామని మా గడప తొక్కడమూ మేము కాదనడమూనా?" – తబ్బిబ్బవుతూ అన్నాడు ముకుందం.

'ఇది కలా? నిజమా?' అన్న అనుమానం అతన్ని వేదిస్తోంది. "సంతోషం. మీరు ఒకసారి జమీనుకి రండి అన్ని విషయాలూ అక్కడే మాట్లాడుకుందాం" అంటూ లేచాడు ధర్మయ్య. అతని తోటి రాఘవయ్య కూడా లేచి నించున్నాడు. తృటిలో లక్ష్మి లోపలినుండి వచ్చి వారి ముందు ప్రత్యక్షమయింది ఆమె చేతిలో రెండు కాఫీ కప్పులున్నాయి.

ఆమె ఆదరణ, అణకువకి ముగ్ధులౌతూ ఆమె అందించిన కప్పులను అందుకున్నారు అతిధులిద్దరూ. కాఫీ సేవిస్తూవుంటే వారి మనస్సుల్లో తియ్యని ఆలోచనలు పరుగులు తీశాయి 'యీ అమ్మాయి సాహచర్యంలో విజయ్‌బాబు మామూలు మనిషి అయితీరుతాడు' అన్న నమ్మకం యిద్దరిలో బలపడింది.

"వస్తాం" అని చెప్పి యిద్దరూ కారులో కూర్చున్నారు. కారు ఆ ప్రదేశాన్ని వదిలిపెట్టగానే ఆనందంగా లోనికొచ్చాడు ముకుందం.

అతని రాకకై ఎదురుచూస్తున్న లక్ష్మి ఆత్రుతను చంపుకోలేక "హెడ్ మాష్టరుగారితో వచ్చిన ఆ తాతగారెవరు నాన్నా?" అని అడిగింది తండ్రిని.

"ధర్మయ్య అని ప్రక్కవూరి జమీన్‌కి ముఖ్యుడమ్మా . అమ్మా లక్ష్మీ! మన రోజులు యిప్పుడే అదృష్టంలో అడుగు పెట్టబోతున్నాయమ్మా అందుకే వాళ్ళిద్దరూ ఈరోజు మన గడప తొక్కగలిగారు" అన్నాడు సగర్వంగా ముకుందం.

అతని మాటలోని అంతరార్థం లక్ష్మికి బోధపడలేదు.

"యింకా అర్థంకాలేదటమ్మా. నువ్వు మహారాణివి కాబోయే రోజులు దగ్గరపడ్డాయి. విజయ్‌బాబు నిన్ను పెళ్ళిచేసుకోబోతున్నాడు నా మనస్సుకి నచ్చివాళ్ళకి మాటిచ్చాను" అన్నాడు ఆనందంగా

అతని సంతోషాన్ని అడ్డుకోలేని లక్ష్మి మ్రాన్పడిపోయింది.

'తనకు, శ్రీమంతుల బిడ్డయిన విజయ్‌బాబుకి పెళ్లా?'

'ఇది ఎలా సంభవము?'

'ముందూ వెనకా ఆలోచించకుండా తండ్రి ఒప్పేసుకోవడమా?'

ఆలోచిస్తోంటే ఆమె మనస్సులో ఎన్నో సందేహాలు వుద్భవిస్తూనే వున్నాయి అందుకే ఆమె వూరుకోలేకపోయింది.

"తొందరపడ్డావేమో నాన్నా" అని అనకుండా ఉండలేకపోయింది

ఆమె అమాయకత్వానికి నవ్వుకున్నాడు ముకుందం

"తొందరపడకపోతే ఎలాగమ్మా, ఆ అవకాశాన్ని మరెవరయినా ఎత్తుకుపోరూ అది మామూలు సంబంధమా వదులుకోడానికి?" అతని మాటలు, చేతలు ఓ విధమైన రీవిని దర్పాన్ని సంతరింపజేసుకున్నాయి

"మీ కెప్పుడూ డబ్బు తప్ప మనుష్యుల మనస్సులు, వారి బాగోగులూ అక్కరలేదన్నమాట"— కొంచెం దుడుకుగానే అంది లక్ష్మి!

"అదేమిటమ్మా! యిప్పుడు నీ కేంలోటు చేశానని?"

తండ్రికి సమాధానమివ్వలేదు లక్ష్మి. కిటికీలోంచి శూన్యంలోకి చూస్తూ నిల్చుంది.

ఖంగుతిన్నాడు ముకుందం.

"ఏమిటమ్మా. ఈ సంబంధం నీ కిష్టంలేదా?" ఓదార్పుగా అడిగాడు.

"యిష్టంలేక కాదు నాన్నా?"

"మరి నీ అభ్యంతరమేమిటమ్మా?"

"అన్నయ్య హైదరాబాదు వెళుతూ ఏమన్నాడు?"

"ఏమన్నాడూ?"—ఎదురుప్రశ్న వేశాడు ముకుందం. కొడుకు పేరు వినగానే అతనిలో కొంచెం కోపం చోటుచేసుకుంది.

"అన్నయ్య అంగీకారం తీసుకొని నా పెళ్ళి నిర్ణయించమని అడిగాడా లేదా?"

"అయితే ?"

"అయితే ఏముంది అన్నయ్యా లేకుండానే మీరొక్కరే నిర్ణయం తీసుకున్నారుగా....?"

"తీసుకుంటాను. అది నా యిష్టమమ్మా" లక్ష్మిమాట పూర్తిగాకుండా దుడుగ్గా అనేశాడు ముకుందం.

"నీ పెళ్ళివిషయంలో వాడి బోడి అధికారమేవిటమ్మా. నా యిష్టమొచ్చి వాళ్ళకి నిన్నిచ్చి పెళ్ళిచేస్తాను అంతేగాని వాడి అంగీకారం పొందాల్సిన అవసరం నాకు లేదు. వాడికి పెత్తనమే యిస్తే నీకు పెళ్ళీ చెయ్యొద్దంటాడు. అసలు వాడొచ్చిందాకా ఆగితే ఈ సంబంధం ఆగుతుందా? లక్షాధికారి సంబంధం ఎవరైనా వింటే ఎగరేసుకుపోరూ" అంటూ కొన్ని వందల మైళ్ళలోఉన్న కొడుకుపై ఉక్రోషం కురిపించాడు ముకుందం.

"ఇంకెన్నాళ్ళు నాన్నా. రెండు నెల్లేగా. ఆ తర్వాత అన్నయ్యొచ్చేస్తాడు అప్పుడే అన్నీ మాట్లాడుకోవచ్చు" అంది లక్ష్మి దీనవదనంతో.

ముకుందం తోకత్రొక్కిన త్రాచులా లేచాడు.

"వాడి పెత్తనమేమిటమ్మా. అన్నీ విని అసలు సంబంధం వద్దనే వద్దు అంటాడు. వాడి సంగతి నాకు తెలియదా? వాడెప్పుడూ నాకు వ్యతిరేకమేగా. నే నొద్దనేకొద్దీ వినకుండా హైదరాబాదు వెళ్ళి చదువు వెలగబెడుతున్నాడు. అలాంటివాడికా నేనన్నీ చెప్పేది" విసురుగా అన్నాడు ముకుందం.

తండ్రిమీద కోపం వచ్చింది లక్ష్మికి.

తండ్రి కర్తవ్యం మర్చిపోయి చిల్లిగవ్వకూడా ఇవ్వనని మొండికెత్తినా లక్ష్మి అన్నయ్య రాఘవ తన కాళ్ళమీద తాను నిలబడి హైదరాబాదులో 'ఆటో మొబైల్' డిప్లొమా చేస్తున్నాడు. వారాలూ తింటూ, స్కాలర్‌షిప్ పొందుతూ చదువు వెళ్ళబుచ్చుతున్నాడు. అలాంటి ప్రయోజకుడైన కొడుకుని అభినందించక పోగా తూలనాడడం లక్ష్మికి తండ్రిమీద కోపాన్ని తెచ్చింది.

"ఎందుకు నాన్నా అన్నయ్యమీదలా కోపం పెంచుకుంటావ్? అన్నయ్య తప్పుచేశాడని? నువ్వు చదివించినంటే తన తెలివితేటలతో చదువు కోవడం తప్పా? చదువుకొని ప్రయోజకుడు కావడం తప్పా? ఏది తప్పు, చెప్పు నాన్నా?" ఆవేశంతో అడిగింది లక్ష్మి.

ముకుందం మరింత రెచ్చిపోయాడు.

"చాల్లేవమ్మా నాకే నీతులు చెప్పొచ్చావ్. గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించిందట....అలావుంది నీ వరస. ఇదిగో....ఇదే చెబుతున్నాను: ఏది ఎలావున్నా

పీ పెళ్ళి విజయ్‌బాబుతో జరగడం ఖాయం. యిటు సూర్యుడు అటు పొడిచినా తప్పేదేలేదు. అం." అంటూ తన నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించాడు ముకుందం.

వివశురాలై చూసింది లక్ష్మి. విహ్వల దృష్టితో అలాగే బొమ్మలా నిల్చుండిపోయింది.

ఆమెను చూస్తూ బెదిరిపోయాడు ముకుందం.

ఆమె దగ్గరగా నడచి అప్యాయంగా తన చేతిని కూతురి భుజంచుట్టూ చుట్టి గోడ దగ్గరికి నడిపించాడు. ఆ గోడకి లక్ష్మి తల్లి ఫోటో వ్రేలాడుతోంది.

"చూడమ్మా. ఆ ఫోటో లోకి చూడు. నిన్ను కన్న మూడోనాడే కన్ను మూసింది మీ అమ్మ. ఆనాటినుండీ నీకు 'అమ్మా–నాన్న' నేనే అయి పెంచాను. యింతదాన్ని చేశాను యీనాడు నామాట కాదంటావా తల్లీ. నేను పెద్దలకిచ్చిన మాట వమ్ముచేస్తావా తల్లీ" ప్రాధేయపూర్వకంగా అంటూ రెండు చేతులు గట్టిగా పట్టుకొని విలపించసాగాడు ముకుందం.

వుండేలు దెబ్బతిన్న గువ్వపిట్టలా గిజగిజలాండింది లక్ష్మి. చేసేది లేక వెక్కుతూ తండ్రి హృదయానికి హత్తుకుపోయింది.

## 4

చాలాకాలం తర్వాత కొబ్బరితోటలో అడుగుపెట్టాడు విజయ్. కాపుదారి కొండయ్య ఎదురొచ్చి స్వాగతం పలికాడు. తోటంతా తిరిగి చూసి ఓ ప్రక్కనున్న సిమెంటు దిమ్మెపై కూర్చొన్నాడు విజయ్.

ఆ ప్రదేశంలో అతినికెన్నో మార్పులు కనిపించాయి. అతను కూర్చొవున్న దిమ్మెకెదురుగా పెద్ద అంటుమామిడి చెట్టు వుండేది. ఎప్పుడూ పచ్చని ఆకులతో వింత సోయగాలందించే ఆ చెట్టు యిప్పుడు విజయ్ కంటికి కనిపించలేదు. అది వుండవలసిన స్థానంలో ఎండిపోయిన నల్లటి మోడు మాత్రమే కనిపిస్తోంది.

విజయ్ అనుమానాన్ని కొండయ్య గ్రహించాడు.

"ఆ చెట్టుమీద పోయిన వర్షాల్లో పిడుగుపడింది బాబూ. అప్పటి నుండి అది ఎండిపోయింది. ఒట్టి మోడు మాత్రమే మిగిలింది" అని వివరించాడు కొండయ్య.

విజయ్‌కి తల తిరిగినంత పనయింది.

తన భార్య శ్యామల మరణంతో మనోవేదనకు గురియైన తాను ఎంతో చిక్కిపోయాడు....

ఎన్ని కొమ్మలు విరిచినా, ఆకులు దూసిపోసినా. పెద్ద కొమ్మలు నరికినా చలించని మహావృక్షం సైతం ఒక్క పిడుగుపాటుతో నిర్జీవంగా తయారయింది

ఆలోచిస్తున్న విజయ్‌కి ఆ చెట్టూ, తానూ ఒకే రీతిలో వున్నట్టూ, మనిషికీ, చెట్టుకీ జీవితంలో పెద్ద తేడాలేనట్టు అనిపించసాగింది.

ఓనాడు అ చెట్టుక్రిందనే తన ప్రియాతిప్రియమైన శ్యామలతో తాను టీ త్రాగాడు.

• • •

ఆ పరిసరాలన్నీ తిరిగిచూసిన భార్యాభర్తలు ఎట్టకేలకు సిమెంటు దిమ్మెను చేరుకున్నారు.

బిస్కెట్‌ప్యాకెట్ విప్పి ఆమె కందించబోయాడు విజయ్. శ్యామల దాన్ని అందుకోలేదు సరికదా దూరంగా వెళ్ళి నిల్చొని ఎటో చూస్తూవుండిపోయింది. ఆమె వెనకాలే అడుగులు వేసి చిలిపిగా బిస్కెట్ ముక్కను ఆమె నోట్లో పెట్ట బోయిన విజయ్ ఆమె వారించడంతో విస్తుపోయాడు.

ఆమె ప్రవర్తన అతని కర్థంకాలేదు. ఏమిటన్నట్టు చూశాడు విజయ్. ఆమె నేలకేసి చూస్తూ నిల్చుంది.

"పోనీ టీ త్రాగు" అంటూ కప్పులో పోసి అందించాడు

శ్యామల దాన్ని సిప్‌చేసిందే గాని త్రాగలేకపోయింది బలవంతంగా త్రాగించాడు విజయ్ ఎన్నో క్షణాలు గడవకుండానే డోకు చేసుకుంది.

శ్యామల ప్రవర్తన విజయ్‌కి కోపాన్ని తెప్పించింది.

"ఏమైంది?" అన్నాడు చిరుకోపంగా

శ్యామల సమాధానం చెప్పలేదు.

"ఏమైందో చెప్పు శ్యామలా!" మళ్ళీ ప్రశ్నించాడు. ఆమె ముఖంలో నాట్యంచేసిన సిగ్గుదొంతరలను విజయ్ గ్రహించలేదు.

ఆమె మామిడిచెట్టు బోదనానుకొని నిల్చుంది.

"ఏమిటా సస్పెన్స్. నన్ను గాభరాపెట్టక త్వరగా చెప్పు" అన్నాడు, విజయ్ మరింత కోపంతో, ఆమెను దగ్గరికి లాక్కొంటూ.

"అబ్బా వుండండి" అంటూ దూరంగా తప్పుకుంది శ్యామల.

"ఏది ఏమైనా వేడివేడిగా టీ త్రాగు" టీ కప్పు అందించాడు మళ్ళీ.

"వుహూ వద్దు"




ప్రశ్నార్థంగా చూశాడు విజయ్.

"మామిడికాయ" అంది సిగ్గుపడుతూ.

"ఎందుకు....?"

"తినడానికి."

"ఛీఛీ...అసలే ఎండ ఎక్కువ. పెధవ మామిడికాయ వద్దనే వద్దు" అన్నాడు విజయ్....

కొండయ్య వెనుదిరిగి షెడ్డుకేసి వెళ్ళాడు.

విజయ్‌కి ఆమె ప్రవర్తన చీకాకనిపించింది.

"కొబ్బరినీళ్ళు తియ్యగా వుంటాయమ్మగారూ" అంటూ కొబ్బరిబోండాం అందించబోయింది కొండయ్య భార్య రాజమ్మ.

అందుకోకుండా "వద్దు వద్దు" అంది శ్యామల.

"టీవద్దూ.... కొబ్బరి బోండామూ వద్దు...." వెక్కిరింతగా అన్నాడు విజయ్...."కానీ మామిడికాయ మాత్రం కావాలి" కచ్చితంగా అన్నాడు మళ్ళీ.

ఆమె పరిస్థితి రాజమ్మకి అర్థమైపోయింది.

"కోపగించుకోకండి బాబుగారు! ఆమె కిప్పుడు మామిడికాయలో అన్ని రుచులూ తెలుస్తాయిలా వుంది" అంది రాజమ్మ.

విస్తుపోయాడు విజయ్. "వద్దు వద్దు....మామిడికాయ వద్దనేవద్దు".... నికచ్చిగా అన్నాడు.

"పోనీ చింతకాయ తెమ్మంటారా?"... రాజమ్మ ప్రశ్న.

ఆసక్తిగా చూసింది శ్యామల యిద్దర్నీ. మార్చి మార్చి చూశాడు విజయ్. రాజమ్మ వాళ్ళిద్దరికీ దూరంగా వెళ్ళిపోయింది.

సిగ్గు భారంతో అక్కడ నిలబడలేక చెట్టుచాటుకి తుర్రుమంది శ్యామల.

విజయ్‌కి పరిస్థితి అర్థమైంది. దొంగలా వెళ్ళి శ్యామల్ని దొరకబుచ్చుకున్నాడు.

"అమ్మదొంగా! యిదా సంగతి" అంటూ ఆమె కళ్ళల్లోకి చిలిపిగా చూశాడు విజయ్. ఆమె కిలకిలా నవ్వింది. అతని యెదకి పెనవేసుకుపోయింది.

ఆనాటినుండి శ్యామలను కంటికిరెప్పలా కాపాడుకొంటూ వచ్చాడు విజయ్. అప్పుడప్పుడూ డాక్టరుచేత పరీక్షలు చేయిస్తూ జాగ్రత్త తీసుకున్నాడు.

ఐందు నెలలు రాగానే శ్యామల్ని టౌన్లోని నర్సింగ్‌హోమ్‌లో చేర్పించాడు విజయ్. పళ్ళు, మందులూ తీసుకొంటూ యాపిల్‌పండులా నిగనిగలాడుతోంది శ్యామల. ఆమె కెటువంటి శంకాలేదని ఆనందపడిపోయాడు విజయ్.

కానీ విధి వాళ్ళ వెనకాల్నే పొంచివుంది. ఆమెను తన గుప్పెట్లోకి లాక్కుంది.

ఓ అర్ధరాత్రి వున్నట్టుండి శ్యామలకి ఫిట్స్ రావడంతో విజయ్‌తోటి అందరూ గాభరాపడిపోయారు.

ఆమెను ఆపరేషన్ థియేటర్‌కి తరలించారు.

గంటలు గడుస్తున్నాయి. విజయ్ హృదయాంతరాళాల్లో వేదన ఎక్కువవుతోంది.

అడ్డం తిరిగిన బిడ్డని ఆపరేషన్‌చేసి తీసేప్రయత్నంలో మునిగిపోయారు ముగ్గురు డాక్టర్లు.

ఎలక్ట్రిక్ దీపాలు నిర్విరామంగా వెలుగుతున్నాయి.

విజయ్ నిరాశగా బెంచికి జారగిలపడ్డాడు. ధర్మయ్య తన వూతకర్ర సహాయంతో పచార్లు మొదలెట్టాడు.

తలుపులు తీసుకొని ఓ నర్స్ బయటికొచ్చింది. యిద్దరూ ఆత్రతగా ఆమెను సమీపించారు. "ఆమెకి ఆడబిడ్డ పుట్టింది" అంటూ రివ్వున వెళ్ళి పోయింది నర్స్.

చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకున్నారు యిద్దరూ.

ఓ గంట తర్వాత డాక్టరమ్మ వాళ్ళ ముందు ప్రత్యక్షమయింది. యిద్దరూ ఆమెను సమీపించారు.

"ఐయామ్ సో సారీ విజయ్. ఆమెను బ్రతికించాలని మా శాయశక్తులా ప్రయత్నించాం. కానీ.........."

"డాక్టర్"... విజయ్ గొంతు బిగుసుకుపోయింది.

"సారీ" అంటూ తప్పుకుంది డాక్టర్.

నిర్విణ్ణుడై నిలబడిపోయాడు ధర్మయ్యకూడా.

* * * *

గతస్మృతి నుండి మేల్కొన్న విజయ్ చెంపలపై కన్నీటిధారలు జాలు వారాయి.

ఎదురుగా కొండయ్య కొబ్బరిబోండాంతో నిల్చున్నాడు.

తన బాధ బయటపడకుండా కన్నీరు తుడుచుకున్నాడు విజయ్.కొండయ్య అందించిన బోండాం అందుకోలేదు. వద్దని వారిస్తూ అక్కణ్ణుంచి లేచాడు.

పొలంనుండి వస్తున్న ధర్మయ్య విజయ్‌ని చూసి ఆత్రతగా అక్కడి కొచ్చాడు.

"టౌన్ నుండి ఎప్పుడొచ్చారు బాబూ!" అంటూ ప్రశ్నించాడు.

"యింతకు మునుపే" ముభావంగా అన్నాడు విజయ్.

"డాక్టరుగారేమన్నారు!"

"జబ్బు వుంటేగా ఏమైనా అనడానికి. మీ బలవంతం మీద వెళ్ళడం తప్పిస్తే........" అంటూ నసిగాడు.

విజయ్ చిక్కి నీరసించిపోతున్నాడని, ఓసారి డాక్టర్ని కలిసిరమ్మని ధర్మయ్య పోరుపెట్టడంతో టౌన్‌కి వెళ్ళివచ్చాడు విజయ్.

యిద్దరూ రోడ్డుకేసి మౌనంగా నడిచారు.

"నిన్న రాఘవయ్యా నేనూ రామ్‌నగర్ వెళ్ళొచ్చాం బాబూ" అన్నాడు ధర్మయ్య—మౌనాన్ని భంగపరుస్తూ.

"ఎందుకు....?"

"అక్కడ ఓ సంబంధం వుంటేనూ...."

ధర్మయ్య మాట పూర్తిగాకుండానే విజయ్ ముఖం మాడిపోయింది. అవ్యక్తమైన బాధ అతని హృదయాన్ని తాకింది.

"మీరు పెళ్ళి ప్రయత్నం మానరా....?" నడుస్తూనే అన్నాడు విజయ్.

"అంత మాటనకండి. పెద్దవాణ్ణి. నేను చెప్పినట్టు వింటారని ఆశిస్తాను. అమ్మాయి అందంగా వుంది....మీకు సరిపోయే జోడీ. అంతేకాదు....సంస్కారమైన కుటుంబంలోంచి వస్తోంది... ........"

ధర్మయ్య చెప్పుకుపోతున్నాడే గాని విజయ్ వినేస్థితిలో లేడు. చరచరా ముందుకి నడిచి కారెక్కాడు. మనస్సులో బాధకలిగినా బయటకు కన్పించనీయకుండా ధర్మయ్య కూడా వెనకడోర్ తెరిచి కూర్చున్నాడు.

వాళ్ళమధ్య మాటలాగిపోయాయి.

రివ్వున సాగిపోయిన కారు పోర్టికోలో ఆగింది. డోర్ తీసుకొని దిగిన విజయ్ ధర్మయ్యను చూడకుండా చరచరా మిద్దిమెట్లెక్కాడు.

అతని వింత ధోరణికి ఆశ్చర్యపోయాడు ధర్మయ్య.

ఆ సంబంధానికి ఎలాగైనా విజయ్‌ని ఒప్పించాలన్న ఆతృతలో తనుకూడా మెట్లెక్కాడు ధర్మయ్య. ధర్మయ్య వెళ్ళేటప్పటికి గది తలుపులు మూసుకున్నాయి.

కిటికీ గుండా లోనికి చూడకుండా వుండలేకపోయాడు ధర్మయ్య. చూసి మరింత చకితుడయ్యాడు.

విజయ్ చేతిలో విస్కీగ్లాసుంది.

గటగటా తాగుతున్నాడు.

నిషా ఎక్కిందే మానేట్టు లేడు.

ఆ దృశ్యాన్ని చూళ్ళేక కళ్ళుమూసుకున్నాడు ధర్మయ్య.

'త్వరగా యితనికో బంధం తగిలిస్తేగాని దారికిరాడు' — అన్న భావన అతని మనోఫలకంపై ముద్రవేసుకుంది.

# 5

లక్ష్మి బలవంతంమీద రాఘవకి పెళ్ళి గురించి వ్రాశాడు ముకుందం.

పరీక్షలు మూలంగా రాలేనని, పెళ్ళిని పోస్ట్‌పోన్ చెయ్యమని సమాధానం వ్రాశాడు రాఘవ.

కొడుకు సమాధానం చూసి వుసూరుమన్నాడు ముకుందం. పెళ్ళి ఆపేందుకు అతనికి సుతరామూ ఇష్టం లేదు.

రెండో పెళ్ళి కావటాన పెద్ద ఎత్తున జరగలేదు. విజయ్ పెళ్ళి లక్ష్మి పెళ్ళికూతురిగా తలవంచుకొని సిగ్గుతో ముడుచుకుపోయింది. విజయ్ ఆమె మెడలో అందరి ఆశీర్వచనములతో తాళి కట్టాడు. తాళైతే కట్టాడే గాని కళ్ళు సారించి ఆమె అందమైన ముఖారవిందాన్ని పరికించి చూడలేదు. కారణం....ఆ పెళ్ళి అతనిష్టప్రకారం జరగలేదు. ఎవరికోసమో....ఏదో తప్పని సరై చేసుకొన్నట్టనిపిస్తోంది విజయ్‌కి.

లోకం దృష్టిలో లక్ష్మి విజయ్ భార్య .... లక్ష్మి దృష్టిలో విజయ్ జన్మ జన్మల బంధం....కానీ విజయ్ దృష్టిలో లక్ష్మి తనకేమీ కాదు.

పెళ్ళికి వచ్చినవారంతా ఆ దంపతులను మనసారా ఆశీర్వదించారు. చిలకా గోరింకల్లాంటి జంటన్నారు. రెండవ పెళ్ళయినా విజయ్ అదృష్టవంతుడు.. అందచందాల బొమ్మను భార్యగా పొందగలిగాడు అని ఆనందపడ్డారు.

ఆ విధంగా విజయ్-లక్ష్మిల పెళ్ళిసందడి సాయంకాలానికి చప్పబడి పోయింది.

ఆ రాత్రి గదినెవరలంకరించారోగాని నయనానందకరంగా వుంది.మంచం మల్లెలతో నింపి స్వచ్ఛందాన్ని వెదజల్లుతోంది.

గదిలో అడుగుపెట్టిన విజయ్ ఆ అలంకరణని అయిష్టంగా చూశాడు. ఆ సమయంలో అతని మొదటి శోభనం గుర్తుకురాక మానలేదు. శ్యామల అతని హృదయంలోకొచ్చి మనస్సుని అల్లకల్లోలం చేసింది.

వ్రేలాడుతున్న మల్లెదండల్ని కసిగా దూసిపోశాడు విజయ్. మంచం ప్రక్కనేవున్న పండ్లను, తీపి పదార్థాలను దూరంగా నెట్టాడు. టీపాయ్ మీద కనిపించిన పాలను గుటగుటా త్రాగేశాడు. ఆ తర్వాత ఎటూ పాలుపోక మంచం పైకి దొర్లి ముసుగుతన్నేశాడు

అలంకరించబడిన లక్ష్మి అప్పుడే అడుగుపెట్టింది గదిలో. తియ్యటి ఆలోచనలు ఆమె మనస్సుని తినేస్తున్నాయి. గదిలో ఆమె కెటువంటి సవ్వడీ వినిపించక పోవడంతో తలెత్తి బెడ్‌కేసి చూసి ఆశ్చర్యపోయింది.

విజయ్ అప్పటికే గుర్రు పెడుతున్నాడు. నవచైతన్య స్రవంతిలా గంతులు వేసిన ఆమె ఆనందానికి అనకట్టపడ్డట్టయింది.

కొంచెంసేపు స్తబ్దుగా నిలబడిపోయింది లక్ష్మి. ఆ తర్వాత క్రిందపడివున్న పండ్లను, తీపిపదార్థాలను ఓ పాత్రలోకి ఏరింది. విజయ్‌ని నిద్రనుండి లేపాలన్న ప్రయత్నంలో అటూ ఇటూ పచార్లు చేసింది. కానీ ఆ అలికిడికి విజయ్ కదలను కూడా కదల్లేదు.

నిద్రపోయే వ్యక్తిని అలికిడితో లేపవచ్చు నిద్ర నటించే మనిషిని లేపడం అంత సులువా?

ఆమె కలలు కరిగిపోయాయి.

ఎంతో రాత్రి గడచినా ఆమె కంటికి నిదురరావటలేదు. తర్జనభర్జనలు ఆమె మనస్సుని తినేసేలా వున్నాయి ఆలోచించి ఆలోచించి ఎప్పుడు కన్నుమూసిందో ఆమెకే తెలియదు

ఓ రాత్రికాడ నిద్రలేచిన లక్ష్మికి విజయ్ బెడ్‌మీద కనిపించలేదు. వరండా లైటుకాంతి కిటికీగుండా గదిలో పడుతోంది. ఆత్రుతగా లేచి వెళ్ళి తలుపుతీసిన లక్ష్మి చకితురాలై నిలబడిపోయింది.

విజయ్ వరండాలో కూర్చొని త్రాగుతున్నాడు.

లక్ష్మి సున్నితమైన హృదయంపైన సుత్తిపోటు పడ్డట్టయింది.

విజయ్ చేతిలో సిగరెట్ సున్నితంగా కాలిపోతోంది. దాన్నుండి వెలువడే పొగంతా వరండానిండా అలముకొంటోంది.

అతని మనస్సు అతీతలోకాల్లో విహరిస్తున్నట్టుంది. ఆమె వచ్చి ఎదురుగా నిల్చున్నా గమనించే స్థితిలో లేడు.

ఆ దృశ్యం చూస్తున్న లక్ష్మి చెంపలమీద కన్నీరు జాలువారాయి.

మళ్ళీ టీపాయ్‌మీదున్న బాటిల్ అందుకోబోయాడు విజయ్. అది గమనించిన లక్ష్మి కూడా బాటిల్‌మీద చేయివేసింది. యిద్దరి చేతుల్లో నలిగిపోతోంది బాటిల్. బాటిల్ ఒకటి రెండుసార్లు తనవేపుకి లాగి విఫలుడయ్యాడు విజయ్. ఎవరో దాన్ని పట్టుకొన్నట్టు అర్థంచేసుకున్నాడు

"ఎవరది?"- అతని గొంతు పెగిలింది.

లక్ష్మికి మాట్లాడే ధైర్యం రాలేదు....

"పలకరేం...? నోరు లేదా?"

"..........వుండీ లేనిదానినయ్యాను" ఆర్ద్రస్వరంతో అంది లక్ష్మి.

వింతగా చూశాడు విజయ్.

"అసలెవరు నువ్వు?"

"ఇంత త్వరగా మర్చిపోతారనుకోలేదు. నేను మీకు పరిచయమైంది విన్నానే"

"అంటే? .... గుర్తులేదు" కళ్ళు చిట్లించాడు విజయ్.

"ఇప్పుడు మైకంలో వున్నారు. రాత్రి మామూలు స్థితిలోనే గుర్తులేను."

"మరి....ఎందుకొచ్చావ్?"

"మిమ్మల్ని రక్షించుకోడానికి."

వెకిలిగా నవ్వాడు విజయ్.

"అంతటి ఆత్మీయురాలివా!"— హాస్యత ధ్వనించింది అతని కంఠంలో.

"అవును. మీరు మర్చిపోయిన మీ పాదదాసిని..." ఆమెకు దుఃఖం ఆగలేదు. దుఃఖంతో గొంతు పూడుకుపోయింది.

విజయ్ నవ్వు మరికాస్త మోతాదు పెరిగింది.

"పిచ్చిగా వాగుతున్నావ్ .... వెళ్ళు .... వెళ్ళి మందేసుకో...." అంటూ మళ్ళీ ఓసారి బాటిల్ని లాగాడు విజయ్.

అంగుళం కూడా కదల్లేదు బాటిల్.

"వదలను. నా కంఠంలో ప్రాణముండగా మీరు దీన్ని ముట్టడానికి వీల్లేదు" నిక్కచ్చిగా అంటూ అతని చేతిలోని గ్లాసుని కూడా లాక్కుంది లక్ష్మి.

నోటి దగ్గరి అమృతభాండం ఎవరో లాగేసుకున్నట్టనిపించింది విజయ్‌కి. ఆమెను ఎదుర్కొనే స్థితిలో లేడు.

"సరే....పో... దూరంగా పోయి తాగు ఎవరైనా చూస్తారు ..." తూలుతూ తూలుతూ గదిలో అడుగుపెట్టి బెడ్ మీద పడిపోయాడు విజయ్.

నిప్పుని దాచుకున్న పర్వతంలా నిల్చుండిపోయింది లక్ష్మి.

## 6

పొద్దెక్కి నిద్రలేచిన విజయ్‌కి ఎదురుగా టీపాయ్ మీద కాఫీ కప్పు సెగలురేగుతూ కనిపించింది. ఎవరు పెట్టారన్న ఆలోచనే లేకుండా త్రాగేశాడు.

అప్పుడే అతని ముందు ప్రత్యక్షమయి ఖాళీకప్పు అందుకోబోయింది లక్ష్మి. కప్పుని టీపాయ్‌మీద పెట్టి చరచరా నడుచుకొంటూ బాత్‌రూమ్‌లో అడుగు పెట్టాడు విజయ్.

అతని చేష్టకి బాధపడుతూ నిల్చుండిపోయింది లక్ష్మి.

స్నానం పూర్తిచేసిన విజయ్ డ్రెస్ చేసుకొని నిలువుటద్దం ముందు నిల్చొని తల దువ్వుకుంటున్నాడు వున్నట్టుండి అద్దంలో లక్ష్మి ప్రతిబింబం కనిపించగానే విస్తుబోతూ అక్కణ్ణుంచి తప్పుకోబోయాడు. లక్ష్మి అతని కడ్డంగా నిల్చొని అతనికేసి ప్రసన్నంగా చూసింది.

ఆ చూపుని తట్టుకోలేక గిరుక్కున వెనుదిరిగిన విజయ్‌ని వెంబడించి అతని చొక్కాగుండీలను సర్దబోయింది లక్ష్మి. ఆమెకేసి చురుగ్గా చూశాడు విజయ్. కానీ ఆమె లక్ష్యపెట్టలేదు. కారణం....విజయ్ ఆమె భర్త.

గుండీలను సర్దే అవకాశాన్ని లక్ష్మి కివ్వలేదు విజయ్. తాకితే మైలపడతా నన్నట్టు దూరంగా జరిగి నిల్చున్నాడు.

లక్ష్మి హృదయంలో గలబిడి ఎక్కువయింది.

"ఏవండీ" అంది ఆర్ద్రస్వరంతో.

ఆమె తనతో మాట్లాడబోతోందని పసికట్టాడు విజయ్. ఆ అవకాశం ఆమెకిస్తే తన నేమిప్రశ్నిస్తుందో అతనికి బాగా తెలుసు. అందుకే చరచరా ద్వారానికేసి నడిచాడు.

"మిమ్మల్నే... " రోషావేశంతో అరిచింది లక్ష్మి.

గుమ్మం దగ్గర టక్కున ఆగిపోయాడు విజయ్. కానీ వెనక్కి తిరిగి లక్ష్మికేసి చూడలేదు. ఆమె అతని ముందుకొచ్చి నిల్చుంది.

"మీ రెందుకు నన్నిలా దూరంచేస్తున్నారు?" పెదాలు వణికాయి లక్ష్మికి.

విజయ్ నుండి సమాధానం లేదు.

"నే నేమయినా పొరపాటు చేశానా?"

"అవును"- అతని పెదాలు కదిలాయి

దిగ్భ్రాంతిగా అతని కళ్ళల్లోకి చూస్తూ నిర్విణ్ణురాలైంది లక్ష్మి. ఆమె ముఖం క్రమంగా రోషావేశాలతో ఎరుపెక్కింది.

"ఏమిటది?" అంది నిగ్రహించుకొంటూ.

"నన్ను పెళ్ళిచేసుకోవడమే... "




"అంటే....?"_ భీతహరిణిలా చూసింది లక్ష్మి.

"ఒకసారి ఎండి మోడయిన చెట్టు మళ్ళీ చిగురిస్తుందా?" ముఖం తిప్పేసు కున్నాడు విజయ్.

ఆ ప్రశ్నకి నిశ్చేష్టురాలైంది లక్ష్మి.

"ఎందుకు చిగురించదండీ. ఒక ఋతువులో చెట్లు ఆకులు రాల్చి మోడై పోయినట్టు కనిపించడం సహజం. కానీ ఆ చెట్లే మరో ఋతువులో మళ్ళీ చిగురించి రంగురంగుల పూలతో, పిందెలతో క్రొత్త క్రొత్త అందాలు చిందు తుంటాయిగా" అంది అనునయంగా.

ఆశ్చర్యంగా లక్ష్మికేసి చూశాడు విజయ్.

"పొరపడుతున్నావ్....ఎడారిలో నీళ్ళుండవ్. బహుశా నీకు తెలియదేమో" అన్నాడు మళ్ళా.

"ఒయాసిస్సులనేవి ఎడారులలో వుంటేటాయని మీరు మరిచారేమో?"

లక్ష్మి సమాధానానికి ముగ్ధుడౌతూ ఆమెకేసి చూడకుండా వుండలేక పోయాడు విజయ్. కాని అతని మనస్సు అతన్ని వెనక్కి లాగుతోంది. శ్యామల రూపాన్ని అతని హృదయంలోంచి తుడిచివేయలేకపోతున్నాడు. ఆ స్థానంలో లక్ష్మికి చోటు కల్పించాలంటే అతని కేదోలాగుంది.

"ఎండి బీటలువారిన నేలలో విత్తులు మొలుస్తాయా నీ పిచ్చిగాని...." ఆమె కళ్ళకేసి చూస్తూ అడిగాడు విజయ్.

"మొలుస్తాయండీ. అమృతం వర్షించినపుడు తప్పకుండా మొలుస్తాయి. ఆ నమ్మకం నాకుంది.. దయచేసి మీరు నా కన్యాయం చెయ్యకండి" ప్రాధేయ పూర్వకంగా అంటూ అతని చూపులో చూపు కలిపింది లక్ష్మి.

ఆమె చూపువాడికి తట్టుకోలేక ముఖం తిప్పేసుకున్నాడు విజయ్. ఆమె ప్రశ్నకి సమాధానమివ్వడం అతనికి కష్టంగానే తోచింది. ఏం చేయలేక మళ్ళీ గదిలోపలికి వచ్చేశాడు. ఫ్రేమ్‌లో బిగించిన శ్యామల ఫోటోకి రోజా పువ్వు లంకరించడంలో లీనమయ్యాడు.

ఆ దృశ్యాన్ని చూసి కొయ్యబారినట్టు నిల్చుండిపోయింది లక్ష్మి. ఆమె హృదయంలో ఎవరో చేయిపెట్టి కెలికినట్టయింది.

ప్రస్తుతం తన కెదురుగా వుండే లక్ష్మికి భార్యగా విలువివ్వలేదు విజయ్. గతించిన శ్యామల మీదనే తన అనురాగాన్ని కురిపిస్తూ ఆమె ఫోటోకి రోజా పువ్వు నలంకరించడం....లక్ష్మి ఓర్చుకోలేకపోయింది.

"అదృష్టవంతురాలు....అనురాగంతో మిమ్మల్ని ఆకట్టుకోగలిగింది"— అక్కసుని దిగమ్రింగుతూ ఆమాట అనకుండా వుండలేకపోయింది లక్ష్మి,

తోక త్రొక్కిన పాములా బుసకొట్టాడు విజయ్.

"ఒకరి సౌభాగ్యం చూసి యీర్ష్యపడటం అవివేకం"-కచ్చిగా అన్నాడు. తన ప్రియాతి ప్రియమైన శ్యామల మీద యీర్ష్యపడటం అతని కెంత మాత్రమూ నచ్చలేదు.

అతను అన్న తీరుకి చాలా బాధపడింది లక్ష్మి.

ప్రక్కనేవున్న ఐరన్ షెల్ఫ్ తెరిచాడు విజయ్.

అందులోంచి ఓ రవ్వల నెక్లెస్, జత బంగారు గాజులు, ఓ పట్టు చీర ఒకటెంబడి ఒకటి తీసి తృప్తిగా చూసుకున్నాడు.

అవి శ్యామల జ్ఞాపకార్థం విజయ్ దాచుకున్న వస్తువులు. ఊళ్ళో వున్నప్పుడు ప్రతిరోజూ వాటిని ఓసారి చూడందే అతనికి నిద్రపట్టదు. ఓ విధంగా చెప్పాలంటే ఆ మూడు వస్తువులూ అతనికి ఆరో ప్రాణం. అవి ఎల్లప్పుడూ ఆ ఐరన్ షెల్ఫ్‌లో వుంటాయి. కొన్నాళ్ళు ఆ షెల్ఫ్‌కి తాళం చెవి వుండేది. యిప్పుడు విజయ్ దాన్ని ఎక్కడో జారవిడిచాడు. అప్పటినుండీ

ఆ షెల్ఫ్‌కి తాళం లేకుండానే మిగిలిపోయింది. అందులో అంత ఖరీదైన వస్తువులు వుంచినా యిప్పటికీ చెక్కుచెదరకుండా అలాగే వున్నాయి. ఎంత మంది పనివాళ్ళు ఆ గదిలో తిరుగుతున్నా వాటి జోలికి పోయిఎరగరు

ఆ మూడు వస్తువుల్నీ విజయ్ అంత తృప్తిగా చూసుకోవడం లక్ష్మికి రుచించలేదు అతని చేష్టకి తన్ను తాను నిగ్రహించుకోలేకపోయింది.

"యీర్ష్యాద్వేషాలను గురించి నేను మాట్లాడ్డంలేదు ఆ యిల్లాలి అదృష్టాన్ని ప్రశంసిస్తున్నాను" అంది యీర్ష్యగా.

"యీర్ష్యకు నాగరికులు పెట్టిన పేరేమో ప్రశంస !"

అతని వెక్కిరింత లక్ష్మి హృదయాంతరాళాన్ని తాకింది.

ముల్లయితే కాలికి గుచ్చుకొంటుంది. ముళ్ళలాంటి మాటలు యీటెలలాగా, వాడిగా సూటిగా లక్ష్మి గుండెల్లోకి దిగబడ్డాయి. వాటి ధాటికి తట్టుకోలేక పోయింది లక్ష్మి.

ఆమెలోని స్త్రీ సహజమైన అభిమానం బుసకొట్టింది. అభిమానం ఆవేశంగా మారి, ఆవేశం దుఃఖరూపంలో బయటపడింది.

"ఎందుకండీ యీటెల్లాంటి మాటలతో నా హృదయం తూట్లుపొడుస్తారు? నేనేం పాపం చేశానని? భర్త అనురాగానికి దూరమైన భార్యగా నేను బ్రతలేను మీ అర్ధాంగిగా కాకపోయినా కనీసం తాళిగట్టిన భార్యగానయినా మీ హృదయంలో నాకు చోటివ్వండి"—వుద్వేగంతో అంటూ అతని పాదాలపై పడింది లక్ష్మి.

కానీ అతని పాదాలు ఆమె కందలేదు. తలెత్తి చూసిన లక్ష్మికి మేడ మెట్లు దిగుతున్న విజయ్ కనిపించాడు.

ఆమె నిశ్చల చూపులోంచి రెండు కన్నీటిబొట్లు భారంగా క్రిందికి జారాయి

## 7

మర్నాడు విజయ్ ఫోటోకి రోజాపువ్వు నలంకరించాడు ఆ తర్వాత మామూలుగా షెల్ఫ్ తెరిచి ఒక్కొక్కవస్తువూ బయటికి తీశా .

అందులో రవ్వల నెక్లెస్ కనిపించలేదు.

"ఎవరక్కడ?" గావుకేక పెట్టాడు విజయ్.

అక్కడే పనిజేస్తున్న మంగమ్మ వణికిపోతూ పైకొచ్చింది.

"ఇక్కడ నెక్లెసేమయింది?" — షెల్ఫ్‌ని వేలితో చూపిస్తూ సూటిగా ప్రశ్నించాడు.

వి త్తరపోయి చూసింది మంగమ్మ

"చెప్పు మాట్లాడవేం ?" గద్దించాడు మళ్ళీ విజయ్

"నాకు తెలవదు బాబూ" వణికిపోతూ అంది మంగమ్మ

"యివాళ యీ గది వూడ్చిందెవరు?"

"నే నేనే బాబూ"

"మరి నీకు తెలియకుండా ఎలా పోయింది".

"నేను చూళ్ళేదు బాబూ. నా కేమీ తెలియదు"—కన్నీళ్ళ పర్యంతమైంది మంగమ్మ.

"నువ్వు గాక యింకెవరొచ్చారీ గదిలోకి?"

"తెలియదు"

అప్పుడే అక్కడికొస్తూ గదిలో కడుగుపెట్టబోయి ఆగిపోయింది లక్ష్మి. విజయ్ కళ్ళు ఆమెనే గుచ్చి గుచ్చి చూశాయి.

క్రితంరోజు షెల్ఫులోని వస్తువులు మాదింటిని లక్ష్మి చూసింది. యీర్ష్యతో మాట్లాడటమేగాకుండా శ్యామల వస్తువుల్ని తీసి దాచేసి వుంటుంది ఏమీ ఎరగనట్టు ఎంత అమాయకంగా చూస్తోందో చూడు—

అలా ఆలోచిస్తున్న విజయ్ కళ్ళు అసహ్యంగా చూశాయామెను.

లక్ష్మి లోపలికి నడిచింది.

"ఇక్కడుండాల్సిన నెక్లెసేమయింది ?"

టక్కున ఆగిపోయింది లక్ష్మి. ఎవరో తనను చాచి లెంపకాయ కొట్టినట్టనిపించింది. అభిమానం దెబ్బతినడంతో వుక్రోషంతో వూగిపోయింది లక్ష్మి. కాని మరుక్షణంలోనే తన్ను తాను అర్థంచేసుకుంది. ఎదురుగా మాట్లాడేది తనకు అయినవాడు స్వయానా భర్త—మాట్లాడలేకపోయింది లక్ష్మి.

"నిన్నే దాన్నెందుకు తీశావ్" నిలదీశాడు విజయ్.

నిర్దోషిత్వం నిరూపించుకోవాలంటే నిర్భయంగా అతన్ని ఎదుర్కోవాలి. తప్పదు లేకపోతే ఎంతటి అభియోగాన్నయినా నెత్తిన రుద్దగల సమర్థుడు విజయ్.

"నాకు తెలియదు—నేను తీయలేదు" నిర్భయంగా చెప్పింది లక్ష్మి.

"మరెవరు తీశారు?" మళ్ళీ ప్రశ్న.

"తెలియదు."

"యిన్నాళ్ళు పోనిది నువ్వు యీ ఇంట్లో అడుగుపెట్టిం తర్వాతే పోయింది".



"అందుకు నేను కారణం కాదు"

"కాదనగానే సరిపోదు. దాన్ని నువ్వే తీశావ్. శ్యామల మీద కక్షతో చేశావీపని. ఆ నెక్లెస్ దాచేయగానే నేను శ్యామల్ని మర్చిపోతాననుకొన్నావు కదూ. అంతా భ్రమ పీ పిచ్చి " అతని గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

స్థాణువై పోయింది లక్ష్మి

అంతటితో వదల్లేదు విజయ్.

"లక్ష్మీ ఆ నెక్లెస్ ఎక్కడ దాచావో చెప్పు. ప్లీజ్ నీకు కావాలంటే అలాంటివి నీవు కోరినవన్నీ చేయించిపెడతాను. అది నా ఆరోప్రాణం. శ్యామల్ని పోగొట్టుకున్న నన్ను మరింత క్షోభకు గురిచెయ్యక త్వరగా చెప్పు లక్ష్మీ"— దాదాపు అతను ఏడుస్తున్నట్టుగానే అడుగుతోంటే కత్తివేటుకి నెత్తురుచుక్క రానంతగా పాలిపోయింది లక్ష్మి వదనం.

ఒత్తిడి అలసత్వాన్ని భరించలేకపోయాగా

"చెప్పవా లక్ష్మీ. నా బాధ నీకు ఆనందంగా ఉంది కదూ!"

లక్ష్మినుండి సమాధానం రాలేదు.

విజయ్ కళ్ళు రంగులు మారాయి. దవడలు గరగరమన్నాయి. "నువ్వెందుకు చెప్తావ్ నువ్వు చెప్పవ్ నా బాధ నీకు బాధగా అనిపించదు నువ్వు నాకు విరోధివి అవును విరోధివి " పిచ్చిపిచ్చిగా మాట్లాడుతూ దూకుడుగా మెట్లుదిగి వెళ్ళిపోయాడు విజయ్

## 8

ఎంత వెతికినా, ఎక్కడ శోధించినా పోయిన నెక్లెస్ జాడ తెలియలేదు. మూడురోజులు దాటినా ఇంటికి తిరిగిరాలేదు విజయ్. అతని కది మామూలే. విజయ్‌కి మనస్సుని కష్టపెట్టే సంఘటన జరిగితే ఇల్లువిడిచి కోపంగా వెళ్ళిపోతాడు. ఎక్కడికి వెళ్తాడో, ఎన్నిరోజులుంటాడో అతనికే తెలియదు. కోపం చల్లారిన తర్వాత మళ్ళీ యింటికి తిరిగివస్తాడు

మనిషికి మనస్సు తృప్తి ముఖ్యం అది వుంటే సుఖాల సోపానాలమీద విహరించవచ్చు. ఊటీ, కొడైకెనాల్ వెళ్ళకుండానే పూరిగుడిశలో ఉంటూ పెరట్లో జాజిపందిరి ప్రక్కనే అందమైన హనీమూన్‌ని చూడవచ్చు—

కానీ లక్ష్మి కది కరువయింది

జరిగిన సంఘటనలు మర్చిపోవడానికి ప్రయత్నించింది లక్ష్మి. అంతేకాదు పనివాళ్ళందరితో కలిసిపోయింది

భర్త ప్రేమను నోచుకోలేకపోయినా అతని మొదటి భార్య శ్యామల కన్నుమూసేముందు ప్రసాదించిన 'కళ్యాణి' అనే పాపకి తల్లియై పాప లాలనలో గతాన్ని మర్చిపోవడానికి యత్నించింది.

కళ్యాణిని తనకు నచ్చిన దుస్తులతో అలంకరించేది లక్ష్మి. ఆ పాప సపర్యలే ఆమెకు కొంచెం ఉపశమనం కలిగించసాగాయి.

కారుచీకట్లో మట్టిప్రెమిదలోని అముదపు దీపమే కాంతివంతంగా కనిపిస్తుంది. లక్ష్మి సంసారమనే చీకటిలో 'కళ్యాణి' మట్టిప్రెమిదలా నిల్చింది.

యిలా రోజులు దొర్లుతున్నాయి. ఆమెలో ఏదో బలమైన లోటు హృదయంలో వింత మార్పు. చిత్రమైన స్తబ్దత పేరుకోసాగాయి.

వారం తర్వాత తిరిగివచ్చాడు విజయ్

ఎవరిలోనూ మార్పు కనిపించలేదు కాని లక్ష్మిహృదయంలో సముద్ర ఘోషలా అలజడి రేగింది

ఆమె అతనికి దగ్గరకావాలనే అనుకొంటోంది కానీ కాలేక భయపడుతోంది అంతకన్నా ముందు విజయ్ ఆమె నీడే పరమశత్రువన్నట్టు తప్పుకు తప్పుకు తిరుగుతున్నాడు

విజయ్ వచ్చి ఒక్కరాత్రి గడిచింది.

"నన్ను కాపాడు భగవంతుడా" అని దేవుణ్ణి ప్రార్థించుకొంటూ తన గదిలోనే ఉండిపోయింది లక్ష్మి.

విజయ్ కేకతో ఆలోచనల్లోంచి తృళ్ళిపడి లేచింది లక్ష్మి. ధర్మయ్యా, పనివాళ్ళు విజయ్ గదికేసి వచ్చారు. భయపడుతూనే లక్ష్మికూడా వారిని సమీపించింది.

గదిలో విజయ్ షెల్ఫ్ముందు నిల్చొనివున్నాడు షెల్ఫ్ బోసిలా కనిపిస్తోంది. పట్టుచీర మాత్రం ప్రక్కనేవున్న టేబుల్మీద వుంది

విజయ్ కళ్ళు అక్కడ నిల్చున్న వారినందర్నీ పరికించి చూస్తూ లక్ష్మి మీద ఆగాయి.

మరే వుపద్రవం రాబోతుందోనని వణికిపోయింది లక్ష్మి.

అందరూ బిక్కుబిక్కుమంటూ విజయ్కేసి చూడలేక తలలు వంచేసుకున్నారు.

లక్ష్మినే తీక్షణంగా చూస్తున్న విజయ్కళ్ళు చింతనిప్పుల్ని కురిపించాయి. అతనికి తెలియకుండానే అతని కళ్ళవెంబడి నీరు దారాపాతంగా రాలుతోంది.

అతని ఉనికికి అందరూ ప్రమాన్పడిపోయారు

టేబుల్మీదున్న పట్టుచీరను షెల్ఫ్లోవేసి దబుక్కున తలుపు మూశాడు విజయ్. లక్ష్మినే తినేసేలా చూస్తూ ఆమెకేసి అడుగులువేసి ఆగిపోయాడు.

సింహం చేతిలో చిక్కిన లేడిపిల్లలా ఉండిపోయింది లక్ష్మి.

"ఇంటి దొంగను ఈశ్వరుడుకూడా పట్టలేడనుకోకు. నిజం తెలిసిననాడు తెలుస్తుంది " ఆ తర్వాత విజయ్ మాటలకు దుఃఖం అడ్డుతగిలింది అతని గొంతు మార్దవంగా మారింది. మరేమీ మాట్లాడలేక, అక్కడ నిల్చోలేక చక చకా ప్రాకినట్టు వెళ్ళిపోయాడు గదిలోంచి విజయ్.

నిశ్చేష్టురాలయింది లక్ష్మి.

ధర్మయ్య కళ్లు ఆమెమీద సానుభూతిని కురిపించాయి,

"విచారించకమ్మా. అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడు. నిజం నిలకడ మీద తేలకపోదు" ఓదార్పుగా అన్నాడు ధర్మయ్య.

పనివారంతా సానుభూతిగా చూశారు లక్ష్మిని.

ఆ యింట్లో పోయిన నెక్లెస్, జత బంగారు గాజులూ ఎంత వెతికించినా దొరకలేదు అందరికీ అదో మిస్టరీలాగా అనిపించింది పోలీసు రిపోర్టిచ్చినా ప్రయోజనం లేకపోయింది.

జరిగిన సంఘటనలు లక్ష్మి సంసారంమీద విరుచుకుపడ్డాయి వురమని పిడుగులా దురదృష్టం లక్ష్మి బ్రతుకుమీదపడి కష్టాలతుఫాను మధ్యకు విసిరింది.

లక్ష్మి యాంత్రికంగా తింటోంది, తిరుగుతోంది. కానీ ఆమె మనస్సుకి ప్రశాంతత కరువయింది. భర్త ఆదరణలేని జీవితం తన కెందుకని మధనపడ సాగింది లక్ష్మి

విజయ్ కూడా టౌన్లో హోటల్లో పడుకొని ఆలోచిస్తున్నాడు.

శ్యామలకి సంబంధించిన వస్తువులు పోవడం అతనికి తీరని బాధని పించింది

అంతేకాదు

నిజానిజాలు తెలుసుకోకుండా విచక్షణ కోల్పోయి లక్ష్మిని అనరాని మాటలన్నందుకు అతని హృదయం ద్రవించింది

తనలాగే ఓ తల్లి కడుపున పుట్టిన లక్ష్మి ఆనందమయ సంసార జీవితం గడపాలని తనవద్దకి వస్తే తనేం చేశాడు? దొంగగా ముద్రవేసి శోభకి గురిచేశాడు. భార్యగా ఆదరించకపోగా అభాండాలతో బాధపెట్టాడు.

అందుకు తనేం చేయాలి"

తన తప్పుకి ప్రక్షాళన చేసుకోకపోతే తనకు నిష్కృతి వుందా?

9

లక్ష్మికి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిన తర్వాత ముకుందానికి అంతగా తోచడంలేదు.

ఇల్లు బోసిపోయినట్టుగా వుంది.

కళ్ళముందు తిరుగుతున్న లక్ష్మి కనిపించకపోవడం, వంట తనే చేసుకోవల్సి రావడమూ ముకుందంలో మార్పులు తెచ్చాయి.

ఓపిక వుంటే వంట చేసుకునేవాడు అది లోపిస్తే 'క్రిష్ణా రామా' అంటూ కాళ్ళు బార్లజాచుకొని పడుకునేవాడు.

స్వతహాగా ముకుందంలో పిసినిగొట్టుతనం ఎక్కువ. అందుకే కన్న కొడుకుతో అన్ని విషయాలలో ఏకీభవించలేకపోయేవాడు.

భార్య చనిపోయిన్నాటినుండి తనకు బాధ్యత ఎక్కువకావడంచేత పిల్లలకి అంతగా స్వేచ్ఛానిచ్చేవాడు కాదు.

కొడుకు రాఘవ పై చదువు సాగిస్తానని ఎంత బ్రతిమాలినా చిల్లిగవ్వ యివ్వనని మొండికెత్తాడు ముకుందం.

తన కాళ్ళమీద తను నిలబడి వారాలు తింటూ, ప్రైవేట్లు చెప్పుకొంటూ హైదరాబాదులో 'ఆటోమొబైల్ డిప్లోమా' చేస్తున్న రాఘవకి ఏనాడూ రాగికాణీ పంపించి ఎరగడు ముకుందం.

కోడుపై వ్యక్రోషంగా మాట్లాడినా అతనంటే ముకుందానికి ప్రేమే. రక్తసంబంధం కదా!

అరుగు మీద కూర్చొని రామాయణం తిరగేస్తున్న ముకుందానికి ఆ రోజెందుకో కొడుకుమీద గాలిమళ్ళింది. రాఘవ అతని కళ్ళల్లో మెదులు తున్నాడు.

ఎంత ప్రయత్నించినా పేజీలు తిప్పలేకపోయాడు ముకుందం,

యింతలో "పోస్ట్" అన్న కేక—

లేచి వెళ్ళి కవరందుకున్నాడు ముకుందం. కవర్ని చించి ఆతృతగా ఉత్తరాన్ని బయటకుతీశాడు.

అవును అది రాఘవ దగ్గర్నుంచే ఆ దస్తూరీ రాఘవ చేతితో పొందిగ్గా వ్రాయబడ్డదే

వడిగా తిరిగివచ్చి అరుగుమీద పెట్టిన కళ్ళజోడు ఫంక్తుల వెంట పరుగెత్తాయి

అతని కళ్ళలో ఆనందం తొణికిసలాడింది తియ్యటి ఆలోచన మనస్సులో పరిగెడుతుండగా కాగితాన్ని మడిచి కవరులో పెట్టాడు ముకుందం.

డిప్లొమా పొందిన రాఘవ ఆ రాత్రికే హైదరాబాదులో బయలుదేరుతున్నాడు. తెల్లారేకల్లా యింట్లో వుంటాడు. అదీ అందులోని సారాంశం—

ఆ రోజంతా ముకుందం చేతలు, మాటలు సంతోషాన్ని పంచుకున్నాయి. ఆ రాత్రి పూర్తిగా నిద్రపోలేదు ముకుందం

తెలతెలవారుతుండగా రాఘవ రానేవచ్చాడు

ముకుందం తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు.

సన్నగా బక్కపలచగా, దాదావు నడుస్తుంటే వ్రేలాడినట్టుండే రాఘవ మంచి దేహపుటారోగ్యంతో, మిసమిసలాడే యవ్వనంతో అందంగా కనిపించాడు.

ముకుందం కళ్ళలో నీళ్ళూరాయి.

అందుకు కారణం

రాఘవలోని మార్పుకి సంతోషమూ వుంది.

యినాళ్ళ తన నిర్లక్ష్యధోరణికి పశ్చాత్తాపమూ వుంది.

నిగనిగలాడుతున్న రింగుల క్రాపు, పొందికైన మీసం తన కళ్ళెదుట పెరిగిన రాఘవలో ఎంత మార్పు? యింతలో ఎంత పెద్దవాడయ్యాడు ?

కండువాతో కళ్ళొత్తుకున్నాడు ముకుందం.

కాళ్ళు కడుక్కొని లోనికొచ్చిన రాఘవ సూట్‌కేస్ తెరిచి 'భగవద్గీత' గ్రంథాన్ని తండ్రి కందించాడు.

నీలిరంగు ఫారిన్ నైలెక్స్ చీర దాని మీదకి మ్యాచింగ్ జాకెట్‌ని బయటకు తీసి తృప్తిగా చూసుకొన్నాడు రాఘవ అతని కళ్ళు లక్ష్మికోసం వెతుకుతున్నాయి.

"లక్ష్మీ!" అంటూ పిలిచాడు రాఘవ

పుస్తకాన్ని తిరిగేస్తున్న ముకుందం ఆ పిలుపుకి తృళ్ళిపడ్డాడు.

"ఎందుకు ?" అన్నాడు కొడుకుకేసి చూస్తూ

ప్రశ్న వేశాడేగాని సమాధానం కళ్ళముందే కనిపిస్తోంది.

"ఎక్కడికెళ్ళింది నాన్నా లక్ష్మీ?" అన్నాడు మళ్ళీ రాఘవ

అసలు విషయం చెప్పేయాలనుకున్నాడు ముకుందం కానీ చెప్పలేదు.

తను చేసిన ఘనకార్యం అంత తేలిగ్గా చెప్పేస్తే ఎలా? వుడికించి సస్పెన్స్‌లో ముంచి చెప్పితేగాని తన మనస్సుకు హాయి, కొడుకునుంచి ప్రశంసలూ అందవ్

కొడుకుకేసి ఆప్యాయంగా చూస్తూ "ముందు స్నానం చెయ్ ప్రయాణ బడలికలో వున్నావ్" అంటూ బాత్‌రూమ్‌కేసి అడుగులు వేశాడు తండ్రి.

త్వరత్వరగా స్నానం ముగించి విషయం చెప్పమన్నట్టు ఆతృత పడ్డాడు రాఘవ. ముకుందానికి చెప్పక తప్పలేదు

"నీకు వ్రాసినట్టు ఆ ముహూర్తానికే లక్ష్మి పెళ్ళి జరిగిపోయింది"_ గర్వంగా అన్నాడు ముకుందం

అవాక్కై చూశాడు రాఘవ

ఏమిటీతని వాలకం ? లక్ష్మి పెళ్ళితో అన్నగా తన కేమీ సంబంధం లేదా ? ఆ మాట చెప్పడానికి యితనికి నోరెలా వస్తోంది?_

రాఘవ ముఖంలో అన్ని ప్రశ్నలూ కనిపించాయి ముకుందానికి

"ఏమిట్రా అలా చూస్తున్నావ్ నీ చెల్లాయికి నేనేం తక్కువ చేయలేదోయ్. మంచి సంబంధమే చేశాను లక్షాధికారి సంబంధం" వత్తి పలికాడు ముకుందం అతనిలో తెచ్చిపెట్టుకొన్న దర్పం కనిపిస్తోంది

'చూశావా నా తడాకా' అని రాఘవకేసి చూస్తూ 'నీ మోహం నీవైతే యిటువంటి సంబంధం తేగలవా?' అని హేళనచేసినట్టయింది.

రాఘవకి లక్ష్మి అంటే ప్రాణం. అలాంటి లక్ష్మి పెళ్ళి తనకు తెలియకుండా జరగడం ఆతనికి బాధగానే వుంది.

జరిగిపోయిందానికి ఆలోచించి ప్రయోజనం లేదనుకున్నాడు. వెంటనే వెళ్ళి చెల్లిల్ని చూడాలనే కోరిక అతనిలో బలపడిపోయింది.

## 10

బస్సు దిగిన రాఘవ మనస్సులో కోటి ప్రశ్నలు_

లక్ష్మి ఎలావుందో? యిల్లాలైపోయిన లక్ష్మి పెద్దరికాన్ని పైన వేసుకొనివుంటుంది కాబోలు తనను చూడగానే పరుగెత్తుకొంటూ వస్తుంది అవును లక్ష్మి నా చెల్లెలు నా ప్రాణం

యిలా ఎన్నెన్నో ప్రశ్నలు రాఘవ మెదడుచుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

రాఘవ విజయ్ యింటిగేటుని చేరుకున్నాడు.

అది యిల్లులా లేదు పెద్ద కోటలా కనిపించింది విజయ్‌కి.

గేటు దాటి పదిగజాలు నడవగానే పెద్ద వలయాకారంతో కూడిన ఫౌంటెన్ దాని మధ్యలో అందమైన రాధాకృష్ణుల విగ్రహం ఫ్లాంటెన్ చుట్టూతా రకరకాల మొక్కలతో కూడిన రంగురంగుల పూల సోయగం కాంపౌండు గోడనానుకొని చుట్టూ ప్రదక్షిణం చేసినట్టుండే కొబ్బరిచెట్ల మధ్యలో పొడవుగా పెరిగిన పోకచెట్లు మొదటి అంతస్తు వరకూ అల్లుకొని అందానిచ్చే బోగన్‌విల్లా తీగలు ఆ యింటి హోదాని చెప్పకయే విశదపరుస్తున్నాయి.

లోన అడుగుపెట్టిన రాఘవని ఆప్యాయంగా ఆహ్వానించింది లక్ష్మి ఆమె ఆతిథ్యం అతనికి మరుపురానిదిగా తోచింది. కానీ ఆమెలో ఏదో లోటుని గమనించాడు రాఘవ మునుపు ఆమెలో వుండిన చలాకీతనం మచ్చుకు కనిపించ లేదు అతనికి.

'పెళ్ళయింతర్వాత ఆడపిల్లలందరూ యిలాగే అయిపోతారు కాబోలు'— అనుకున్నాడు రాఘవ.

పట్నంవెళ్ళిన బావగారు ఆరోజుకి తిరిగిరాలేదు. అతన్ని చూడకుండ వెళ్ళిపోవడం రాఘవకి మనస్కరించలేదు.

మర్నాడుకూడా విజయ్ యింటికి రాకపోవడంతో "ఏవిటమ్మా బావగా రింకా రాలేదు ఎప్పుడొస్తారో నీకు చెప్పివెళ్ళలేదా?" అన్నాడు రాఘవ.

భీతహరిణిలా అయింది లక్ష్మి.

ఆమెకేసి అనుమానంగా చూసేడు రాఘవ.

"ఏం జరిగిందమ్మా నిజం చెప్పు" అనునయంగా ప్రశ్నించాడు రాఘవ.

లక్ష్మి తట్టుకోలేకపోయింది. గుండెలో దాచుకొన్న అగ్నిపర్వతం బ్రద్ద లయింది. భోరున ఏడుస్తూ రాఘవ హృదయానికి హత్తుకుపోయింది లక్ష్మి.

ఆమె కథనంతా విన్నాడు రాఘవ. అతని మనస్సు ద్రవించింది.

ఆ రాత్రికే యింటికొచ్చాడు విజయ్.

భర్త వచ్చాడన్న సంతోషం లక్ష్మిలో కనిపించలేదు. పరిస్థితిని అవగాహన చేసుకొన్నాడు రాఘవ.

తన గదిలో అడుగుపెట్టిన రాఘవని ప్రశ్నార్థకంగా చూశాడు విజయ్. లక్ష్మి రాఘవని పరిచయం చేసింది.


AVM

యిద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. లక్ష్మి అందించిన టీ త్రాగుతూ కుశలప్రశ్నలు వేసుకొన్నారు

లక్ష్మికి ముళ్ళమీద నిలబడినట్టుంది.

“మీ పెళ్ళికి రాలేకపోయినందుకు క్షమించండి. అందుకే మిమ్మల్నిద్దర్నీ చూడాలని వచ్చాను. అంతేకాదు మీరిద్దరూ నాతో మావూరు రావాలి” అన్నాడు రాఘవ.

“నేనా..?” అన్నాడు విజయ్

“అవును.”

“సారీ... నాకు చాలా పనులున్నాయి. మరెప్పుడైనా వస్తాను. కావాలంటే మీ చెల్లాయిని తీసుకెళ్ళండి” తప్పుకొంటూ అన్నాడు విజయ్.

లక్ష్మికి లోలోన వుక్రోషం పెరిగింది.

“యిప్పుడెందుకులే అన్నయ్యా...” అంది అర్థింపుగా.

“అలా అనకు లక్ష్మీ. నాన్న మనకోసం ఎదురుచూస్తూ వుంటాడు. తీసుకొస్తానని చెప్పి మరీ వచ్చాను. వెళ్ళ ప్రయాణానికి సిద్ధమవ్వు” అన్నాడు రాఘవ.

లక్ష్మి ఎదురుచెప్పలేకపోయింది.

లక్ష్మిని, రాఘవని రామ్‌నగర్‌లో వాళ్ళ యింటిదగ్గర దింపినకారు వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.

లక్ష్మి రాకకి సంతోషించాడు ముకుందం. వేదన నిండిన ఆమె ముఖాన్ని పరిశీలనగా చూసి మ్రాన్పడిపోయాడు.

"ఏమిటమ్మా అలావున్నావ్?" కూతుర్ని పొదివిపట్టి చూపుతూ ప్రశ్నించాడు

మౌనం దాలిసింది లక్ష్మి.

రాఘవ వదనం ముభావంగా మారిపోయింది కదిలిస్తే బ్రద్దలయ్యే అటం బాంబులా తయారయింది.

"నాతో చెప్పమ్మా నేనెవర్ని నీ తండ్రినేగా" అనునయంగా ప్రశ్నించసాగాడు ముకుందం.

తోక త్రొక్కిన పాములా బుసకొట్టాడు రాఘవ.

"కన్నతండ్రినని చెప్పుకోడానికి నీకు మనస్సెలా వచ్చింది" తండ్రిని సూటిగా ప్రశ్నించాడు.

"ఇప్పుడేం జరిగిందోయ్ ?" తండ్రిమాత్రం తక్కువ తినలేదు.

"యింకా ఏం జరగాలి? నువ్వు చేసిన పెళ్ళికి ఆనందపడిపోతూ సర్వ సుఖాలూ అనుభవిస్తోంది లక్ష్మి" వ్యక్రోషంగా అన్నాడు రాఘవ.

రాఘవ మాటలు అతనికర్థం కాలేదు.

"జరిగిందేమిటో చెప్పరాదూ" అన్నాడు కొంచెం తగ్గుతూ.

"అంతా అయిపోయింతర్వాత యిప్పుడు చెప్పి లాభమేమిటి?"

"నువ్వనేదేమిటో నా కర్థంకాలేదు"

"ఆనాడు ముందూ వెనకా ఆలోచిస్తేగా యిప్పుడర్థమవడానికి. లక్షాధికారి సంబంధమంటూ పరుగుతీశావ్ ఆ పరుగులో దాని జీవితాన్ని మంటగలిపావ్" అన్నాడు రాఘవ.

లక్ష్మిలో వెలితి స్పష్టంగా కనిపిస్తోంది ముకుందానికి.

"అసలేం జరిగిందో చెప్పండర్రా" అంటూ తల పట్టుకున్నాడు ముకుందం.

"రాజాలాంటి సంబంధమని లక్ష్మినిచ్చి చేశావ్, కానీ ఆ విజయ్ తన మొదటిభార్యను మరువలేక, లక్ష్మిని స్వీకరించలేక సతమతమవుతున్నాడు" అన్నాడు రాఘవ.

"అలా అయితే లక్ష్మి నెందుకు చేసుకున్నాడు?"— తండ్రిగా అతని హృదయం కలుక్కుమంది.

"పెళ్లి అతన్నే అడుగు లక్ష్మికేసి కన్నెత్తయినా చూడడట. ఎప్పుడూ గదిలో కూర్చొని మొదటిభార్య గతస్మృతులు నెమరువేసుకుంటుంటాడట."

ముకుందం హృదయం అర్ద్రమయింది. కూతుర్ని అప్యాయంగా దగ్గరికి తీసుకోకుండా వుండలేకపోయాడు.

## 11

అన్నిట్లోకి నిరుద్యోగ సమస్య ప్రబలమయింది.

రాఘవ ఆశించినట్టు అతనికి ప్రభుత్వ ఉద్యోగం దొరకలేదు.

టౌన్‌లో ఓ ప్రైవేట్ వర్క్‌షాపులో 'అప్రెంటిస్' వుద్యోగం సంపాదించాడు రాఘవ.

యింటికి తిరిగివచ్చేసరికి లక్ష్మి ప్రయాణానికి సిద్ధంగా వుంది.

"ఏమిటి? ఎక్కడకెళ్తున్నావ్?" అంటూ ప్రశ్నించాడు రాఘవ.

లక్ష్మి భయపడిపోయింది.

చేతిలోని భగవద్గీతను అరుగుమీద పెట్టి రాఘవని సమీపించాడు ముకుందం.

"అదికాదురా అది మనయింటి ఆడపడుచైనా ఆడపిల్లే కదా। ఆడపిల్ల జీవితం సుఖించినా, దుఃఖించినా అత్తవారింట్లోనే. మనింట్లో వుండి అది పొందే సుఖమేమిటి? అందుకే రెండ్రోజుల్నుంచి మరీ దిగులుగా వుంటే నేనే తీసుకెళ్ళి దిగబెడతానని చెప్పాను" అన్నాడు ముకుందం.

కోపమొచ్చింది రాఘవకి.

తండ్రితో తర్కంలోకి దిగడం అతని కెంతమాత్రయూ యిష్టంలేదు. కానీ లక్ష్మి విషయంలో వూరుకోలేకపోయాడు.

"అయితే దాన్ని తీసుకెళ్ళి మళ్ళీ నరకంలో తోస్తావన్నమాట।—"

కటువుగా అన్నాడు రాఘవ.

"నరకమేమిటిరా? భర్త యిల్లు నరకమెలా అవుతుంది?"

"భర్త!"— నవ్వొచ్చింది రాఘవకి.

"భర్తగా ఆమె నెప్పుడు లాలించాడు? భార్యగా ఆమె నెప్పుడు చూశాడు విజయ్?"

రాఘవ సూటిప్రశ్నకి సమాధానం యివ్వలేకపోయాడు ముకుందం, లక్ష్మిలో భయ మెక్కువయింది. ఆమెకి వెళ్ళిపోవాలనే వుంది. భర్త దగ్గరే వుంటే కొన్నాళ్ళకైనా అతనిలో మార్పొస్తుందనే ఆశ ఆమెలో చచ్చిపోలేదు.

ఆఖరికి తన నిశ్చితాభిప్రాయాన్ని వెల్లడించాడు రాఘవ.

"లక్ష్మి జీవితం సరిగాలేదనేకదా లక్ష్మిని నే నిక్కడికి తీసుకొచ్చింది. అలాంటప్పుడు దాన్ని మళ్ళీ మనమే తీసికెళ్ళి దిగబెడితే లక్ష్మికి అక్కడ

ఎలాంటి గౌరవం దక్కుతుందో ఆలోచించండి నాన్నా. కొన్నాళ్ళు యిక్కడే వుంటే మనకు ఎక్కువైపోదు. నామాట విని లక్ష్మిని యిక్కడే వుండనివ్వండి" అన్నాడు రాఘవ.

రాఘవకేసి దీనంగా చూసింది లక్ష్మి. ఆమెను గమనించాడు రాఘవ.

"చూడు లక్ష్మీ! నువ్విక్కడే వుండిపోతే నీ సంసారం సానుకూలపడదని భయపడకమ్మా అలా ఎప్పటికీ జరగనివ్వను. నా శాయశక్తుల ప్రయత్నించి విజయ్ నిన్ను ఆదరించేట్టు చేస్తానమ్మా. నువ్వేం దిగులుపడకు" అంటూ హామీ యిచ్చాడు.

అతని మాటల్లో ధైర్యం చిక్కబట్టుకుంది లక్ష్మికి.

ఆమెకు ధైర్యం నూరిపోసి తనతోటి టౌన్‌కి తీసుకెళ్ళాడు రాఘవ.

రామ్‌నగర్ వెళ్ళి లక్ష్మిని తీసుకురావాలన్న ఆలోచనే విజయ్ మనస్సుకెక్కలేదు

'కళ్యాణి' ముద్దుమాటలతో ఆటలతో కాలన్ని వెళ్ళబుచ్చసాగాడు. శ్యామల రూపురేఖల్ని కళ్యాణిలో చూసుకొంటూ మురిసిపోసాగాడు. కళ్యాణే తన సర్వస్వమన్నట్టు మారిపోయాడు విజయ్.

అతనెక్కడికి కెళ్ళినా కళ్యాణిని వెంటబెట్టుకొని వెళ్ళడం. అలవాటు చేసుకొన్నాడు. విజయ్ ప్రవర్తనకి విస్తుపోయాడు ధర్మయ్య.

ఒకటిరెండు సార్లు లక్ష్మిని తీసుకురమ్మని హెచ్చరించి విఫలుడయ్యాడు.

అతని పెద్దరికాన్ని విలబెట్టే పరిస్థితులలో లేడు విజయ్.

ఎక్కడికి వెళ్తున్నాడో ఎప్పుడు తిరిగివస్తాడో చెప్పలేని పరిస్థితి అయింది యింటిలో వాళ్ళకి.

* * *

సంధ్యవేళ

నలుదిక్కులా చీకట్లు అలుముకున్నాయి. చుక్కలు బారులు దీరి నిశాచరుడికి స్వాగతం పలుకుతున్నాయి.

ట్రాక్టర్ రిపేర్‌కని పల్లెకెళ్ళిన రాఘవ సైకిల్‌మీద తిరిగివస్తున్నాడు.

రోడ్డు కిరుప్రక్కలా గాలికి వూగుతున్న వరి పైరులోంచి వింత శబ్దాలు వినిపిస్తున్నాయి. యిల్లు త్వరగా చేరాలని ఆతృతగా సైకిల్ తొక్కుతున్నాడు రాఘవ.

వున్నట్టుండి ప్రశాంతతని భంగపరుస్తూ కెవ్వున కేక

సడన్ బ్రేక్ నొక్కాడు రాఘవ సైకిల్‌కిస్టాండు వేసి నలువైపులా తేరికించి చూశాడు. ఎక్కడా మనుష్య సంచారమే కానరాలేదు.

మళ్ళీ సన్న మూలుగు

ఏ ప్రక్కనుంచి వచ్చిందో స్పష్టంగా తెలుసుకోలేకపోయాడు

రాఘవ మనస్సు కీడు శంకించింది.

ఎటూ పాలుపోక రోడ్డు ప్రక్కనే వున్న తూముపై కూర్చున్నాడు.

మళ్ళీ సన్నగ సనసన్నగా మూలుగు

ఎక్కడో కాదు తను కూర్చొనివున్న తూముక్రింది భాగంలోనే. వడిగ లేచి నీళ్ళులేని పంటకాలువలోకి దూకాడు రాఘవ అంతా చీకటి— కన్ను పొడుచుకున్నా ఏమీ కనిపించలేదు

మూలుగు ఆగిపోయింది.

ధైర్యంచేసి తూములోపలికి నడిచాడు రాఘవ. అంతే వెంట అతన్ని బలమైన పిడికిలిగుద్దు ముద్దుపెట్టుకుంది. క్రిందపడి తెప్పరిల్లుకొని లేచా రాఘవ. లోపల ఎవరో పరుగెత్తుతున్నట్టు అర్థమైపోయిందతనికి. కనీసం అత చేతిలో టార్చికూడా లేదు.

యీసారి కేకలు పెద్దవయ్యాయి. తూము అవతలభాగంనుండి వినిపి చాయి. అలస్యం చెయ్యకుండా రోడ్డుకడ్డంగా పరుగెత్తి అవతలికి చేరుకున్నా రాఘవ.

చీకట్లో అతనికి మసగ్గా కనిపించింది

ఓ దృఢకాయుడి చేతిలో ఓ చిన్నారిపాప నలిగిపోతోంది. చేతులూ కాళ్ళూ గింజుకొంటోందా పాప

పరుగెత్తి మొండిగా వాడిమీదికి దూకాడు రాఘవ. యిద్దరూ కలియబడ్డారు ముష్టియుద్ధం జరిగింది. స్థూలకాయుడు పాపని వదిలేసి పైరులోపడి లంగిం కున్నాడు.

పాపని చేతిలోకి తీసుకొని చూశాడు రాఘవ. ఆమె మెళ్ళోని బంగా గొలుసు, చేతుల్లోని గాజులు చీకట్లో తళతళ మెరిశాయి.

సైకిలెక్కి పాపతోటి ఇంటికి చేరుకున్నాడు రాఘవ

అతని చేతిలోని పాపని చూసి ఆశ్చర్యపోయింది లక్ష్మి. ఎవరన్నయా

యీ పాప" అంటూ తన చేతిలోకి తీసుకుంది పాపని లైటు కాంతిలో పాప వదనాన్ని చూసి ప్రమాన్పడిపోయింది లక్ష్మి.

పాప ఎవరో కాదు శ్యామల కూతురు 'కళ్యాణి'.

ఎవరి లాలనలో లక్ష్మి దుఃఖాన్ని మరిచి ఉపశమనాన్ని పొందిందో ఆ 'కళ్యాణి'.

కళ్యాణిని హృదయానికి హత్తుకుంటూ ముద్దులవర్షం కురిపించింది లక్ష్మి.

బాత్‌రూంనుండి తిరిగివస్తూ లక్ష్మిని ఆశ్చర్యంగా చూశాడు రాఘవ. అంతకు మునుపులేని సంతోషంతో వెలిగిపోతోంది ఆమె వదనం

"పాప నివ్వమ్మా పోలీస్‌స్టేషన్లో అప్పజెప్పివస్తాను" అన్నాడు రాఘవ.

స్థాణువై నిలబడిపోయింది లక్ష్మి.

"ఏవిటమ్మా అలా అయిపోయావ్?" అన్నాడు రాఘవ ఆశ్చర్యపోతూ.

"యీ పాపని యిక్కడికెలా తీసుకొచ్చావన్నయ్యా" అంది లక్ష్మి.

జరిగింది వివరించాడు రాఘవ ఆనందపడిపోయింది లక్ష్మి

"అన్నయ్యా యీ పాపెవరో నీకు గుర్తుందా?"అంటూ ప్రశ్నించింది ఆలోచించాడు. అతని మనసు కందలేదు.

"యీ పాపే అన్నయ్యా నాకు తోడు యీ పాప లాలనలోనే నేను నా బాధనంతా మర్చిపోగలిగాను యింకా అర్థంకాలేదా అన్నయ్యా యీ పాపే అన్నయ్యా ఆయన కూతురు కళ్యాణి" పూడుకుపోయిన గొంతుతో అంది లక్ష్మి.

పాపని పరిశీలనగా చూశాడు రాఘవ

"యీ పాపను మనతోనే వుంచుకుందామన్నయ్యా "

చివుక్కున తలఎత్తి చూశాడు రాఘవ

దీనాతిదీనంగా చూస్తోంది లక్ష్మి.

రాఘవ మాట్లాడలేకపోయాడు.

యీ పాపవల్ల లక్ష్మికి ఉపశమనం కలగవచ్చేమో ?

పాపే ఆమెలో కొంత మార్పు తీసుకురావచ్చేమో??

ఆలోచనారేఖ రాఘవ కళ్ళల్లో ద్యోతకమయింది.

* * *

విజయ్ బసచేసిన లాడ్జిలో అంతా హడావుడి 'పాప పోయింది__పాప పోయింది'__ ఒకటే గోల.




విజయ్ గదిలో దీనంగా కూర్చొనివున్నాడు. అతని ప్రక్కనే వున్న హోటల్ మేనేజర్ విజయ్‌ని ఓదార్చుతున్నాడు.

"పోలీసుస్టేషన్‌కి ఫోన్‌చేశాం సార్.... పాప తప్పకుండా దొరుకుతుంది మీరు బాధపడకండి."

ఎంత అనునయించినా విజయ్ హృదయంలోని బాధ పోగొట్టలేనిది

శ్యామల మరణం అతని జీవితంలో మొదటి షాక్

ఆమె ప్రతిరూపం 'కళ్యాణి' తప్పిపోవడం హృదయ విదారకమయిన రెండో షాక్

కాదు కాదు

డబుల్ షాక్!!

## 13

హెడ్‌లైట్ కాంతిద్వారా ఎదురుగానున్న చీకటిని రూపుమాపుతూ పట్టాల మీద శరవేగంతో పరుగెత్తుతోంది మద్రాస్-హైద్రాబాద్ ఎక్స్‌ప్రెస్.

బెర్త్ మీద నడుంవాల్చి నిశీదంలోకి చూస్తున్న రాఘవ మదిలో ఆలోచనలు రైలుకన్నా వేగంగా సుడులు తిరుగుతున్నాయి.

అతని మనసంతా వేదనతో నిండిపోయింది

నెలలు గడిచినా విజయ్ లక్ష్మికోసం రాలేదు ఆమె అడక త్తెరలో పోక చెక్కలా నలిగిపోతోంది. ఎప్పుడోతప్ప ఎక్కువకాలం వేదనాభారంతో కృంగి పోతూ వుంటుంది.

సుదూరంలో పరిష్కారం కనిపించలేదు రాఘవకి.

ఒకటి, రెండుసార్లు విజయ్‌ని కలవాలని వెళ్ళి నిరాశచెందాడు. విజయ్ ఇంట్లో దొరకడంలేదు. అతను ఎక్కువకాలం బయటే గడుపుతున్నాడని తెలుసు కొని బాధపడ్డాడు

అప్పుడప్పుడూ రాఘవ ఉద్యోగరీత్యా బయటకు వెళ్లాల్సి వస్తోంది. ఒంట రిగా వున్న లక్ష్మి యింటిదగ్గర ఏదైనా అఘాయిత్యానికి పూనుకుంటుందేమో అన్న ఆలోచన రాఘవని తినేస్తోంది.

ఆలోచనా భారంలో ఉన్న రాఘవ ట్రైను ఆగడమూ, కదలడమూ గమ నించలేదు.

ఉన్నట్టుండి గాలి దుమారంలా ఓ పెళ్ళిగుంపు ఆ కంపార్టుమెంట్‌లో అడుగుపెట్టగాన త్రుళ్ళిపడి లేచాడు రాఘవ.

ఆలోచనలు చెరిగిపోయాయి. ఎలాగూ నిద్రపట్టదని బెర్త్ దిగి క్రింది కొచ్చాడు. కూర్చున్నాడేగాని అతని మనస్సు కలతగానే వుంది.

పెళ్ళివారినందర్నీ కూర్చోబెట్టిన ఓ పెద్దమనిషి రాఘవ ప్రక్కసీటు నాక్రమించాడు. అతని వునికి వున్నవాడని చెబుతోంది.

కొంతసేపటికి యిద్దరి మధ్యా మాటలు కలిశాయి. ఆ మాటల్లో ఆ పెద్దమనిషిపేరు దయానిధి అని మైకా వ్యాపారంలో బాగా సంపాదించా డని అతని ఒక్కగానొక్క కూతురి పెళ్ళికి పరివారంతో తరలివెళుతున్నా డని తెలుసుకున్నాడు రాఘవ.

యిద్దరి మధ్య ఎన్నో చర్చలు సాగాయి.

అంతలోనే యిద్దరూ ఎంతో దగ్గరయ్యారనిపించారు.

రైలు శరవేగంతో సాగిపోతోంది. యిద్దరి మధ్య మాటలాగలేదు. రాఘ వని పెళ్ళికి రమ్మని ఆహ్వానించాడు దయానిధి. రాఘవ కంపెనీపనిమీద వెళ్ళ

వస్తున్నాడు. అందుకే పెళ్ళికి రాలేననీ, తర్వాత మరెప్పుడైనా కలుస్తానని చెప్పాడు

అలా అలా వాళ్లు ఎంతసేపు మాట్లాడారో వాళ్ళకే గుర్తులేదు. చాలా సేపటి తర్వాత యిద్దరూ కళ్ళుమూసుకొంటూ నిద్రలోకి జారిపోయారు,

దయానిధి తన స్టేషన్లో దిగుతూ రాఘవకి చెప్పాడు. కానీ రాఘవకి అంతగా గుర్తులేదు మగతలోనే 'వూఁ' కొట్టాడు.

మళ్ళీ కదలబోతూ ట్రైన్ శబ్దంచేసింది.

చివుక్కున లేచిన రాఘవ కంపార్టుమెంట్ దాదాపు ఖాళీగా ఉండటం చూసి ఆశ్చర్యపోయాడు. అప్పటికే ట్రైన్ అవుటర్ సిగ్నల్ దాటింది.

## 14

దేవాలయ ప్రాంగణంలోని మంటపం చక్కగా అలంకరించబడింది. పెళ్ళిశోభ ఆ పరిసరాన్నంతా పరుచుకొనివుంది అడా-మగా అటూయిటూ పరుగెడుతున్నారు పెళ్ళివనుల్లో

పెండ్లి కుమారుడు వేదిక నలంకరించాడు పురోహితుడు అతనిచేత మంత్రార్చన చేయిస్తున్నాడు కొంతసేపు అలా జరిగాక "పెళ్ళికుమార్తెను తీసుకురండి" అన్నాడు పురోహితుడు.

అందమైన ముఖవర్చస్సుగల సునీతను తీసుకొచ్చి పెండ్లికుమారుని ప్రక్కగా వేదికనలంకరింపజేశారు ముత్తయిదువలు సునీతను చూసి ముసి ముసిగా నవ్వుతున్నాడు పెండ్లికొడుకు.

పురోహితుడి మంత్రార్చన జోరుగా సాగింది

అందరూ అసలు ఘడియకోసం వేచి చూస్తున్నారు

భజంత్రీలను ఆదేశిస్తూ బొట్టుకట్టిన పసుపుతాడుని పెండ్లికుమారుని కందించాడు పురోహితుడు. తానూ గొంతు పెంచి "మాంగల్య తంతునానేనాం మహాదేవన హేతునాం " అంటూ మొదలుపెట్టాడు

వాయిద్యాలు తారాస్థాయి నందుకొన్నాయి.

పెండ్లికుమారుడు పురోహితుడి ఆదేశానుసారం పసుపుతాడుని సునీత మెళ్ళో బిగించబోయాడు,

ఉన్నట్టుండి ఆ పరిసరంలో పిడుగు పడింది

అది నిజంగా పిడుగు కాదు పెండ్లి కుమారుని తండ్రి ఘీంకారం.

"కట్నం మెక్కడ" అన్నాడు.

అతని వాలకం మాస్తే కట్నం అక్కడ పెడితేగాని తన కుమారుడిచేత తాళి కట్టించేట్టులేదు

దయానిధి గుండెను దిటవుచేసుకున్నాడు.

"దాని కింత గొడవెందుకు బావగారూ " అంటూ తన చేతిలోని బ్రీఫ్‌కేస్‌ని తెరిచి ఆశ్చర్యపోయాడు దయానిధి.

అందులో ఓ జత మామూలు దుస్తులు కనిపించాయి. అవి అతనివి కావు. ఓ ప్యాంటూ షర్టూ

కళ్ళు బైర్లుగమ్మాయి దయానిధికి. గుండె వేగంగా కొట్టుకుంది

వళ్ళంతా ముచ్చెమటలు పోశాయి.

అందరిలోనూ అతనికి తీరని అవమానం. వ్యాపారంలో బాగా గడించి లక్షాధికారినని పిలిపించుకొన్న దయానిధికి తలకొట్టేసినట్టయింది.

వళ్ళు తూలి అక్కడే సొమ్మసిలి పడిపోయాడు

ఆ పరిసరం అంతా గోలగా మారింది

"లే లేరా, అదంతా ఓ నాటకం" అంటూ తన కుమారుడ్ని వేదిక పైనుంచి లేవదీశాడు అతని తండ్రి.

"ఛఛ- ఆఖరికి ఎట్టాంటి సంబంధం ఖాయపర్చావు నాన్నా" అంటూ విసుక్కున్నాడు పెండ్లికుమారుడు

"నీకేంరా యిదిగాకపోతే యింకో కోటీశ్వరుడి సంబంధం చేసుకుందువు గాని " అంటూ కొడుకుని చేయిపట్టుకొని ముందుకు నడిపించాడు తండ్రి.

విహ్వల దృష్టితో దీనంగా వేదికను కదుచుకొని కూర్చుండిపోయింది పెండ్లికుమార్తె సునీత. అవమానం ఆమెను దహించివేస్తున్నట్టనిపించింది

ముఖంమీద పడిన నీటి బిందువుల్ని కండువాతో తుడుచుకొంటూ ఆత్రుతగా లేచాడు దయానిధి సోలిపోతున్న శరీరాన్ని అదుపులోకి తెచ్చుకొంటూ పెండ్లికుమారుడు కేసి పరుగెత్తాడు.

పెండ్లి కుమారుని తండ్రి చేయి గట్టిగా దొరకబుచ్చుకొని "యివి చేతులు కావు బావా! నా బ్రీఫ్‌కేస్ ట్రెయిన్‌లో మారింది దాని స్థానే అదే రంగులో వున్న మరో బ్రీఫ్‌కేస్ నాకొచ్చింది. నామాట నమ్మండి అంతేగాని నేను మిమ్మల్ని మోసంచేయదలంలేదు. నా మాట నమ్మండి" అంటూ ప్రాధేయ పడ్డాడు.

దయానిధి చేతిని విడిలించికొట్టాడు పెండ్లి కుమారుని తండ్రి. తండ్రీ కొడుకులిద్దరూ దయానిధిలోని దీనత్వాన్ని గమనించలేదు.

వారి పటాలం దేవాలయం ప్రాంగణం దాటగానే వాళ్ళముందు ఓ టాక్సీ వచ్చి ఆగింది. అందులోంచి అదే రంగు బ్రీఫ్‌కేస్‌తో రాఘవ దిగాడు.

అందరూ అతన్నే చూస్తూ నిల్చుండిపోయారు,

రాఘవని చూడగానే దయానిధికి పోయిన ప్రాణం లేచివచ్చినట్టయింది. పరుగున వచ్చి రాఘవని సమీపించాడు.

"నిద్రమత్తులో మీరే నా బ్రీఫ్‌కేస్ తీసుకొచ్చేశారు యింటికి వెళ్ళగానే తెరిచి ఆశ్చర్యపోయాను. దీన్నిండా నోట్ల కట్టలే యిది మీదేనన్న నమ్మకంతో వెంటనే బయలుదేరి వచ్చేశాను" అన్నాడు రాఘవ బ్రీఫ్‌కేస్‌ని దయానిధికి అందిస్తూ

దయానిధి హృదయం అనంద తరంగమయింది

పెండ్లి కుమారుడూ అతని తండ్రి ఒకర్నొకరు చూసుకొన్నారు. "క్షమించు బావా! నిజం తెలియక నేనే తొందరపడ్డాను" అన్నాడు తండ్రి చేతులు నలుపుకొంటూ.

అక్కడ జరుగుతున్నదంతా సునీత తిలకిస్తూనే వుంది.

అందరూ యథాస్థానాల్ని అలంకరించారు. పెండ్లి కుమారుడు కూడా వేదికనెక్కి సునీత ప్రక్కన కూర్చోబోయాడు.

అంతకన్నా ముందు సునీత దిగ్గున లేచి నిల్చుంది.

ఆమె కళ్ళు రోషావేశాలతో నిప్పుల్ని కురిపించాయి

ఆ హఠాత్పరిణామానికి అందరూ ఆశ్చర్యపోయారు.

సునీతను చూసి పెండ్లి కుమారుడు వెనక్కి తగ్గాడు.

"నీక్కావల్సింది నేనా లేక ఆ బ్రీఫ్‌కేస్‌లో వున్న నోట్ల కట్టలా!"— నిలదీసింది సునీత.

సమాధానం యివ్వలేక వణికిపోయాడు పెండ్లి కుమారుడు.

అందరిలోనూ గుసగుసలు బయలుదేరాయి.

"మాట్లాడవేం నీకు ఆ కట్టలే ముఖ్యమనుకొంటే నువ్వు కట్టాలనుకున్న తాళి వాటికే కట్టు" అంటూ అతనివేపు ఛీత్కారంగా చూసి అంగలు వేసుకొంటూ వెళ్ళిపోయింది సునీత. ఆమె విడిది గదిలో దూరడం అందరూ బొమ్మల్లా చూస్తుండిపోయారు.

ఆ దృశ్యం రాఘవ్‌ని ఆలోచింపజేసింది. సునీత అభిమానానికి మనసులోనే అభినందనలు తెలుపుకోకుండా వుండలేకపోయాడు.

దయానిధికి ముచ్చెమటలు పోశాయి కూతురి ప్రవర్తనకి నొచ్చుకొంటూ తానూ కూతురి ననుసరించాడు. లోనికెళ్ళిన తండ్రి హృదయానికి హత్తుకొని హృదయ విదారకంగా విలపించలేదు సునీత. ఆ పెళ్ళికుమారుడ్ని ఖండించింది. అతన్ని చేసుకొనేకన్నా తనకు తాను వురిత్రాడు బిగించుకోవడం మేలని నొక్కి వక్కాణించింది.

తండ్రీ—కూతుర్ల మధ్యన తర్జనభర్జనలు జరిగాయి. కూతురి అభిప్రాయానికి భయపడ్డాడు దయానిధి.

ఓ ప్రక్కన మనస్సులో పన్నీరు చిలుకుతున్నా భయం భయంగానే గదినుండి బయటకొచ్చాడు దయానిధి. అతని రాకకై ఎదురుచూస్తున్న బంధువుల నెవరినీ పట్టించుకోకుండా నేరుగా రాఘవ దగ్గరికెళ్ళి నిల్చున్నాడు. చిరునవ్వుతో రాఘవకేసి చూస్తూ అతని చేయిపట్టుకొని విడిది గదిలోకి తీసుకెళ్ళాడు దయానిధి.

ఆడపిల్ల పెళ్ళి ఓసారి ఆగిపోతే మళ్ళీ జరగడం దుస్సాధ్యమని అతని మనస్సు ఘోషిస్తోంది.

లోపలికెళ్ళిన రాఘవ విస్తుపోతూ దయానిధికేసి చూశాడు. రాఘవ రెండు చేతుల్నీ తన చేతుల్లోకి తీసుకొన్న దయానిధి "నా కొన జీవితభాగం అనే నౌక ఆనంద సముద్రంలో పయనించాలంటే చుక్కాని నీ చేతుల్లో వుంది బాబూ" అన్నాడు దీనంగా.

అతనిలోని దీనత్వానికి కరిగిపోయాడు రాఘవ. 'ఇతన్నేనా క్రితం రాత్రి తాను ట్రైన్‌లో చూసింది!' అన్న ఆశ్చర్యం కలిగింది రాఘవకి.

"నిజం బాబూ. నీ సంస్కారానికి ముగ్ధురాలయింది మా సునీత. నువ్వే కావాలని కోరుకొంటోంది. దయచేసి దాన్ని పెళ్ళిచేసుకొని నా కానందాన్ని కలిగించు బాబూ" అంటూ మరోసారి ప్రాధేయపడ్డాడు దయానిధి.

దయానిధికేసి వింతగా చూశాడు రాఘవ.

అతని సమాధానం కోసం ఆ గదిలో దయానిధి, సునీత యిద్దరూ ఎదురు చూస్తున్నారు.

రాఘవ మాత్రం వెంటనే ఏమి చెప్పగలడు!




అతని కెన్నో బాధ్యతలు.

సరియైన వుద్యోగం దొరకలేదు.

లక్ష్మి జీవితం సానుకూలపడలేదు.

వాటి సాధనకోసమే అతను అహర్నిశలూ ఆలోచించడం అలవాటు చేసుకున్నాడు. మళ్ళీ యిదో బాధ్యతా!

ఏం చెయ్యాలి? ఏమని చెప్పాలి?

"మవ్వు కాదంటే నా బిడ్డ బ్రతుకు ఏమవుతుందో చెప్పలేను బాబూ. మరెవ్వరినీ చేసుకోనంటోంది. కన్యగానే వుండిపోతానని మొండికేస్తోంది" అన్నాడు అర్ద్రస్వరంతో దయానిధి.

గిరుక్కున వెనక్కి తిరిగి ఓ మూల కూర్చొనివున్న సునీతకేసి గ్రుచ్చి వట్టు చూడకుండా వుండలేకపోయాడు రాఘవ.

మిసమిసలాడే యవ్వనంతో
పద్మాల్లాంటి కనుదోయితో
కోడేరేసిన కొనదేలిన ముక్కుతో
లేత ఆకుల్లాంటి అదర ద్వయంతో
ఎంతో అందంగా కనిపించింది సునీత.

రాఘవ చూపులో చూపు కలపలేక సిగ్గుభారంతో వాలిపోయాయి ఆమె కనురెప్పలు.

ఆమెకేసి ఆరాధనగా చూశాడు రాఘవ

అతని హృదయంలో అప్పుడే తుది అభిప్రాయం రూపుదిద్దుకుంది

ముందు లక్ష్మి జీవితాన్ని చక్కదిద్దడం

తన అభిప్రాయాన్ని దయానిధి ముందుంచి అతనికి ఆనందాన్ని కలిగించాడు రాఘవ.

## 15

క్వాలిటీ బార్‌లోని మెర్క్యురీ లైట్లు స్వచ్ఛమైన తెల్లదనాన్నొలకబోస్తున్నాయి.

'రమ్'తో నిండిన గాజుగ్లాసు విజయ్ చేతిలో సున్నితంగా నలిగిపోతోంది. కొద్దికొద్దిగా సిప్‌చేస్తూ మళ్ళీ టేబుల్‌మీద పెడుతున్నాడు.

చేతిలోని సిగరెట్‌పీకను ఓ మూలకి విసిరి, మరో సిగరెట్ తీసి పెదాల మధ్య యిరికించుకున్నాడు విజయ్. జేబులోంచి లైటర్ తీసి వెలిగించుకొన్నాడు

అతనిలాంటివారు చాలామంది ఆ బార్‌లో కూర్చొని అదేపని చేస్తున్నారు. ద్రవాన్ని తృప్తిగా సేవిస్తూ మైమరచిపోతున్నారు.

కొందరు తోటివారి కంపెనీకోసం సేవిస్తే, మరికొందరు మనసుల్ని కృంగదీసే బాధల్ని మర్చిపోయేందుకు త్రాగుతున్నారా ద్రవాన్ని.

'కళ్యాణి' తప్పిపోయిన్నాటినుండీ మరికాస్త ఎక్కువ పుచ్చుకొని మత్తులోకి వెళ్ళిపోవడం అలవాటుచేసుకున్నాడు విజయ్.

లాస్టుసిప్ పూర్తిచేసి చేతిలోని సిగరెట్‌పీకను యాష్ట్రేలో నొక్కాడు విజయ్. అతని శరీరంలో క్రొత్త శక్తి వచ్చినట్టు తూలిపోతున్నాడు ఊగిపోతున్నాడు లేచి ముందుకి నడవబోయి తూలి ప్రక్కనే కూర్చొన్న మరో వ్యక్తిపైకి వొరిగాడు విజయ్.

ఆ వ్యక్తి విజయ్‌కేసి కోపంగా చూడలేదు - చీదరించుకొంటూ విసుక్కోలేదు విజయ్‌పై సానుభూతి చూపిస్తూ లేచి విజయ్‌ని కౌంటర్‌దాకా నడిపించాడు. కౌంటర్‌దాకా తప్పటడుగులు వేసి పర్స్ తీసేందుకు జేబులో చెయ్యివేసిన విజయ్ గతుక్కుమన్నాడు. జేబు నలుమూలలా చేయిపెట్టి వెతికినా పర్స్ కనిపించలేదు

అతని కేసి అమాయకంగా చూశాడు విజయ్.

కొంచెం మైకం తగ్గినట్టయింది.

"వ్వాట్ సార్ ...? వ్వాట్ హాపెండ్" అంటూ ప్రశ్నించాడు ఆసరా యిచ్చిన వ్యక్తి.

విజయ్ కళ్ళు తెల్లగా పాలిపోయాయి.

అతనికి సమాధానమివ్వకుండా తూలుతూ వెనక్కి వెళ్ళి తను కూర్చొన్న టేబుల్ పరిసరాలన్నీ గాలించాడు.

కానీ లాభంలేకపోయింది.

"వ్వాట్ హాపెండ్ సార్" రెట్టిస్తూ అడిగాడా వ్యక్తి.

"నత్తింగ్ నత్తింగ్" అని గొణుకున్నాడే గాని మళ్ళీ ఓ సారి జేబులన్నీ తడుముకోకుండా వుండలేకపోయాడు విజయ్.

పరిస్థితి అర్థమైందా వ్యక్తికి.

కౌంటర్ వరకూ వెళ్ళి విజయ్ బిల్ కూడా చెల్లించాడు.

"వద్దు వద్దు" వారించబోయాడు విజయ్.

విజయ్‌ని తూలిపడిపోకుండా ఆసరాయిచ్చి బార్ బయటికి తీసుకొచ్చాడా వ్యక్తి. అతని వేపు కృతజ్ఞతగా చూస్తూ ముందు కడుగులు వేశాడు విజయ్.

"ఐ నెవర్ ఫర్గెట్ యువర్ హెల్ప్" అని కూడా అన్నాడు.

"నో నో సార్! మనిషి ధర్మం" అంటూ ఆటోరిక్షాని పిలిచాడా వ్యక్తి.

యిద్దరూ కూర్చున్న ఆటోరిక్షా పార్క్ బయట ఆగింది. పార్క్‌లో అడుగుపెట్టి పచ్చగడ్డిపై కూర్చున్నారు యిద్దరూ. 'అంటుజాడ్యం ' అన్నట్టు యిద్దరూ సిగరెట్లు వెలిగించారు.

వాతావరణం ఆహ్లాదంగా వున్నా విజయ్ హృదయం మండుతోంది. పోయిన పర్స్ మాటిమాటికీ జ్ఞప్తికివస్తోంది.

అందులోని ఐదువేల రూపాయల నోట్లు కళ్ళముందు కరకర మంటున్నాయి.

గడ్డిపైన వెల్లికలా పడుకున్నాడు విజయ్

అతని మెదడులో బార్‌లో జరిగిన సంఘటన సినిమారీలులా తిరిగిపోతోంది

మరోసారి కృతజ్ఞతాభావం ఏర్పడక మానలేదు విజయ్‌కి.

"మీ పేరు ?" అడక్కుండా వుండలేకపోయాడు విజయ్

"శేషగిరి " సమాధానమిచ్చాడా వ్యక్తి.

"మీ రెవరో నాకు తెలియదు. కానీ నాకెంతో హెల్ప్ చేశారు మీకెలా కృతజ్ఞతలు తెలపాలో తెలియలేదు—"

"మీ రనుకొనే హెల్ప్ నేనేమీ చేయలేదండి" అంటూ వారించాడు శేషగిరి.

అంతటితో వదల్లేదు—

వచ్చిన అవకాశానిం వదులుకొనేటంతటి మూర్ఖుడు కాదు శేషగిరి నిజ—అబద్ధాల కలయిలో రంగరించి తన కథ విజయ్ నమ్మేవిధంగా చెప్పసాగాడు.

తానో అనాథైనట్టు అనాథ శరణాలయంలో పెరిగి పెద్దైనట్టు ఎన్నో కష్టాల నెదుర్కొని 'పట్టాపుచ్చుకొన్నా యీ సువిశాల భారతదేశంలో తనకే వుద్యోగమూ దొరకనట్టు పెద్ద అల్లికను కన్నీట మధ్య విన్న వించుకున్నాడు

అతని కథ విన కన్నీరు కార్చలేదు విజయ్

తనను ఆపదలో ఆదుకొన్న మిత్రుడిగా తన హృదయంలో అతనికి చోటు కల్పించాడు.

అందుకే శేషగిరి విజయ్‌కి పర్సనల్ సెక్రెటరీగా నియమితుడయ్యాడు.

గతుకుల బాటపై భారంగా నడుస్తున్న డొక్కు—కారు సిమెంటు రోడ్డుపై అడుగుపెట్టినట్టయింది.

పాపం! నిజం విజయ్‌కి మాత్రం ఎలా తెలుస్తుంది?

తన జేబులోంచి జారిపోయిన పర్స్‌ని కొట్టేసింది శేషగిరేనని విజయ్‌కేం తెలుసు ?

## 16

తెలిస్తే అతన్ని చేరదీసేవాడా? తనకి సెక్రెటరీ హోదా యిచ్చి ఆదరించేవాడా ?

వర్క్—షాపు నుండి తిరిగివచ్చిన రాఘవ యింట్లో కూర్చొనివున్న దయానిధిని చూసి విస్తుపోయాడు. వూరినుండి సునీత కూడా వచ్చింది

కుశలాలయ్యాయి.

రాఘవ, దయానిధిలే గాక లక్ష్మి—సునీతలు కూడా ఆరుబయట కూర్చున్నారు.

"బాబూ. నా యీ రాకకి ఓ ముఖ్యమైన కారణముంది" అంటూ ప్రారంభించాడు దయానిధి.

రాఘవ అతనివేపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"నువ్వు వేరే విధంగా భావించకపోతే నా అభిప్రాయం చెప్పడానికి నా కభ్యంతరం లేదు" అన్నాడు దయానిధి

"చెప్పండి" అన్నాడు రాఘవ.

"ఏమీలేదు బాబూ. ఎన్నాళ్ళని ఆ వర్క్‌షాప్‌లో పనిచేస్తావు? ఎన్నాళ్ళు చేసినా నీ స్వంతం కాదుగా. నువ్వేమనుకోకపోతే నేను పెట్టుబడి యిస్తాను. మరో వర్క్‌షాపు స్వంతంగా నడుపుకో" అన్నాడు దయానిధి.

అయిష్టంగా చూశాడు రాఘవ

ఎవరో డబ్బు తనదిగా వాడుకోవడం రాఘవ కిష్టంలేదు

అందులోనూ దయానిధి నుండి తీసుకుంటే స్వార్థమవుతుంది. ముందు కట్నం బాపతు వసూలుచేశా డనుకొంటారు అందరూ

"సారీ మీ మాట కాదంటున్నందుకు క్షమించండి" అన్నాడు రాఘవ కొంచెం యిబ్బుగ్గా పిలవుతూ

దయానిధి అభిమానం దెబ్బతిన్నట్టయింది అయినా తెప్పరిల్లుకున్నాడు. అతని మనస్సులో రాఘవ స్థానం మరో అంతస్థుకి ఎదిగింది. సునీత హృదయం కూడా పులకించింది

'రాఘవ స్వార్థపరుడు కాదు. సంస్కారహీనుడు అంతకన్నా కాదు'— మరోసారి ఆమె హృదయం వుప్పొంగింది.

మర్నాడు వర్క్‌షాపుకి బయలుదేరుతూ "లక్ష్మీ! కాఫీ " అంటూ కేక వేశాడు రాఘవ.

క్షణంలో లక్ష్మికి బదులుగా సునీత కాఫీకప్పుతో గదిలోకి దూరింది.

నిలువుటద్దంలో ఆమె ప్రతిబింబం చూసి వెనక్కి తిరిగాడు రాఘవ.

కాఫీ కప్పుతో నిల్చొనివున్న సునీత అతనికి అజంతాసుందరిలా కనిపించింది.

ఆమె కనురెప్పలు సిగ్గుభారంతో వాలిపోయాయి.

ఆమెనే కన్నార్పకుండా చూస్తూ నిల్చున్నాడు రాఘవ.

"కాఫీ" అంది సునీత.

ఆమె చేతిలోని కప్పుని అందుకున్నాడు.

అతన్నే తదేకంగా చూస్తోంది సునీత

కాఫీ సిప్‌చేసి చేదుమాత్ర మ్రింగినట్టు ముఖం పెట్టాడు రాఘవ.

ఏమైందన్నట్టు ఆమె కళ్లు అతన్నే బాధగా చూశాయి

"పంచదార " అన్నాడు రాఘవ.

"తక్కువయిందా?" నొచ్చుకుందామ్మాయి

"కాదు"

"మరి?"

"ఎక్కువయింది" చిలిపిగా చూశాయతని కళ్లు.

ఆమె చెంపలు కెంపులయ్యాయి.

అతను కొంటెగా నవ్వాడు

ఆ నవ్వు ఆమె చెవులకు శ్రావ్యంగా వినిపించింది.

ఆమెకూడా పెదాలు విప్పింది అతని నవ్వులో శృతికలిపింది.

ఎంత పెద్దగా నవ్వినా వాళ్ళ నవ్వులు గదివిడిచి బయటకు రాలేదు. అనురాగం హృదయాంతరాళాలు దాటి బయటపడలేదు.

ఖాళీ కప్పు అందుకొని తుర్రుమంది సునీత

ఆమె వెళ్ళినంత దూరమూ చూసి నవ్వుకున్నాడు రాఘవ

అతని హృదయంలో వెన్నెల విరిసినట్టయింది.

ఆ రాత్రి తెల్లని వెన్నెల పరుచుకొని వుంది.

భోజనాలయిన తర్వాత రాఘవ, దయానిధీ ఆరుబయట కుర్చీల్లో కూర్చున్నారు.

పున్నమి చంద్రుడు మబ్బులతో దోబూచులాడుతున్నాడు.

"రాఘవా! యీ సారి నా మాట కాదనకు" అంటూ అభ్యర్థించాడు దయానిధి

"ఏమీలేదు బాబూ! నాకు వున్నది ఒక్కగానొక్క కూతురు. వ్యాపారంలో సంపాదించింది బ్యాంకులో మూలుగుతోంది నా డబ్బుతో వర్క్‌షాపు పెట్టడం నీ కభిమానమయితే నేనొక ప్లాను చెబుతాను విను". అంటూ రాఘవకేసి చూశాడు దయానిధి

రాఘవ ఆసక్తిగా వింటున్నాడు

"నేనూ స్వార్థంతో మాట్లాడ్డంలేదు బాబూ. అందరి మంచికోరే చెపుతున్నాను. వర్క్‌షాపుకి సరిపోయే పెట్టుబడి పెడతాను. వాటి వ్యవహారాలు నాకు




తెలియవు గాబట్టి దాన్ని నడిపే బాధ్యత నీవు తీసుకో, పెట్టుబడి నాది—, పని నీది. పూర్తి ఆదాయం తీసుకోవడం నీ కభ్యంతరమైతే చెరిసగం పార్ట్‌నర్స్ మవుదాం. ఏమంటావ్?" అంటూ ఆసక్తిగా చూశాడు దయానిధి.

ఆలోచించాడు రాఘవ.

అతను చెప్పిందాంట్లో న్యాయముందనిపించింది.

మారు మాట్లాడకుండా వప్పేసుకోవటమే గాకుండా దయానిధికి కృతజ్ఞతలు కూడా తెలుపుకున్నాడు

## 17

ప్రత్యేకాకర్షణలతో నిర్మించిన 'సునీతా ఆటోమొబైల్స్' దినదిన ప్రవర్ధమానమై వుచ్ఛస్థితికి వచ్చింది.

రాఘవ మాటలోని మంచితనం, అతని అనుభవం అతనికి మంచి ఆఫర్స్‌ని తీసుకొచ్చాయి. కొద్దికాలంలోనే మంచి లాభాలు గడించాడు.

పెట్టుబడి పెట్టగానే తన బాధ్యత తీరిపోయిందనుకున్నాడు దయానిధి. కానీ అగ్రిమెంట్‌ని రాఘవ మర్చిపోలేదు. ఏ నెల ఆదాయం ఆ నెలలోనే అతనికి అందజేస్తున్నాడు.

యిద్దరి మధ్యా సంబంధబాంధవ్యా లెక్కువయ్యాయి.

రాఘవ క్రొత్తమేడ కొన్నాడు . స్వంత కారు . యింటిలో ఫోను . నౌకర్లు చాకిర్లూ

అంతా మార్పే—

భౌతికంగా అతనికి అంతస్తు పెరిగినా లక్ష్మి ఆవేదన అతన్ని విలువునా కృంగవేయసాగింది.

ఎన్నాళ్ళయినా విజయ్ ఆమెకోసం రాకపోవడం తను వెళితే ఇంట్లో లేకపోవడం రాఘవకి చికాకుని కలిగించింది.

అనిర్వచనమైన బాధ లక్ష్మిని స్థబ్దురాల్ని చేసింది.

తింటుంది తిరుగుతోంది మరే వ్యాపకమూ ఆమెను ఆలోచన నుంచి తప్పించలేకపోతోంది. 'కళ్యాణి' వున్నప్పటికీ ఆమెలో అలజడి తగ్గలేదు.

'ఎందుకిలా జరిగింది . ?. .ఎందుకిలా జరుగుతోంది...?' అని తర్కించుకోకుండా వుండలేకపోతోంది.

ఆడదానికి ఆడదే శత్రువు

స్త్రీకి స్త్రీనుండే సానుభూతి లభించదు

ఆ యదార్థాన్ని స్వానుభవంమీద అర్థంచేసుకోగలిగింది లక్ష్మి. యిరుగు పొరుగమ్మలు వేసే అర్థంలేని ప్రశ్నలకి సమాధానం చెప్పలేక ఏదో ఒక సమాధానం యిచ్చి జీవితాన్ని వాళ్ళముందు చులకనచేసుకోలేక పతమతమయింది

ఆమెను చూస్తూ కర్తవ్యమూఢుడయ్యాడు రాఘవ

ఆ పరిస్థితిలో అశనిపాతంలా ముకుందం చనిపోయాడన్న వార్త రాఘవని - లక్ష్మిని కలిచివేసింది

వూరికెళ్ళి అన్ని బాధ్యతలూ పూర్తిచేసుకొని తిరిగివచ్చారు.

లక్ష్మినిగూర్చి ఎంత ఆలోచించినా దారితెన్నూ కనిపించలేదు రాఘవకి.

విజయ్ కనిపిస్తే అతని కాళ్ళు పట్టుకొనైనా ప్రతిమాలాలనుకొన్నాడు. 'లక్ష్మి జీవితాన్ని శపించవద్దని వేడుకోవాలనుకున్నాడు.

కానీ విజయ్ జాడ కరువయింది.

ఎక్కడికి వెళ్లాడో ఎక్కడుంటాడో ఎవరికీ తెలియదు

## 18

కళ్యాణికి జడ అల్లుతున్న లక్ష్మి "అక్కయ్యా " అన్న పిలుపు విని వెనక్కి తిరిగిచూసింది.

రాజశేఖరం మేడ మెట్లెక్కుతున్నాడు.

'సునీతా ఆటోమొబైల్స్'లో అప్రెంటిస్‌గా పనిచేస్తున్నాడు రాజశేఖరం. యించుమించు ఇరవై ఏళ్ళుంటాయి

లక్ష్మి-రాఘవులకి అప్పుడు.

తన మంచితనాన్ని, అణకువని చవిచూపించి వాళ్ళిద్దరిదగ్గరా ఆ స్థానాన్ని సంపాదించుకొన్నాడు రాజశేఖరం

అతన్ని చనువుగా 'శేఖర్' అని పిలవడం అలవాటు చేసుకొన్నాడు రాఘవ.

లక్ష్మి 'రాజా' అని పిలిచేది.

రాఘవని తన అన్నయ్యగా మనసులో చిత్రించుకున్నాడు శేఖర్.

లక్ష్మి అంటే సరే సరి

"అక్కయ్యా" అంటూ ఆమెచుట్టూ తిరుగుతుంటాడు. వేదనతో వున్న ఆమె వదనాన్ని పసికట్టాడంటే ఏదో ఒక జోక్ వేసి నవ్వించందే వూరుకోడు.

ఆ యింట్లో అందరికీ తల్లో నాలుకలా మెలుగుతూ లక్ష్మి-రాఘవల ఆప్యాయతను పొందడం అలవాటు చేసుకున్నాడు శేఖర్.

"అక్కయ్యా" అంటూ మేడమీదకి వచ్చిన శేఖర్ని "ఏం రాజా!" అంటూ ప్రశ్నించింది లక్ష్మి.

ఆమెలో ప్రసన్నత చూసి తృప్తిపడ్డాడు శేఖర్.

"ఇవాళ అన్నయ్య లేటుగా వస్తాడట ఆయనకోసం వెయిట్ చెయ్యకుండా మిమ్మల్ని భోజనంచెయ్యమన్నారు" అని రెండు జడలు వేసుకొన్న కళ్యాణికేసి చిలిపిగా చూశాడు.

జడలు అల్లడం పూర్తిచేసి లేచింది లక్ష్మి.

నవ్వడిగాకుండా కళ్యాణి వెనక్కివచ్చి ఓ జడ పట్టుకొని కొంచెగా వెనక్కి లాగాడు శేఖర్. కళ్యాణి తూలిపడబోయి లక్ష్మిని గట్టిగా పట్టుకుంది.

కళ్యాణికి కోపం వచ్చింది. ఆమె పెదాలు రెండూ మెలిపడ్డాయి. భృకుటి ముడిపడింది "చూడమ్మా మావయ్యా" అంది చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ.

"చూలమ్మా . మావయ్యా" అంటూ నత్తి నభినయిస్తూ వెక్కిరించాడు శేఖర్.

కళ్యాణికూడా అతన్ని అనుకరిస్తూ "అవ్వెవ్వే " అంటూ శేఖర్‌కి చిక్కకుండా దూరంగా పరుగెత్తింది

శేఖర్ పకపకా నవ్వాడు.

లక్ష్మికూడా అతనితో శృతికలపకుండా వుండలేకపోయింది.

## 19

శేషగిరి తన ప్రతి మాటలోనూ, కదలికలోనూ అతి వాకచక్యాన్ని ప్రదర్శించి విజయ్‌ని బుట్టలో వేసుకున్నాడు.

శేషగిరికోటి క్రితంకోజే టౌన్‌నుంచి వచ్చాడు విజయ్.

యిప్పుడు విజయ్ ఎవరితోనూ ప్రత్యక్షంగా మాట్లాడ్డంలేదు. అన్నిటికీ సెక్రటరీ అడ్డంగా వున్నాడు. ఆ హోదాలో తన అధికారాన్ని, దర్పాన్ని పారేస్తు కుంటున్నాడు శేషగిరి.

అతని ప్రవర్తన ధర్మయ్యకి కూడా నచ్చలేదు. ఆ మాట విజయ్‌కే ప్రత్యక్షంగా చెప్పి విఫలుడయ్యాడు.

పనివాళ్ళంతా శేషగిరిమీద కోపాన్ని పెంచుకున్నారు అవసరమైతే అతని మీద చేయిచేసుకొనేందుకు సిద్ధంగా వున్నారు.

ఓ రోజు తన దర్పాన్ని తగ్గించకుండా నిటారుగా నడిచివస్తున్న శేషగిరి కేసి కొమ్ము విసిరింది ప్రక్కనే గాటికి కట్టివున్న సీమఆవు

అది జంతువు అలా విసరడం దాని నైజం

మనిషిగా ఆ విషయాన్ని అర్థంచేసుకోలేకపోయాడు శేషగిరి తన హోదాని కించపరిచినట్టు బాధపడిపోయాడు

వెంటనే ప్రక్కనేవున్న బడితకర్ర నందుకొని "అంబా"అని అరుస్తున్నా లెక్కచెయ్యకుండా చావమోదడం ఆరంభించాడు ఆవుని.

ఆ దెబ్బలకి తట్టుకోలేక గాటికేసి అటూ ఇటూ పరుగెత్తింది ఆవు. పలుపు తెంచుకోవాలని బలాన్నంతా వుపయోగించింది "అంబా"అంటూ హృదయ విదారకంగా అరుస్తూ కన్నీరు పెట్టుకుంది.

కానీ మనిషిగా శేషగిరి హృదయం కరగలేదు.

తన చేయి నొప్పివుట్టేవరకు బాదడం ఆపలేదు.

దూరంగా నిల్చొని చూస్తున్న యీగపాలేరు కన్నయ్య ఓర్చుకోలేక పోయాడు.

జంతువులతో వాళ్ళకే సత్సంబంధాలుంటాయి.

జంతువు భాష పాలేరు కర్థమవుతుంది. పాలేరు చప్పుళ్ళకి జంతువులు మాలిమవుతాయి.

అంతటి విచక్షణాజ్ఞానం శేషగిరికి లేదు.

మళ్ళీ బాదేందుకు శేషగిరి ఎత్తిన కర్రని పైనే పట్టుకొన్నాడు కన్నయ్య.

అవమానంతో దహించుకుపోయాడు శేషగిరి. పాలేరుని భస్మం చేసే ట్టు చూచూశాడు.

కానీ కన్నయ్య అతని చూపుల్ని లెక్కచెయ్యలేదు. శేషగిరి చేతిలోని కర్రని సునాయాసంగా లాక్కొని దూరంగా విసిరికొట్టాడు

శేషగిరి కోపంతో భగభగ మండిపోయాడు

వెనువెంటనే శేషగిరి చాచిన చేయి కన్నయ్య చెంపను చెళ్ళుమనిపించింది.

దిమ్మదిరిగినట్టయింది కన్నయ్యకి.

మామూలుగా అతనికి కోపం రాదు కానీ యిప్పుడొచ్చింది. — అలాంటిలాంటిది కాదు నిలువునా మనిషిని చీల్చేటంతటి కోపం

శేషగిరి వణికిపోయాడు.

కానీ అతన్ని వదిలిపెట్టలేదు కన్నయ్య. జుట్టుపట్టి వంగతీశాడు. వీపు మీద 'దబదబా' బాదాడు.

క్షణంలో కుప్పకూలిపోయాడు శేషగిరి.

ఓ అరగంట తర్వాత కన్నయ్య విజయ్‌ముందు చేర్చబడ్డాడు. విజయ్ కళ్ళు అగ్నిగోళాలయ్యాయి. అతని మనస్సు చెల్లాచెదరయింది.

మూగ కన్నయ్య తన భాషలో ఎంత చెప్పినా వినిపించుకోలేదు విజయ్.

కన్నయ్య వొంటిమీద దెబ్బలు కావు తూట్లే పడ్డాయి. విజయ్ చేతిలో అతని వళ్ళంతా హూనమైపోయింది.

పనివాళ్ళందరి కళ్ళు చెమ్మగిల్లాయి. కన్నయ్యకేసి సానుభూతిగా చూడటం తప్ప ఏమీ చేయలేకపోయారు

కన్నయ్య హృదయం అవిసేలా ఏడ్చాడు

ఎదురు మాట్లాడేందుకు నోరులేదతనికి

తిరిగి కొట్టడానికి చేయి లేవలేదు

కారణం .

విజయ్‌ని తన చేతులమీద ఎత్తుకొని పెంచాడు. తన చేతులతో గోరుముద్దలు తినిపించాడు విజయ్ చేతుల్ని గోముగా ముద్దెట్టుకొనేవాడు.

అవే అ చేతులే పెద్దవై కన్నయ్యని కొట్టాయి.

మనస్సు చలించిపోయింది కన్నయ్యకి.

అందరి సానుభూతికి తట్టుకోలేకపోయాడు.

కళ్ళతోనే వీడ్కోలుచెప్పి బయట గేటుకేసి నడిచాడు.

చిన్ననాటినుండి ఎరిగిన యిల్లు వదలి వెళ్ళాలంటే బాధగానే వుంది. కానీ, తప్పదు

భారంగా అడుగులు వేసుకొంటూ గేటు దాటాడు కన్నయ్య.

## 20

"డాక్టర్ దామోదర్, పిహెచ్.డి (సైకాలజిస్టు)"—

అన్న బోర్డు తగిలించిన యింటిముందు కారాపాడు రాఘవ. లాక్‌చేసి కీ చేతిలోకి తీసుకొంటూ డోర్ తెరుచుకొని బయటికొచ్చాడు.

యింటి తలుపులు మూసుకొనివున్నాయి.

స్విచ్ నొక్కగానే కాలింగ్‌బెల్ "గణగణ" మంది.

మరునిమిషంలో తలుపు తెరుచుకోవడమూ, డా. దామోదర్ చిరునవ్వుతో రాఘవని ఆహ్వానించడమూ చకచకా జరిగిపోయింది

డాక్టర్ దామోదర్ రాఘవకన్నా వయస్సులో ఎంతో పెద్దవాడు. కానీ వాళ్ళిద్దరిమధ్య స్నేహం విచిత్రమనిపిస్తుంది ఎవరికైనా.

డబ్బు హోదా సంఘంలో మనిషి పరపతిని పెంచుతుందనడం నిర్వివాదాంశం

అలాగే జరిగింది వాళ్ళ స్నేహం

యిద్దరూ లైన్స్‌క్లబ్ మెంబర్లు. తరచు క్లబ్ కార్యక్రమాల్లో తిరుగుతూ , ఒకరిమధ్య ఒకరికి స్నేహం పెరిగి బలపడిపోయింది.

"ఏవిటి సంగతి చాలా వుదయాన్నే వూడిపడ్డావ్?" అన్నాడు డా. దామోదర్ ఛలోక్తిగా.

"మీ కారు రిపేరు పూర్తయింది. నేనే తీసుకొచ్చాను" అంటూ తాళాలు అందించాడు రాఘవ.

"అరె భలేవాడివోయ్ రాఘవా! రిపేరు పూర్తయితే మాత్రం కారు మవ్వే స్వయంగా తెచ్చియివ్వాలా? ఫోన్ చేస్తే మా డ్రైవర్ని పంపించనూ కొంపతీసి అందరికీ ఇలాగే స్వయంగా అందజేసి మరిన్ని ఆర్డర్లు కొట్టేస్తున్నావేమిటి?"— ఫక్కున నవ్వాడు దామోదర్.




అతని నవ్వులో నవ్వు కలపలేకపోయాడు రాఘవ.

అతని మనస్సులో లక్ష్మి నిల్చొని వుంది. 'నా భర్తనుండి నన్ను అనాడు వద్దనేకొలదీ వేరుచేశావ్. యిప్పుడు నన్నేం చేస్తావ్.' అని అడుగుతోంది.

అంత విట్టుకి కనీసం చిరునవ్వయినా విసరని రాఘవని చూస్తూ విస్తుపోయాడు డా. దామోదర్.

పనిపిల్ల అందించిన కాఫీని యిష్టమయ్యీ, అవక సిప్‌చేస్తున్నాడు రాఘవ.

రాఘవ వునికి దామోదర్‌కి సుతారమూ నచ్చలేదు.

"రాఘవా! వాట్ ? వాట్ హాపెండ్ టుడే! ఏమిటి యివాళేదో నింత ధోరణిలో కన్పిస్తున్నావే మనస్సేమీ బాగాలేదా?" అంటూ ప్రశ్నించాడు దామోదర్.

అతని ప్రశ్నకి ఉలిక్కిపడ్డాడు రాఘవ.

లక్ష్మి కథ దామోదర్‌కి చెప్పి అతని సలహా తీసుకోవాలనే వచ్చాడు రాఘవ. ఎలా మొదలెట్టాలో అర్థంగాక ఆలోచిస్తున్నాడు.

"ఏమిటి రాఘవా! అలా అయిపోయావ్?" మళ్ళీ ప్రశ్నించాడు దామోదర్.

"ఏంలేదుసార్ మీతో మాట్లాడుదామనే వచ్చాను"అన్నాడు సంశయిస్తూ.

"ఏమిటది ?"

"మా చెల్లాయి దీనస్థితిని గూర్చి మీకు చెప్పాలని వచ్చాను. అందుకు సలహా నా కవసరం " అన్నాడు రాఘవ

"అయితే చెప్పు " అంటూ ముందుకు వంగి ఆతృతని వ్యక్తపరిచాడు డా. దామోదర్.

రాఘవ చెప్పడం మొదలెట్టాడు. పెళ్ళయిందగ్గర్నించీ మొదలెట్టి లక్ష్మిని తాను తీసుకొచ్చేసినంత వరకు చెప్పాడు ఆనాటి నుండి లక్ష్మి ఎలా అవేద

నకు గురవుతుందో . ఎలా మారిపోయిందో చెప్పాడు విజయ్ మొదటిభార్య శ్యామల ఆమె జ్ఞాపకాలు అతన్ని ఎంత బలహీనపరుస్తున్నాయో దానికి లక్ష్మి జీవితం ఎలా బలవుతుందో విశదపరిచాడు.

దామోదర్ మధ్యమధ్యలో ప్రశ్నలు వేశాడు అవసరమయిన పాయింట్లు పుస్తకంలో నోట్ చేసుకున్నాడు.

దామోదర్ అనుభవంలో ఇలాంటి కథలు చాలా ఉన్నాయి ఎన్నో విడిపోయిన కుటుంబాల్ని తన వృత్తిరీత్యా చాకచక్యంతో కలపగలిగాడు.

లక్ష్మి కథ అతని మనస్సులో నాటుకుపోయింది.

"ఓకే రాఘవా! నా శాయశక్తులా ప్రయత్నించి నీ చెల్లాయి జీవితం చక్కబరుస్తాను. కానీ మీరు ఆమె విషయంలో చాలా జాగ్రత్తగా నడుచుకోవాలి" అన్నాడు డా దామోదర్.

"చెప్పండి డాక్టర్" ఆతృతపడ్డాడు రాఘవ.

"మరేంలేదు. ఆమె మనస్సు చాలా సున్నితంగా వుంటుంది. చిన్న అపనిందయినా ఆమె చెవిన పడనీకూడదు ఆమె నెటువంటి మానసిక క్షోభకి గురి కాకుండా చూడాలి అంతేకాదు భర్త జ్ఞాపకాలకి దూరంగా వుండేందుకు మరే వ్యాపకాన్నయినా కలిగిస్తే మంచిది. అలా చేయకపోతే అనవసరమైన ఆటుపోట్లకు ఆమె మనస్సు తట్టుకోలేదు. పిచ్చిదిగా మారే ప్రమాదాన్ని కూడా కొనితెచ్చుకొన్నట్టవుతుంది" అన్నాడు దామోదర్.

భయపడ్డాడు రాఘవ

రాఘవ ప్రాణాలన్నీ లక్ష్మిమీదే.

అలాంటి లక్ష్మి పిచ్చిదైతే

తలపుకే వెరపనిపించింది రాఘవకి.

"అలాగే డాక్టర్ తప్పకుండా ప్రయత్నిస్తాను " అన్నాడు దామోదర్ కేసి చూస్తూ

"నోనో ప్రయత్నం కాదు నేను చెప్పినట్టు అక్షరాలా జరిగి తీరాలి. లేకపోతే ప్రమాదం జరగొచ్చు " హెచ్చరించాడు డా. దామోదర్.

## 51

కన్నయ్యని కొట్టిన విజయ్ అన్యమనస్కుడై అక్కడ వుండలేక పోయాడు.



ఆవేశంతో కొట్టాడెగాని అతని మనసంతా కలతచెందింది. అజ్ఞాపకాలు అతన్ని వేధించాయి. అందుకే పారిపోయినట్టు హైదరాబాదు చేరుకొన్నాడు.

సర్వకాల సర్వావస్థల్లో యజమానిని వదిలిపెట్టడంలేదు శేషగిరి. అతని వెన్నంటే వెళ్తున్నాడు. అక్కడ అందుబాటులోనున్న లగ్జరీసన్నిటికీ విజయ్‌ని బానిసను చేసి తన పబ్బం గడుపుకొంటున్నాడు.

ఖరీదైన విస్కీబాటిల్సు రూమ్‌నిండా పేరుకున్నాయి. తెచ్చిన డబ్బు సగం రేసులకి తగలేశాడు. కొద్దిరోజులకే జేబులో బ్యాలెన్స్ నిల్ అయింది.

ధర్మయ్యకి ఓ టెలిగ్రాం పదేశాడు విజయ్.

అందులో పొందుపరిచిన వాక్యం ఒక్కటే —

"సెండ్ టెన్ తౌజెండ్స్ ఇమీడియట్లీ"

టెలిగ్రాం అందుకొని నిశ్చేష్టుడయ్యాడు ధర్మయ్య.

విజయ్ అడ్రెస్ టెలిగ్రాంలో కనిపించింది. వెంటనే వెళ్ళి రాఘవని కలిశాడు

యిద్దరూ చర్చించుకొని ఆ టెలిగ్రాంని డాక్టర్ దామోదర్ ముందుంచారు.

ఓ నిర్ణయానికొచ్చాడు దామోదర్.

వాళ్ళిద్దరికీ ధైర్యం చెప్పి పదివేల క్యాష్‌తో హైదరాబాదు ప్రయాణ మయ్యాడు.

విజయ్-శేషగిరిలు బసచేసిన హోటల్ మేనేజర్‌తో అతి చనువు ఏర్ప రుచుకున్నాడు శేషగిరి. అప్పుడప్పుడూ తన గదికి పిల్చి ఖరీదయిన పార్టీల్లో అతనికీ భాగం పంచుతున్నాడు. స్కాచ్ విస్కీ తేరగా మరిగిన హోటల్ మేనేజర్ శేషగిరివెంట కుక్కలా తిరగడం అలవాటు చేసుకున్నాడు.

విజయ్ బెడ్‌ని కరుచుకొనే పడుకొని వుండిపోయాడు. కారణం క్రితం రాత్రి పార్టీలో ఎక్కువగా మందు పుచ్చుకున్నాడు. మైకం పూర్తిగా వదల్లే దతన్ని.

బయట వెళుతున్న శేషగిరిని "ఎక్కడికో ?" అంటూ పళ్ళన్నీ బయట పెట్టి నవ్వాడు మేనేజర్.

"అర్జంటుగా విజయవాడ వెళుతున్నాను. బహుశా రాత్రికి రానేమో" అని సమాధానమిచ్చిన శేషగిరి జేబులో చేయివేసి క్యాష్‌తీసి కౌంటర్‌మీద పెట్టాడు.

మేనేజర్ కళ్ళు వెలిగిపోయాయి

"బిల్ గదికి పంపించండి" అనిచెప్పి అతని సమాధానానికి వేచి చూడ కుండా బయటికి వెళ్ళిపోయాడు శేషగిరి.

చకచకా డబ్బు లెక్కపెట్టి బెల్ నొక్కాడు మేనేజర్. "దీన్ని విజయ్ గారి గదిలో అందజెయ్" అని ఆదేశించాడు అక్కడ ప్రత్యక్షమయిన వెయిటర్‌కి.

విజయ్ గదిముందు నిల్చుని "టకటక" శబ్దంచేశాడు వెయిటర్.

తలుపు తెరుచుకోలేదు. కానీ విజయ్ కంఠం నీరసంగా "ఎవరూ? రండి " అని వినిపించింది. తలుపు తెరుచుకొని లోనికడుగు పెట్టాడు వెయిటర్.

విజయ్ అస్తవ్యస్తంగా పడుకొనివున్నాడు. అతని కనురెప్పలు మైకంతో మూతపడుతున్నాయి.

"బిల్ సార్" అన్నాడు వెయిటర్.

"అక్కడ పెట్టి వెళ్ళు" అన్నాడేగాని వెయిటర్ కేసి చూడనుకూడా చూడ లేదు విజయ్

దాన్నెక్కడ పెట్టాలోనని ఆలోచించాడు వెయిటర్. కోటు స్టాండ్ కి విజయ్ షర్ట్ వ్రేలాడుతోంది. ఆ షర్ట్ జేబులో బిల్లునుంచి తలుపు దగ్గరికి లాగి వెళ్ళిపోయాడు వెయిటర్.

శేషగిరి మేనేజర్ తో చెప్పినట్టు విజయవాడ వెళ్ళలేదు ఎక్కడెక్కడో తిరిగి బాగా ప్రొద్దుపోయిన తర్వాత హోటల్లో అడుగుపెట్టాడు. హోటల్లో దాదాపు అందరూ నిద్రపోతున్నారు.

విజయ్ మళ్ళీ పుచ్చుకొని గాఢ నిద్రలోకి ఒరిగిపోయాడు ఎలికిడైనా లేచేస్థితిలో లేడు. గది తలుపుకూడా గడియ వేయలేదు దగ్గరికి తోసి చూసేవారికి గడియపెట్టినట్టుగానే అవిపిస్తోంది

గదికేసి నడుస్తున్న శేషగిరి బ్రేక్ పడినట్టు ఆగిపోయాడు

ప్రక్క గదిలోంచి ఆవేశపూరితమైన ఓ స్త్రీకంఠం అతని చెవులను తాకింది. కిటికీ గుండా లోపలికి తొంగిచూశాడు

ప్రక్కగదిలో బసచేసిన భార్యాభర్తలు గొడవపడుతున్నారు ఒకర్నొకరు కొట్టుకొంటున్నారు వాళ్ళ మాటలు వాళ్ళకే పరిమితమని వాళ్ళ నమ్మకం కానీ శేషగిరి అంతా విన్నాడు

వాళ్ళ మధ్య గొడవ పెద్దదైంది.

భర్త భార్యకి పడుకునే అవకాశమివ్వకుండా బెడ్ నంతా ఆక్రమించినట్టు అడ్డంగా పడుకొన్నాడు. భార్య మాత్రం తక్కువ తినలేదు అతని తలక్రింద దిండుని ఒచ్చిగా లాక్కొని అతనికేసి ఛీత్కారంగా చూస్తూ గది వెనుకభాగానికి వెళ్ళిపోయింది.

ఆమె అలా వెళ్ళిపోవడం చిలిపిగా అనిపించింది శేషగిరికి ఆమె ముఖం కోపంలో ఎంతో అందంగా కనిపించింది ఆమె కళ్ళల్లోని వెలుగు అతన్నెంతగానో ఆకర్షించింది

పొందికైన ఆమె అంగసౌష్టవం శేషగిరిని పిచ్చివాణ్ణి చేసింది

నిక్కి నిక్కి గదిలోపలికి చూసి నిరాశచెందాడు శేషగిరి

ఎంత ప్రయత్నించినా ఆమె జాడ అతనికి సుతరామూ కనిపించలేదు

ఆమె కనిపించకపోవడంతో నిరాశచెందడమే గాకుండా ఓ విధమైన ఆవేశంతో వూగిపోయాడు శేషగిరి అతని హృదయాన్ని మన్మధబాణం తొలుస్తోంది.

సిగరెట్ కోసం తన జేబులు తడుముకొన్నాడు కానీ సిగరెట్ ప్యాకెట్ ఖాళీగా కనిపించింది. కోపంగా దాన్ని దూరంగా విసిరాడు.

తమ గదికేసి నడిచి తలుపుమీద చేయివేయగానే తలుపులు బోర్లా తెరుచుకున్నాయి ఓ ప్రక్క బెడ్‌లాంప్ వెలుతురు తప్ప గదంతా చీకటిగా కనిపిస్తోంది.

తడముకొంటూ కోటు స్టాండువరకూ వెళ్ళాడు అలికిడి గాకుండా విజయ్ షర్ట్ జేబులో చేయి వేశాడు. సిగిరెట్ పెట్టె తగల్లేదు కానీ వెయిటర్ వుంచిన హోటల్ రసీదు మాత్రం చేతికొచ్చింది, తనలోతానే విసుక్కున్నాడు శేషగిరి

సిగిరెట్ లేకపోతే పిచ్చిపట్టినట్టయింది అతనికి ఆ గదిలో రెండో పడక అతనికోసమే అన్నట్టు ఎదురుచూస్తూ వుంది కానీ అదంతా పట్టలేదు శేషగిరికి

ఆమెను ఆ ప్రక్క గదిలో కనిపించిన ఆ యవ్వనవతిని తాను పొందాలి ఎలా? ఏం చెయ్యాలి?

యిదే ఆలోచన అతని మెదడ్ని తొలిచేయసాగింది

అన్యమనస్కంగా తమ గది వెనకభాగాని కొచ్చాడు. పిచ్చిగా అటు యిటు పచార్లు చేశాడ. రెండు గదులకు మధ్యలో కనిపించిన చిన్న కిటికీ అతనికి తళుక్కున ఆలోచనని రేకెత్తించింది.

స్టూలు సహాయంతో కిటికీ నందుకున్నాడు దాని చువ్వలు సన్నగా కనిపించినా దృఢంగా వున్నాయి ఆ సమయంలో ఆతనికి ఎద్దుబలం వచ్చింది. కిటికీచువ్వల్ని వూడపెరకటం ప్రారంభించాడు. మొదట కష్టమే అనిపించినా ఆఖరికి సాధించగలిగాడు.

అతనిలో సంతోషతరగం వువ్వెత్తుగా లేచింది.

అవతలి గదిలో ఆవిడ అస్తవ్యస్తంగా పడుకొనివుంది చీర ఓ ప్రక్కకి జారిపోయి ఆమె అంగాంగాలు ఆకర్షణీయంగా కనిపించాయి.

మత్తెక్కినట్టయింది శేషగిరికి. ఆలస్యానికి తావివ్వకుండా చువ్వలు వూడబెరికిన కిటికీగుండా అవతలి గదిలో అడుగుపెట్టాడు శేషగిరి

ఆమె బాగా అలిసి నిద్రపోతోంది.

ఆవిడ ఒంటిమీద చేయివేసి తడిమాడు శేషగిరి. దగ్గరికి లాక్కొని గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

భర్తనే తలపుతో కోపంగా దూరంగా విసిరికొట్టిందా వనిత.

అయినా వల్లేదు శేషగిరి. యీసారి గట్టిగా కౌగలించుకున్నాడు. అంగాంగాలు తడిమాడు.

ఆమెకి పూర్తిగా మత్తు జారిపోయింది

బ్రాందీ వాసన గుప్పున ఆమె ముక్కుపుటాలను తాకింది.

వెంటనే తనని గుర్తుపట్టకుండా జేబు రుమాలుతో ముఖాన్ని చుట్టేశాడు శేషగిరి.

శేషగిరిని చూసి వణికిపోతూ కెవ్వున కేక పెట్టిందావిడ

శేషగిరి బిత్తరపోయాడు.

కర్తవ్యం స్ఫురణకొచ్చి తన గదిలోనికి వెళ్ళేందుకు మళ్ళీ చువ్వలు పీకిన కిటికీలోకి తల దూర్చాడు. అప్పుడే అలికిడికి నిద్రలేచిన ఆమె భర్త శేషగిరి కాళ్ళు పట్టుకొని క్రిందికిడ్చాడు. దబ్బున క్రిందపడిపోయాడు శేషగిరి. శేషగిరిమీదపడి అందిన చోటల్లా గుద్దడం ప్రారంభించాడతను. యిద్దరూ పాముల్లా పెనుగులాడారు. ఆఖరికి రివటలా వున్న ఆమె భర్తను దూరంగా విసిరికొట్టాడు శేషగిరి. వాళ్ళిద్దరూ తనను గమనించకుండా వుండేట్టు మరింత గట్టిగా రుమాలుని ముఖానికి చుట్టుకొని, గది తలుపు తెరుచుకొని, వాళ్ళు తనను వెంబడించకుండా బయట గడియపెట్టి పారిపోయాడు.

శేషగిరి సరాసరి తన గది కెళ్ళలేదు.

ఆ హోటల్ కి విజయ్ కి అక్కడివారికందరికీ అందకుండా దూరంగా వెళ్ళిపోయాడు.

జరిగింది వాళ్ళ ముగ్గురికీ తప్ప ఆ హోటల్లో యింకెవరికీ తెలియదు.

## 22

తెల్లవారగానే వెయిటర్ కి అంతా వివరించారు భార్యాభర్తలు

హోటల్ మేనేజరు వచ్చి వాళ్ళని అంతా అడిగి తెలుసుకున్నాడు. గదంతా గాలిస్తే అతనికి 'హోటల్ రసీదు' దొరికింది.

దాన్ని క్రితంరోజు వెయిటర్ విజయ్ షర్ట్ జేబులో పెట్టాడు. సిగరెట్ కోసం విజయ్ షర్టుజేబు గాలించిన శేషగిరి చేతికొచ్చిందది. దాన్ని క్రింద పారెయ్యాలన్న ఆలోచన లేకపోయింది శేషగిరికి. దాన్ని తన జేబులో వేసు కొన్నాడు. ఆ తర్వాత యినుపచువ్వలు వూడబెరికి కిటికీగుండా అవతలి గదిలో కెళ్ళాడు పెనుగులాటలో అతని జేబులోని 'రసీదు' ఆ గదిలో పడిపోయింది.

ఆ 'రసీదు' వెనుక అంత కథ వుంది.

కానీ ఆ నిజం ఎవరికి తెలుసు?

జరిగింది ఎవరు చెప్పగలరు?—

ఫోన్ చేయగానే ఓ అర్ధగంటలో సబ్‌యినస్పెక్టర్ హోటల్‌కి చేరు కున్నాడు. ఆ గదినంతా గాలించి, విషయ సేకరణ చేశాడు.

బెల్ రింగవగానే తలుపు తెరిచాడు విజయ్.

ఎదురుగా మేనేజర్‌తోటి పోలీస్ ఇనస్పెక్టర్ని చూసి ఆశ్చర్యపోయాడు. ఆ గదిలో మరెవ్వరూ కనిపించలేదు యిన్‌స్పెక్టర్‌కి శేషగిరి విజయవాడ వెళ్ళి నట్టూ అతను ఆ రాత్రికి రానట్టూ హోటల్ మేనేజర్ వాఙ్మూలమిచ్చాడు. 'రసీదు' విజయ్ షర్ట్ జేబులోనే పెట్టినట్టు వెయిటర్ సాక్ష్యం వుండనేవుంది.

ఏ విధంగా ఆలోచించినా నేరం విజయ్‌ని బలపర్చక మానలేదు కిటికీ చువ్వ పీకి ప్రక్కగదిలోకి జొరబడడమేగాకుండా అందులో బసచేసిన ఓ ఆడ కూతుర్ని మానభంగం చేశాడన్న ఆరోపణతో విజయ్‌ని కస్టడీలోకి తీసుకొన్నాడు సబ్‌యిన్‌స్పెక్టర్.

మ్రాన్పడిపోయాడు విజయ్ ఆ హఠాత్పరిణామానికి అతనిలో చలనం రేగింది. కానీ తనేం చెయ్యగలడు? సాక్ష్యబలం అలా వుంది. తనకు ఆసరాకూడా అక్కడెవరూ లేరు. ఉన్న శేషగిరి ఎక్కడికెళ్ళిందీ అతనికి అంతుపట్టలేదు.

విధి చేతిలో కీలుబొమ్మయ్యాడు విజయ్.

సిమెంటురోడ్డుతప్ప మరే బాటా ఎరగని 'ప్లిమత్'కారు గతుకుల్లో పడ్డట్టయింది.

'ఒకరికి చెప్పడం కాదు నువ్వు అనుభవిస్తే తెలుస్తుంది'— ఆ సిద్ధాం తాన్ని జీర్ణించుకున్నాడు విజయ్.

విజయ్ హృదయాంతరాళంలో అలజడి బయలుదేరింది.

ఓసారి తన జీవితాన్నంతా తరచి చూచుకోకుండా వుండలేకపోయాడు. ఎక్కడా తనకి ఇలాంటి ఒడుదుడుకు కనిపించలేదు. యింతకాలానికి ఎదుర యింది. దాంతో సతమతమైపోయాడు విజయ్.




ఆ బాధలో

ఎప్పుడో 'లక్ష్మి' అనే అమ్మాయి అతని జీవితంలోకి అడుగు పెట్టినట్లు గుర్తుకురాక మానలేదు.

లక్ష్మి అంటే ఎవరు?

ఆమెకూ తనకి సంబంధమేమిటి?

భార్యా ?

లక్ష్మి తన భార్యా ?

అయితే తాను ఆమెను ఎందుకు ఆదరించలేదు.

భార్యగా ఎందుకు స్వీకరించలేదు ?

అంతా ప్రశ్నలమయం

అతని హృదయం దుఃఖంతో నిండిపోయింది.

ఓ ఆడకూతురికి తానేం చేశాడు? నమ్మి వచ్చినందుకు ఆదరించక పోగా ఆమె జీవితంతో ఆట్లాడుకున్నాడు. తనకి నిష్కృతి లేదు వుండ కూడదు అందుకే అందుకే తనకీ శిక్ష వేశాడు భగవంతుడు. కాదు ఆమే ఆమే నన్నిలా అవమానంపాలు కమ్మని శపించింది. ఆమె శాప కారణమే నాకీ శిక్ష

మనస్సులోనే ఏడ్చాడు విజయ్ అతనిలో దుఃఖం ఆగలేదు. దుఃఖ భారంతో అతని కళ్ళు మూసుకున్నాయి.

"సార్ మీకోసం ఎవరో వచ్చారు" అనగానే చివుక్కున కళ్ళు తెరి చాడు విజయ్ ఎదురుగా కానిస్టేబుల్ నిలబడి ఉన్నాడు.

ఎవరు ఎవరై వుంటారు ? తనకోసం వచ్చేవాళ్ళెవరు ?

విజయ్ మస్తిష్కం పనిచేయసాగింది

శేషగిరా ?

కాదు

ధర్మయ్యా ?

ఆలోచిస్తున్న విజయ్ కెదురుగా డాక్టర్ దామోదర్ వచ్చి నిల్చున్నాడు.

ఎవరతను ?

విజయ్ మనస్సు కందలేదు

"విజయ్ !"

కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూశాడు విజయ్.

"నేను నీ వాడినే విజయ్ నీ బావమరది రాఘవ పంపగా నీకోసమే వచ్చాను నువ్విచ్చిన అడ్రస్‌కొస్తే నువ్విక్కడున్నావని తెలిసింది. "

"నో నోనో మీరు విన్నదంతా అబద్ధం నేనాపని చేయలేదు. . నేనాపని చేయలేదు" ఆవమానంతో గింజుకున్నాడు విజయ్

విజయ్‌మీద సానుభూతి కలిగింది డాక్టర్ దామోదర్‌కి.

"బాధపడకు విజయ్ వాళ్ళు చెప్పింది నేను నమ్మలేదు. ఆ నేరం నువ్వు చేసుండవనే అనుకున్నాను అదంతా తర్వాత మాట్లాడుకుందాం విజయ్.. అన్నిటికన్నా నే నెవరో ముందు నీవు తెలుసుకోవాలి "

ఆతృతగా చూశాడు విజయ్.

"నా పేరు డాక్టర్ దామోదర్ నేను రాఘవ అంతరంగిక మిత్రుణ్ణి నిన్ను వెంటబెట్టుకొని రమ్మని ధర్మయ్యా, రాఘవా యిద్దరూ కలిసి నన్ను

నీ దగ్గరికి పంపించారు   లక్ష్మి నీకోసమే వెయ్యికళ్ళతో ఎదురుచూస్తూవుంది. నీ కలవరింతలతో పిచ్చిదై పోతోంది. లక్ష్మికోసం నీవు నాతో రావాలి బాబూ. ."

అప్యాయత నిండిన స్వరంతో అన్నాడు డాక్టర్ దామోదర్.

మంత్రముగ్ధునిలా అతనికేసి చూశాడు విజయ్.

వెంటనే అతనికి కర్తవ్యం స్ఫురణకొచ్చింది  విజయ్ కనుగొనుకుల్లో నీళ్లునిండాయి.

డాక్టర్ దామోదర్ అసరాతో బెయిల్‌మీద విడుదలయ్యాడు విజయ్

## 23

'సుపీతా ఆటోమొబైల్' కూర్చోవున్న రాజశేఖరం యిచ్చిన టెలి గ్రామ్‌ని అందుకున్నాడ. రాఘవ వ్యాపార నిమిత్తం బయటవూరు వెళ్ళాడు

టెలిగ్రామ్‌లో విజయ్ - డాక్టర్ దామోదర్ యిద్దరూ కలిసివస్తున్నట్టు వుంది.

రాజశేఖరం ఆనందానికి అవధులు లేవు.

దాన్ని మనస్సులో దాచుకోలేక లక్ష్మికి చెప్పేందుకు రిక్షా ఎక్కాడు. యింటి ముంగిటలోనే రిక్షా దిగి అతృతను చంపుకోలేక "అక్కయ్యా- అక్కయ్యా" అంటూ యింట్లో అడుగుపెట్టాడు రాజశేఖరం

అతని ఆతృతకి లక్ష్మి బయటకొచ్చింది.

జేబులోంచి టెలిగ్రామ్ తీసి "యిదెక్కడిదో చెప్పుకో" అంటూ వూరికించాడు శేఖర్.

"ఎక్కడిది ?" అంది లక్ష్మి

ఆవిడకు డాక్టర్ దామోదర్ విజయ్ హైదరాబాదు వెళ్ళారని తెలుసు. కానీ ఎలాంటి వార్త వస్తుందోనని సందిగ్ధంగా వుండిపోయింది.

"అమ్మా  అంత తొందరగా చెపుతానేమిటి  యిది హైదరాబాదు నుంచే వచ్చింది. యిందులో ఏముందో చెప్పుకో ?"

ఆమె కళ్ళు ఆనందంతో మెరిశాయి. అతృతను చంపుకోలేక శేఖర్ దగ్గరినుంచి టెలిగ్రామ్ లాక్కోబోయింది. కానీ ఆమె కందనీయలేదు శేఖర్ లక్ష్మిని ఆ వరండా అంతా అటుయిటూ తిప్పుతున్నాడు. టెలిగ్రామ్‌ని చేతులు మారుస్తూ.

అందులో సంతోషవార్త లేకపోతే 'రాజా' మటుకు ఎందుకాతృత పరుస్తాడు—

లక్ష్మి పిచ్చిదై పోయింది. "రాజా రాజా అందులో ఏముందో చెప్పవూ మా రాజావుకదూ! చెప్పమ్మా " గోముగా అడుగుతూ అతని వెనకాలే టెలిగ్రామ్ కోసం పరిగెడుతోంది

ఆ దృశ్యాన్ని మరో నాలుగు కళ్ళు ప్రక్క మిద్దెమీదినుండి చూసి ఓర్చుకోలేకపోతున్నాయి.

అదేమీ గమనించే స్థితిలో లేరు యిద్దరూ.

"యీ రాజాకి రాణీయా యీవిడ ?"—ప్రశ్న.

"కాదు కాదు యీ రాణీకే రాజా అతను".

చివుక్కున తలలెత్తి పైకి చూశారు యిద్దరూ.

ప్రక్కింటి డాబాపై ఆ యింటి సరస్వతి ఎదురింటి పార్వతి వాళ్ళకేసి గుచ్చిగుచ్చి చూస్తున్నారు. వాళ్ళ కళ్ళలో వెకిలితనం ద్యోతక మవుతోంది.

అవమాన భారంతో లక్ష్మి తల వంగిపోయింది.

ఆ అపనింద లక్ష్మికి గోరుచుట్టుపై రోకటి పోటులా అయింది.

రాజశేఖరం దవడలు కోపంతో బిగుసుకున్నాయి.

లక్ష్మిలో మునుపున్న పుత్సాహం ఎగిరిపోయింది. దాని స్థానే జవ సత్వాలన్నీ వుడిగిపోయినట్టు నీరసం బయలుదేరింది.

ఒకరికేసి ఒకరు చూసుకోలేకపోయారు లక్ష్మి-రాజశేఖరాలు.

వాతావరణం స్తబ్దుగా మారిపోయింది

అంతటితో వూరుకోలేదా మణులు—

"ఓహో! ఎంత నంగనాచులే "

"అవునే మన కంటపడ్డారుగా "

ముక్కు మీద వేళ్ళేసుకొంటూ ఫక్కుమని మళ్ళీ నవ్వారు ఆడంగు లిద్దరూ.

పళ్ళు పటపటా కొరికాడు శేఖర్.

మళ్ళీ ఎలాంటి అపనింద వినాల్సి వస్తుందోనని భయపడిపోయింది లక్ష్మి. వుప్పెనలా ఆమె కంటవెంట నీరు పొంగింది. కట్ట త్రెంచుకొన్న వరదలా చెంపలమీదికి ప్రాకాయి

స్వచ్ఛమైన పాలలాంటి ఆమె మనస్సు విరిగిపోయింది.

యింకా అక్కడుండేందుకు ఆమెకి మనసొప్పలేదు విసురుగా లోనికెళ్ళి ....దబ్బున తలుపు మూసుకుంది లక్ష్మి

ఆ హఠాత్పరిణామానికి భ్రమాన్పడిపోయాడు శేఖర్.

ఏ పాపమూ ఎరుగని లక్ష్మిని అంతంత మాటలన్నందుకు పైవాళ్ళపై వుడికిపోయాడు

తనకే శక్తివుంటే ఒక్క మంత్రంతో వాళ్ళని భస్మం చెయ్యా లన్నంత కోపమొచ్చింది.

మళ్ళీ పైనుండి వెకిలినవ్వులు

వాళ్ళకేసి తీక్షణంగా చూశాడు శేఖర్.

కానీ వాళ్ళ నవ్వులాగలేదు

ఒక్కుదుటున పైకెగిరి యిద్దరి గొంతుకలూ పిసికి చంపెయ్యాలని పించిందతనికి.

"సిగ్గులేదూ! మీరు ఆడవాళ్ళేనా ? తోటి ఆడకూతురి జీవితంతో ఆట్లాడుకోవడం మీ జాతికే అవమానంగా లేదూ ? మీకూ అన్నా-తమ్ముళ్లు వుంటారే వాళ్ళతో మీకుండే సంబంధం అదేనా ? మాట్లాడరేం ? పరాయి ఆడకూతుర్ని విమర్శించే హక్కు మీకెవరిచ్చారు ? ఛీఛీ వెళ్ళండి నేను రెచ్చిపోకమునుపే నా కళ్ళముందునుంచి వెళ్ళిపోండి" కచ్చిగా అరిచాడు రాజ శేఖరం.

అతని అవతారం చూసి భయపడి అక్కణ్నుంచి తప్పుకున్నారు పై ఆడింగులిద్దరూ.

శేఖరాన్ని అవమానం దహించివేసింది మళ్ళీ లక్ష్మికి తన ముఖం చూపించేందుకు సిగ్గుపడిపోయాడు

అక్కడ నిలబడలేక భారంగా అడుగులేసుకొంటూ తన గదిని చేరుకు న్నాడు శేఖర్

## 24

బాగా ప్రొద్దుపోయి యింటికి తిరిగివచ్చాడు రాఘవ.

లక్ష్మి వదనం అప్రసన్నంగా కనిపించింది.

అప్పుడప్పుడూ అది మామూలే

అందుకే ఆమెను కదపలేదు రాఘవ.

అర్థరాత్రి దాటింది అలసి నిద్రపోతున్నాడు రాఘవ కాలింగ్‌బెల్ "గర్ర్" మనడంతో అతనికి నిద్రాభంగమయింది కళ్ళు నులుముకొంటూ లేచి వెళ్ళి తలుపు తెరిచాడు.

ఆశ్చర్యం

ఎదురుగా డాక్టర్ దామోదర్ తోపే విజయ్

అతని హృదయం పులకించినట్లయింది.

అతిధులిద్దర్నీ హాల్లో కూర్చోబెట్టి చకచకా మిద్దె మెట్లెక్కాడు రాఘవ

"లక్ష్మి లక్షీ" తలుపు తట్టాడు.

దగ్గరగా వేసిన తలుపు అతని చేతిభారానికే తెరుచుకుంది.

అనుమానంగా గదిలో అడుగు పెట్టి స్విచ్ ఆన్‌చేశాడు. లైటుకాంతి గది నంతా పరుచుకుంది.

రాఘవ గతుక్కుమన్నాడు.

బెడ్‌మీద లక్ష్మి లేదు కళ్యాణి ఓ ప్రక్కకి ఒదిగి పడుకొనివుంది. కీడు శంకిస్తూ గదినంతా గాలించాడు

పైన సీలింగ్‌ఫ్యాన్ గరగరమని శబ్దంచేస్తోంది. దాని గాలికి నేనాగలే నంటోంది బల్లమీద కనిపించిన తెల్లని కాగితం.

ఆత్రుతగా దాన్నందుకొని విప్పాడు రాఘవ అతని చేతులొణకుతున్నాయి

"అన్నయ్యా—

యిన్నాళ్ళు సాహసించలేని లక్ష్మి యీనాడిలా చేసిందని ఆశ్చర్య పోతున్నావు కదూ!

నిజం అన్నయ్యా! యిక యీ జీవితంతో నేను రాజీపడలేను. ఏనాటి కానాడు నా జీవితం చక్కబడుతుందని ఎదురుచూసి నిరాశ చెందాను. యిక నాకు అలాంటి ఆశ కనిపించడంలేదు అంతేకాదు భర్తకు దూరమైన నేను ఈ సంఘానికి సమాధానమివ్వడంలో విఫలురాలునయ్యాను అందుకే ఈ లోకా న్నుండి శెలవు తీసుకుంటున్నాను.

ఆఖరిగా నిన్ను నేను కోరేదొక్కటే

సునీత నిన్ను మనసారా ప్రేమించింది ఆ అమ్మాయికి అన్యాయం చేయకు. పెళ్ళిచేసుకొని నీ హృదయంలో ఆ అమ్మాయికి సుస్థిరస్థానాన్ని కల్పించు

అంతకన్నా నేను కోరేదేమీలేదు

వస్తా

ఇట్లు

"లక్ష్మి"




రాఘవ కళ్ళు అశ్రుశిక్తాలయ్యాయి

కన్నీటి పరంపర ఆ వుత్తరంలోని అక్షరాలను అక్కడక్కడా చెరిపేసింది.

నాలుగంగల్లో క్రిందికి దిగాడు రాఘవ

అతను దిగడం చూసి అతిథులిద్దరూ విస్తుపోయారు.

గ్యారేజ్ నుండి కారుతీసి యిద్దర్నీ ఎక్కమన్నాడు రాఘవ

ముగ్గురూ కూర్చున్న కారు దూసుకుపోయింది.

రాజశేఖరం గదిలో పడుకున్నాడేగాని నిద్రపట్టలేదు ఆలోచనా పరంపర అతన్ని దహించివేస్తోంది.

కారు హారన్ విని బయటకొచ్చాడు శేఖర్.

కార్లో కూర్చొనివున్న ముగ్గుర్నీ చూసి హడలిపోయాడు.

ఇంత జరిగినా టెలిగ్రామ్‌లోని వార్త లక్ష్మి చెవిలో వేయలేకపోయి నందుకు ఖిన్నుడవుతూ తలవంచేశాడు శేఖర్

"వాళ్ళకేం సమాధానం చెప్పాలి!"—

అతని తల తిరిగిపోయినట్టయింది.

కారు దిగిన రాఘవ శేఖర్ గదికేసి అడుగులు వేశాడు. గది మెట్లుదిగి శేఖర్ కూడ తొందరగా నడిచి మధ్యలోనే రాఘవని చేరుకున్నాడు. యిద్దరూ చాలాసేపు మాట్లాడుకొన్నారు. జరిగింది ఒకరికొకరు చెప్పుకున్నారు.

లక్ష్మి వెళ్ళిపోయిందని తెలుసుకొని భయపడ్డాడు శేఖర్.

శేఖర్ చెప్పింది విని రాఘవ ముఖం పాలిపోయింది. బాధపడుతున్న శేఖర్ని ఓదార్చడం తప్ప ఏమి చేయలేకపోయాడు.

నలుగరూ కూర్చొన్న కారు రివర్స్ తీసుకుంది. అఘమేఘాల మీద ముందుకు దూసుకుపోయింది. సందు సందూ తిరిగింది గొంది మలుపులు తిరిగింది బావులు గాలించింది బస్టాండ్కి వెళ్ళింది రైల్వేస్టేషన్ చూసింది అలా అలా అనుమానం వచ్చిందగ్గరకల్లా వెళ్ళింది

కానీ ప్రయోజనం శూన్యం.

విజయ్కి లక్ష్మిమీద కోపమొచ్చింది.

'యింతకాలం తాను మూర్ఖుడిగా ప్రవర్తించాడు యిప్పుడు లక్ష్మి ఛీఛీ ఏమిటిది ? ఎందుకిలా అయింది ?'

నుదురు కొట్టుకున్నాడు విజయ్.

డాక్టర్ దామోదర్ విభ్రాంతి చెందాడు.

విజయ్ తన చేతికందివచ్చాడు సమస్య అతి చేరువలో కొచ్చిందని ఎంతో సంతోషించాడు. కానీ ఏమయింది సమస్య మళ్ళీ మొదటికొచ్చినట్టయింది.

సందిగ్ధంలో పడిపోయాడు దామోదర్.

## 25

అమావాస్య చీకటి

ఆకాశంలో చుక్కలు బారులు తీరాయి.

నిశాచరుడు చక్కగా రాజ్యమేలుతున్నాడు.

కన్ను పొడుచుకున్నా కనిపించని కటికచీకటి

భయపడలేదు లక్ష్మి.

నిశరాత్రిలో ఒంటరిగా బయలుదేరింది.

గమ్యమేదో ఆమెకే సరిగా తెలియదు

నడుస్తుందనేగాని ఆమెకి స్థిమితం లేదు శరీరం తూలుతోంది.

ఒళ్ళంతా తిమ్మెర్లు నరాల బలహీనత కళ్ళ ముందు చీకట్లు

సగం మైకం సగం మెలుకువగా నడుస్తోంది లక్ష్మి.

నడిచింది నడిచింది నిర్మానుష్యంగా వున్నచోటుకి నడిచింది.

ఆ పరిసరం ప్రశాంతంగా వుంది.

అది నిటికెరటాలతో నిర్మలంగా ప్రవహించే ఏరు
అక్కడ కీచురాళ్ళ శబ్దాలు తప్ప మరే శబ్దమూ వినిపించలేదు
గట్టుమీద నిల్చుంది లక్ష్మి
నీరు ఒరవడిగా పారుతోంది.
దాని లోతెంతో తెలియదు లక్ష్మికి.
అసలు దానిలోతుతో పనిలేదు
ఎంత లోతైనా తను మునిగిపోయే లోతు
ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయేందుకు సరిపడే లోతు
ఒక్కుదుటున నీటిలోకి దూకింది___

కానీ ఆమె నీటిలో పడిపోలేదు ఆపాటికే ఓ అదృశ్యహస్తం ఆమె జబ్బపట్టుకొని ఇవతలికి లాగింది విసురుగా లాగడంతో లక్ష్మి తూలి కట్టమీద పడిపోయింది.

ఆ చీకట్లో ఆమెను లాగిందెవరో సరిగా కనిపించలేదు.

అతన్ని లెక్కచెయ్యకుండా మళ్ళీ ఏటికేసి పరుగెత్తబోయింది కానీ, అతనామెకా అవకాశ మివ్వలేదు చేయి గట్టిగా పట్టుకొని లైటుస్థంభం వరకూ లాక్కొచ్చాడు.

లైటు కాంతిలో ఒకరికొకరు స్పష్టంగా కనిపించారు
అతన్ని చూసి రెక్కలు తెగిన పక్షిలా నిలబడిపోయింది లక్ష్మి.

అతను ఎవరో కాదు విజయ్‌చేత కొట్టబడి ఆ యింటినుంచి వచ్చేసిన మూగ కన్నయ్య

లక్ష్మిని చూసి నివ్వెరపోయాడు కన్నయ్య ఒకనాటి తన యజమాని లక్ష్మి దుస్థితికి చింతించకుండా వుండలేకపోయాడు.

వారించినా లెక్కచెయ్యకుండా ఆమెను తన రిక్షా వరకూ నడిపించాడు కన్నయ్య

కన్నయ్య ప్రస్తుతం రిక్షా తొక్కుతున్నాడు.
రిక్షా ఎక్కమని సైగచేశాడు కన్నయ్య.
లక్ష్మి వినిపించుకోలేదు.

ఆత్మహత్య పాపమని తన భాషలో బోధించాడు, కన్నయ్య కానీ వినలేదు లక్ష్మి.

ఆఖరికి ఓర్పు నశించి పిచ్చిగా కేకలు పెట్టాడు.

ఆ రాత్రికాడ అతన్ని చూసి భయపడకుండా వుండలేకపోయింది.

లక్ష్మి అతను చూపించిన రిక్షాలో మారుమాట్లాకుండా కూర్చుంది.

## 26

రిక్షా కూలీల గుడిశలు నదిఒడ్డున బీదతనానికి ప్రతీకలుగా నిలబడి వున్నాయి.

అందులో ఓ చిన్న గుడిశలో కన్నయ్య తలదాచుకొంటున్నాడు. అతనితోటే వుండిపోయింది లక్ష్మి.

ఆమె పరిస్థితికి చింతించాడు కన్నయ్య. కూతురిలా ఆదరించకుండా వుండలేకపోయాడు.

కన్నయ్య మూగవాడే, కాని

మనసులేనివాడు కాదు.

లక్ష్మిని సంతోషపెట్టాలని శాయశక్తులా ప్రయత్నించసాగాడు.

ఆ వాతావరణానికి యిప్పుడిప్పుడే అలవాటుపడుతోన్న లక్ష్మి బిందెను చంకన పెట్టుకొని దూరంగా కనిపిస్తున్న మునిసిపల్ కుళాయికేసి నడుస్తోంది.

ఆ యిరుకు సందులో ఎదురుగా వస్తున్న రిక్షాని ఢీకొనబోయి పక్కకి తప్పుకుంది లక్ష్మి. సడన్ బ్రేక్ తొక్కిన రిక్షావాడు కుదుపులతో ఆగిపోయాడు.

ప్రమాదం త్రుటిలో తప్పింది.

లక్ష్మి కొళాయికేసి నడిచింది

ఆ రిక్షాలో శేషగిరి ప్రయాణం చేస్తున్నాడు. రిక్షాదిగి ఆమె వెళ్ళిన వేపే గుచ్చిగుచ్చి చూస్తూ "ఎవర్రా ఆ అమ్మాయి ?" అంటూ రిక్షావాణ్ణి ప్రశ్నించాడు.

"యీ పేటేనండి మా కన్నయ్యతాత కూతురు " సమాధానమిచ్చాడు చైను తగిలించుకొన్న రిక్షావాడు

మనస్సులోనే నవ్వుకున్నాడు శేషగిరి.

అతనికి తెలుసు.

ఆమె విజయ్ రెండో భార్య లక్ష్మి అని అతని నిరాదరణ మూలంగానే యిలా రోడ్డుపాలయిందని

విజయ్–లక్ష్మిల పెళ్ళిఫోటో విజయ్ యింట్లో చాలాసార్లు చూశాడు శేషగిరి

ఆ రాత్రి 'నైట్‌డ్యూటీ' యేశాడు కన్నయ్య.

ఆకాశం మెరుస్తోంది

వుంది వుండి  సన్నగా చినుకులు రాలుతున్నాయి

లక్ష్మి ఒక్కతే గుడిశలో పడుకొనివుంది.

శేషగిరి తడికె తోసుకొని లోపలికి రావడం లక్ష్మి గమనించలేదు. అతని నోట్లో ఎర్రగా మండుతోన్న సిగిరెట్ వెల్తురుచూసి తృళ్ళిపడి లేచింది లక్ష్మి.

ఎవరిదా ఆకారం  ?

ఎవరితను  ?

లక్ష్మి గుండె వణికింది. ముచ్చెమటలు పట్టాయి.

"ఎవరది  ?" అంది మేకపోతు గాంభీర్యంతో.

"యిష్  అరవకు  " అంటూ చేయి అడ్డంగా పెట్టాడు శేషగిరి.

వణికిపోయింది లక్ష్మి.

"నీకు కావలసినవాణ్ణి  భయపడకే చిలకా!  నువ్వెవరో నాకు తీణ్ణంగా తెలుసు  యిక్కడ నీపేరు కన్నయ్య కూతురు లక్ష్మి.. అది నిజంకాదని నాకు తెలుసు  "

నిలువునా కృంగిపోయింది లక్ష్మి.

"లక్ష్మి  ఐ లవ్ యూ  నిన్నెలాగూ ఆ విజయ్ ఆదరించడు  అతని భార్యగా స్వీకరించడు  అది నాకు తెలుసు మేడమ్—అందుకే అడుగుతున్నాను నాతో వచ్చెయ్  నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాను  ఓకే  " అంటూ లక్ష్మి కేసి అడుగులు వేశాడు శేషగిరి.

భీతహరిణిలా నిలబడిపోయింది లక్ష్మి

అత నెవరయిందీ ఆవిడ కనవసరం. అతన్నుంది తప్పించుకోవడం ఎలా!- అదే ప్రశ్నగా మారిందామెకు.

ఆమెను పట్టుకోవాలని శేషగిరి విసిరిన చేతికి అందకుండా పక్కకి తప్పకుంది లక్ష్మి.

శేషగిరి ముందుముందుకి అడుగులేస్తున్నాడు

వెనక్కి వెనక్కి నడుస్తోంది లక్ష్మి.

పాములాంటి శేషగిరి

పులిలాంటి శేషగిరి

లక్ష్మికేసి ఆశగా, కైపుగా చూస్తున్నాడు. అతని కళ్ళు కొవ్వొత్తుల్లా మండుతున్నాయి.

కాటు వెయ్యడానికి సిద్ధంగా

పంజా విప్పడానికి దూకుడుగా

అతన్ని చూసి నిలువెల్లా వణికిపోతోంది లక్ష్మి.

అరవాలన్నా నోరు పెగల్లేదు.

కాలుతున్న సిగరెట్ పీకను గుడిశమూలకిసిరాడు శేషగిరి. మరో సిగరెట్ తీసుకుని లైటర్‌తో వెలిగించుకున్నాడు.

ఆ లైటుకాంతికి ఎర్రగా కనిపిస్తున్న అతని కంటికొనలు చురకత్తుల్లా మెరిశాయి.

భయంతో గుండెను అరచేత పట్టుకుంది లక్ష్మి.

ఒక్కదుటన వంగి ఆమె చేతిని గుప్పిట్లో పట్టుకొని తనవేపుకి లాక్కున్నాడు శేషగిరి.

గద్దనోటికి చిక్కిన కోడిపిల్లలా గిజగిజలాడింది లక్ష్మి. అతని బాహుబంధాల్లోంచి తప్పించుకోవాలని రక్కింది కొరికింది గట్టిగా అరుస్తూ కేకలుపెట్టింది.

కానీ వదల్లేదు శేషగిరి.

అతని పెదాల్ని ఆమె అదరాలకి కలిపి చుంబించబోయాడు.

అదే అదనుకుంది లక్ష్మి. తన తలతో అతని గడ్డాని బలంగా ఒక్క మోదు మోదింది.

అంతే

దిమ్మదిరిగిపోయాడు శేషగిరి

ఆమెను వదిలేయడమేగాకుండా పట్టుతప్పి వూగిపోయాడు.

ప్రక్కనే కనిపించిన కత్తిపీట నందుకొని నిల్చుంది లక్ష్మి. ఆమె అవతారం అపరకాళిని మరిపిస్తోంది. చండిలా వూగిపోయింది.

"ఇంకొక్క క్షణం యిక్కడున్నావా నీ రక్తం కళ్ళజూస్తాను. వెళ్ళు వెళ్ళిపో—" అరిచింది లక్ష్మి.

భయపడిపోయాడు శేషగిరి।

ఆమె కేకలకి ప్రక్కల గుడిశలువాళ్ళు మేల్కొన్నారు.

వెళ్ళిపోయేందుకు వెనుతిరిగిన శేషగిరి తృటిలో వెనక్కి తిరిగి లక్ష్మి చేతిలోని కత్తిపీటను గట్టిగా పట్టుకున్నాడు. యిద్దరూ ఎవరి ప్రక్కకి వాళ్ళు








లాగారు దాన్ని. ఆ ఘర్షణలో లక్ష్మిచేయి కత్తిపీటకి ఒరుసుకుంది. రక్తం వలవలా కారి చీరనంతా తడిపేసింది.

శేషగిరి వణికిపోయాడు.

అపాటికే ప్రక్కవాళ్ళు లేచి వచ్చారు.

శేషగిరికి అవకాశం తప్పిపోయింది. దున్నపోతులా అందర్నీ తోసుకొంటూ అడ్డదిడ్డంగా పరుగెత్తి తప్పించుకున్నాడు శేషగిరి.

## 27

మర్నాడు కన్నయ్య తోటి గవర్నమెంట్ హాస్పటల్‌కి వెళ్ళింది లక్ష్మి.

గాయానికి మందువేసి కట్టుకట్టాడు డాక్టర్. యింజక్షన్ కూడా చేశాడు.

లక్ష్మిని ఎక్కించుకొని యింటికేసి రిక్షా తొక్కుతున్నాడు కన్నయ్య.

అతనూహించని విధంగా రోడ్డుమీద రిక్షా ఆగిపోయింది.

శేషగిరి రిక్షా హాండిల్ పట్టుకొని ఆపేశాడు.

కన్నయ్య శేషగిరికేసి చూసేలోపలే అతన్ని క్రిందికిలాగి లేవకుండా కొట్టాడు శేషగిరి.

లక్ష్మి పులిని చూసినట్టు వణికిపోయింది.

శేషగిరి ఎక్కిన రిక్షా స్పీడందుకుంది.

రిక్షాలో లక్ష్మి కూర్చొనివుంది. ఎక్కడికైనా తీసికెళ్ళి ఆమెను భ్రష్టురాల్ని చెయ్యాలన్న పంతంతో అతివేర్పుగా తొక్కుతున్నాడు శేషగిరి రిక్షాని.

రిక్షా వెనకాలే పరుగెత్తుకొంటూ పరుగెత్తాడు కన్నయ్య. కన్నయ్యకీ రిక్షాకీ మధ్య దూరం పెరుగుతోంది. చాలా వెనకబడిపోయాడు కన్నయ్య.

ఎదురుగా వాహనాల్ని తప్పించుకొంటూ ముందుకు సాగాడు శేషగిరి. లక్ష్మికి అలజడి ఎక్కువయింది. రిక్షాలోంచే అతన్ని తొక్కకుండా వారించాలని ప్రయత్నిస్తోంది. ఆ గుంజాటనలో రోడ్డు మధ్యలో రిక్షా అడ్డం తిరిగింది. శేషగిరి క్రిందికి దిగి లక్ష్మిని క్రిందికి లాగాడు.

అప్పుడే వచ్చింది ఎదురుగుండా ఓ నల్లటి కారు. అందులోంచి విజయ్-రాఘవలు దిగారు.

వాళ్ళని చూసి శేషగిరి వెనక్కి తగ్గాడు.

శేషగిరిని వదల్లేదు వాళ్ళు. తమ కసినంతా మిగల్చకుండా తీర్చుకున్నారు

లక్ష్మిని అక్కున చేర్చుకొని ఆప్యాయంగా నిమిరాడు రాఘవ.

విజయ్ లక్ష్మికేసి చూశాడు. ఎంతో అందంగా కనిపించింది. దగ్గరగా అడుగులువేస్తూ "లక్ష్మి" అన్నాడు అనురాగం నిండిన స్వరంతో.

లక్ష్మిలో ఆశ్చర్యం

ఆనందం

దుఃఖం

అన్నీ ఒక్కసారే పెల్లుబికాయి.

రోడ్డు అన్న సంగతే మర్చిపోయి విజయ్ యెదపై తల అన్చి తృప్తితీరే వరకూ రోదించింది లక్ష్మి.

రాఘవ కళ్ళనుండి ఆనందబాష్పాలు చెక్కిలిమీద జారాయి.

యింతలో కాళ్ళీడ్చుకొంటూ కన్నయ్య అక్కడికొచ్చాడు.

విజయ్-రాఘవలు అతనికి కృతజ్ఞత చెప్పకుండా వుండలేకపోయారు.

శేషగిరిని కార్లో ఎక్కించుకొని పోలీస్టేషన్‌కి తీసికెళ్ళారు. శేషగిరిని పట్టించినందుకు పోలీస్ యిన్‌స్పెక్టర్ అభినందనలు తెలిపాడు.

అంతటితో విజయ్‌కొచ్చిన అపవాదు మాసిపోయింది.

## 28

లక్ష్మి-విజయ్‌లు కొన్నాళ్ళు రాఘవతోనే వుండిపోయారు

రాఘవ వివాహం సునీతతో అతి వైభవంగా జరిగింది.

లక్ష్మి-విజయ్‌లు ఆనాడే చాలాకాలం తర్వాత స్వంతవూరిలో అడు
పెట్టారు. వాళ్ళతోటి రాఘవ-సునీతలు కూడా వెళ్ళారు. అందరికీ ముఖ్యా
డాక్టర్ దామోదర్ కూడా ముఖ్య అతిధిగా వాళ్ళని అనుసరించాడు.

జమీన్‌లో అడుగుపెట్టిన విజయ్ అంతరంగం ఆనందతరంగమైంది.

విజయ్ మారినందుకు ధర్మయ్య ఎంతగానో సంతోషించాడు.
మెట్లెక్కి తన గదిలో అడుగుపెట్టిన విజయ్‌కి ఫ్రేమ్‌లో బిగించిన శ్యా
ఫోటో కన్పించి ఆగిపోయాడు.

అతని కళ్ళు వెలుగుని కోల్పోయాయి.

గతం. అతని హృదయంలో రీలులా తిరిగింది. మనస్సు మూగబో
నట్టయింది ..

అతన్ని చూస్తున్న లక్ష్మి కొయ్యబారినట్టు నిలబడిపోయింది.

శ్యామల ఫోటోని సమీపించాడు విజయ్. ఆ ఫోటోని ప్రేమగా
చేతులతో తడిమాడు. అతని కనుగొలుకుల్లో నీళ్ళు నిండాయి

కర్తవ్యం స్ఫురణకి వచ్చిన లక్ష్మి విజయ్‌ని సమీపించి గోమ
అతని భుజంమీద చేయివేసింది.

వెనక్కి తిరిగి లక్ష్మిని చూసి ఆశ్చర్యపోయాడు విజయ్. భయం
భయంగా చూస్తోంది లక్ష్మి.

ఆమెను పొదివిపట్టి హృదయానికి హత్తుకున్నాడు విజయ్.

ఆ రాత్రి...

డాక్టర్ దామోదర్ నిద్రపట్టక పక్కమీద అటుయిటూ దొర్లుతున్నా
వున్నట్టుండి ఎవరో అటుకేసి వచ్చి అతని ప్రక్కనించే వెళ్ళిపోతున్నా
ఎవరైందీ అర్థంకాలేదు దామోదర్‌కి. దిగ్గున లేస్తూ "ఎవరది ?" అన్నాడు

సమాధానం లేదు

కనీసం అతను వెన్కకి తిరిగిచూడనైనా లేదు.

అనుమానమేసింది దామోదర్‌కి. టార్చి తీసుకొని అతన్ని వెంబడించా

మేడమెట్లు దిగాడావ్యక్తి.

అనుసరించాడు దామోదర్.

పెరడువైపు వెళ్ళిందా ఆకారం.

వెనకాల్నే నడిచాడు దామోదర్.

అలా నడిచి.... నడిచి....చీకట్లో కలిసిపోయారు యిద్దరూ.

*        *        *        *        *

బారెడు ప్రొద్దెక్కినా నిద్రలేవలేదు డాక్టర్ దామోదర్.

విజయ్ గదిలో అరుపులు వినిపించాయి. చివుక్కున నిద్రలేచి కళ్ళు నులుముకున్నాడు.

"యిందులో వుండే పట్టుచీర నెవరు తీశారు.....?" గద్దిస్తున్నాడు విజయ్.

పక్కదిగి . విజయ్ గది వాకిలి దగ్గర నిలబడ్డాడు దామోదర్.

పనివాళ్ళంతా గదిలో నిల్చొనున్నారు.

వాళ్ళను గుచ్చి గుచ్చి అడుగుతున్నాడు విజయ్.

ఎవరూ సమాధానం యివ్వడంలేదు.

ఎలా యిస్తారు....!

ఆ చీర ఎలా మాయమయిందో వాళ్ళ కెలా తెలుస్తుంది....?

డాక్టర్ దామోదర్ మనస్సులోనే నవ్వుకున్నాడు.

ఓ గంట తర్వాత రాఘవ-సునీతలు వచ్చి డాక్టర్ దామోదర్‌ని తొందర పరచారు.

ఆ రోజు... తోటలోకి పిక్నిక్ ప్రోగ్రామ్ వేశాడు విజయ్. త్వరగా స్నానం ముగించి తయారయ్యాడు దామోదర్.

విజయ్-లక్ష్మిలు కూడా వచ్చి వాళ్ళని కలుసుకున్నారు. అందరూ కలిసి కారులో కూర్చోగానే పచ్చని చేలవేపు దూసుకుపోయింది కారు.

ప్రకృతి సౌందర్యాన్నంతా అనుభవించారు. ఆరోజు .... తోట .... పొలాలు....గట్లు అంతా తిప్పిచూపాడు విజయ్.

మధ్యాహ్నం తోటలోనే వనభోజనం చేశారు. వాళ్ళతో తిరుగాడుతున్న విజయ్‌ని గమనిస్తూనే వున్నాడు డాక్టర్ దామోదర్.

అతని ప్రవర్తనలో ఎంతో మార్పు కనిపిస్తోంది.

వుదయం... చీర కోసం పనివాళ్ళను గదిమాస్తున్నప్పుడు కనిపించిన విసుగు అతనిలో మళ్ళీ చూడలేదు దామోదర్.

అసలు వుదయం ఏమీ జరగలేదన్నట్టుగానే ప్రవర్తించాడు విజయ్....

అతనిలోని వుత్సాహం....చలాకీతనానికి....ఆశ్చర్యపోయాడు దామోదర్.

ఆరోజు రాత్రి అందరూ గాఢనిద్రలో వున్నారు. కానీ డాక్టర్ దామోదర్ కర్తవ్య నిర్వహణలో నిద్ర మేల్కొనే వున్నాడు. అతని పక్కగా రాఘవ, సునీతలు అతని ఆదేశానుసారం కూర్చొనే వున్నారు.

నడిరూము దాటింది....

అక్కడక్కడా వూరకుక్కల అరుపులు ...

ఆరుకళ్ళు .. ఒకే చూపుతో విజయ్ గదికేసి చూస్తున్నాయి. వున్నట్టుండి ఓ ఆకారం విజయ్ గదినుండి బయటకొచ్చింది.

ముగ్గురూ దిగ్గున లేచారు...

ఆకారం... చేతిలో మరేదో వస్తువు పట్టుకొని నడుస్తోంది.

మేడమెట్లు దిగిందా ఆకారం....

ముగ్గురూ వెంబడించారు.

ఆకారం పెరటికేసి నడిచింది...

అనుసరించారు ముగ్గురూ

నడిచి....నడిచి పెరటిబావిదగ్గ రాగింది ఆకారం .. దామోదర్, రాఘవ సునీతలు ఏం జరుగుతుందోనని ఎదురుచూస్తున్నారు....

ఆకారం కదిలింది....

తన చేతిలోవున్న వస్తువుని బావిలోకి విసిరింది....

అది గమనించిన దామోదర్ ఆ వస్తువుని గట్టిగా పట్టుకున్నాడు యిద్దరూ ఆ వస్తువుకోసం గింజుకున్నారు.

రాఘవ వెళ్ళి స్విచ్ ఆన్‌చేశాడు. పెరడులైటు వెలిగింది... ఆ ప్రదేశ మంతా కాంతివంతమయింది.

బావి దగ్గర నిల్చొనివున్న ఆకారం ఎవరిదో కాదు.. విజయ్.

బావిలోకి విసరబోయిన వస్తువు .. ఫ్రేమ్‌లో బిగించిన శ్యామల ఫోటో....

నివ్వెరపోయి చూశారు అందరూ....

విజయ్ ముఖాన్ని చేత్తో తడిమాడు దామోదర్. అప్పుడే నిద్రలోంచి మేల్కొన్నట్టు స్పృహలో కొచ్చాడు విజయ్.

వులిక్కిపడుతూ అందరికేసి పరీక్షగా చూశాడు. అతని కేమి అర్థంకాలేదు.

"ఏవిటీ యిక్కడ మీరంతా ఏంచేస్తున్నారు .... అసలు యీ టైమ్‌లో యిక్కడికి నే నెలావచ్చాను" అంటూ తెల్లబోయాడు విజయ్.

"అవును విజయ్... యిక్కడికి నీ వెలా వచ్చావ్?" అని రెట్టిస్తూ అడిగాడు దామోదర్.

సందిగ్ధంలో పడ్డాడు విజయ్.

" నీ చేతులో వున్నదేవిటి . ?" అంటూ మళ్ళీ ప్రశ్నించాడు. తన చేతిలోని ఫోటో చూసి ప్రాన్పడిపోయాడు విజయ్.

అతనికి గజిబిజిగా వుంది.

అతనక్కడి కెందుకొచ్చిందీ అర్థంకాలేదు

ఆ ఫోటో తన చేతిలోకెలా వచ్చిందీ తెలియదు రాఘవ – సునీతల మెదడులోని ఆలోచనలు కూడా పిచ్చిగీతల్లా వున్నాయి

డాక్టర్ దామోదర్ ముగ్గురికేసి చూస్తూ చిద్విలాసంగా నవ్వుకున్నాడు.

విజయ్‌ని వెంటబెట్టుకొని గదికేసి నడిచాడు దామోదర్ అందరూ విజయ్ గదిలో అడుగుపెట్టారు లక్ష్మి వాళ్ళ అలికిడికి లేచి కూర్చుంది. 'కళ్యాణి' హాయిగా నిద్రపోతోంది.

డాక్టర్ దామోదర్ మరోసారి చిద్విలాసంగా నవ్వి గొంతు సవరించుకున్నాడు

అందరూ ఆతృతగా ఎదురుచూస్తున్నారు.

"మిస్టర్ విజయ్ మీ రేమీ అనుకోనంటే ఓ పచ్చినిజం చెప్పమంటారా ?" అంటూ సమాధానం కోసం చూశాడు దామోదర్.

చెప్పమన్నట్టు చూశాడు విజయ్ .

"మీ యింట్లో పోయిన నెక్లెస్ . బంగారు గాజులూ నిన్నపోయిన పట్టుచీరా ఆ మూడు వస్తువుల్ని దొంగిలించిం దెవరో తెలుసా ?"అన్నాడు దామోదర్.

"ఎవరు ?" ఆతృతగా చూశాడు విజయ్ .

"ఎవరో కాదు మీరే" దృఢంగా పలికింది దామోదర్ గొంతు.

"డాక్టర్"__ అరిచాడు విజయ్.

అతనికి కోపమొచ్చింది అవమానం అతన్ని దహించివేసింది.

"అవును విజయ్ నేను చెప్పింది పచ్చినిజం "

"ఎలా ? ఎలా డాక్టర్ . ? నా వస్తువుల్ని నే నెలా దొంగిలించుకుంటాను. చెప్పండి డాక్టర్. హౌ హౌ యీటిజ్ పాజిబుల్?"

ఆవేశంతో వూగిపోయాడు విజయ్.

"యస్.. పాజెబుల్ విజయ్ యిటీజ్ క్వయిట్ సాజిబుల్" నొక్కి పలికాడు దామోదర్.

"ఎలా డాక్టర్?" రోషావేశాలలో విజయ్ కళ్లు ఎరుపెక్కాయి.

"చెప్తాను కాఫీ ముందు నే నడిగి దానికి సమాధానం చెప్పండి యింతక మునుపు మీ చేతిలో వుండిన శ్యామలగారి ఫోటోని బావిలోకి విసిరారు. అవునా?" ప్రశ్నించాడు దామోదర్.

మౌనంగా తలవ చుకున్నాడు విజయ్.

"కానీ మీకు తెలిసే ఫోటోని మీరు బావిలోకి విసరలేదు తెలియకే అంతా జరిగింది అంటే మీ మనస్సు పడే సంఘర్షణలో ఒక భాగంగా అపని చేయబోయారు అలాగే మీ యింట్లో పోయిన మూడు వస్తువులు నెక్లెస్ బంగారుగాజులు మరియు పట్టుచీరకూడా మీరే, మీకు తెలియకుండానే బావిలోకి విసిరివుంటారు

అవమానభారంతో తలవంచేశాడు విజయ్

"యిలా ఎందుకు జరిగిందో మీకు తెలుసా ?" దామోదర్ ప్రశ్న—

ఆసక్తిగా చూశాడు విజయ్

"ఎందుకో కాదు మీ తొలి భార్య శ్యామల చిత్రాన్ని మీ మనస్సు లోంచి తుడిపేసుకోడానికి "

"మీరు మీ తొలి భార్య శ్యామల వ్యామోహంలోపడి పిచ్చివాడై పోతున్నారని మీ బంగారుజీవితం పాడైపోతుందేమోనని మీకు పునర్వివాహం చేశారు ధర్మయ్యగారు. కానీ మీరు మి మొదటి భార్యమీదున్న మమకారంతో ఆమెని మరువలేకపోయారు. ఆమె ప్రతిమ మీ మనస్సుని పూర్తిగా ఆక్రమించుకుంది. అందుచేతనే ఎప్పుడూ మీకు ఆమె జ్ఞాపకాలే ఆ కారణంగానే రెండో పెళ్ళిచేసుకున్నా లక్ష్మిని ఆదరించలేకపోయారు మీ మనస్సుతో గుంజాటనపడి మీలో మీరే సతమతమైపోయారు అంతేకాదు లక్ష్మిని నొప్పించిన తర్వాత మీరు విధిగా బాధపడివుండాలి

"శ్యామల్ని పూర్తిగా మరువలేకపోయారు లక్ష్మిని నొప్పించడమూ మీ అభిమతం కాదు అలా పరస్పర విరుద్ధభావాలతో మీ మనస్సు నలిగింది. జ్ఞాపకాలకి సమాధి కట్టి లక్ష్మితో క్రొత్త జీవితం ప్రారభించాలనే మీ ఆలోచన కానీ ఎలా?—"

"ఆ విధంగా 'ఎలా?' అని మీలో మీరు ప్రశ్నించుకొన్నందుకు పర్యవసానమే.. మీరు నిద్రలో నడవడం "

కళ్ళప్పగించి చూస్తూవుండిపోయాడు విజయ్ .



"నిద్రలో నడిచేవారికి దృష్టిమాత్రమే వుంటుంది వినికిడి, స్పర్శా ఎక్కువగా వుండవ్ ఇప్పుడప్పుడూ అలా నడుస్తూ మిమ్మల్ని ఆక్రమించు కొన్న మీ మొదటి భార్య శ్యామలకి సంబంధించిన వస్తువులన్నింటినీ ఒక్కొక్కటిగా మీకు దూరంచేసుకుంటున్నారు" అంటూముగించాడు డాక్టర్ దామోదర్.

విజయ్‌కేసి అనురాగంగా చూసింది లక్ష్మి. ఆమె కళ్ళల్లో కోటి దీపాలు వెలిగాయి.

విజయ్ పెదాలు కదిలాయి

"సారీ డాక్టర్ నా ప్రవర్తనకి నేనే సిగ్గుపడుతున్నాను. దొంగ ఎవరైంది



102

తెలుసుకోకుండా అందర్నీ అవమానించాను. మూర్ఖంగా ప్రవర్తించి లక్ష్మిని నాకు నేనే దూరంచేసుకున్నాను" పశ్చాత్తాపంతో అన్నాడు విజయ్.

"నో నో విజయ్. యిందులో మీరు బాధపడాల్సిందేమీ లేదు. అంతే కాదు... మీరు క్షమాపణ చెప్పవలసింది నాకు కాదు లక్ష్మికి పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొని యిన్నాళ్ళు ఓర్పువహించింది లక్ష్మి. అందుకు మనందరమూ ఆమెకే చెప్పాలి కృతజ్ఞతలు" నవ్వుతూ అన్నాడు డాక్టర్ దామోదర్.

* * *

తెల్లవారిందంటూ పక్షులు కిలకిలారావాలు చేశాయి. మరో మధురమైన రోజుకి స్వాగతం పలుకుతూ లేలేత వెలుగులతో పైకిలేచాడు భానుడు

ఆ రోజంతా కూలీలకి పని దొరికింది.

విజయ్ యింటి పెరటిలోని బావిని పూడికతీశారు. పోయిన రవ్వల నెక్లెస్, బంగారు గాజులూ చెక్కు చెదరకుండా అందులో దొరికాయి

పట్టుచీర చివికిపోయింది.

శ్యామల వ్యామోహమనే మంచుతెర విజయ్ మనస్సులోంచి కరిగిపోయింది.

వాస్తవం ..అతని కళ్ళకు కట్టినట్టుంది.

శ్యామల జ్ఞాపకాలకి పూర్తిగా ఉద్వాసన చెప్పాడు విజయ్.

ఆ స్థానే లక్ష్మిని ప్రతిష్టించుకోకుండా వుండలేకపోయాడు

దొరికిన నెక్లెస్ గాజులూ కరిగించి లక్ష్మికి సరికొత్త నగలు చేయించాడు.

శ్యామల ఫోటో దేవుడి గదిలో స్థిరస్థానాన్నాక్రమించుకుంది.

లక్ష్మి జీవితంలో వసంతం వెల్లివిరిసింది. వసంత కోకిలారావములు ఆమె హృదయాన్ని పులకింపజేశాయి.





# కె. గోదావరి శర్మ

# కౌంటర్ ఫీట్

పరాకుగా నడుస్తున్న పార్వతీశం కాళ్లు హఠాత్తుగా ఆగిపోయాయి కళ్లు రోడ్డు మీద పడిఉన్న ఏదో అసాధారణ వస్తువుని చూశాయి, వెంటనే దాన్ని హస్తగతం చేసుకోవాలని మెదడు చేతులకి సందేశం పంపింది. అనాలోచితంగానే గబుక్కున వంగి దాన్ని తీయబోతూ ఉండగా హఠాత్తుగా ఏదో గుర్తొచ్చింది పార్వతీశానికి. కాని అప్పటికే అప్రయత్నంగా నడుం వంగి, చెయ్యి సాగి, రోడ్డుమీద మడతపడి ఉన్న ఆ నోటుని అందుకుంది. అలా వంగునే తలతిప్పి ఎడమపక్కకి చూశాడు. అంతవరకు నోటికి చెయ్యి అడ్డంపెట్టుకుని నవ్వు ఆపుకుంటున్న అల్లరిపిల్ల తుర్రువ ఇంట్లోకి పారిపోయింది.

పార్వతీశం ఒక్క క్షణంపాటు ఇన్సల్ట్ ఫీలయ్యాడు. వారం రోజుల క్రిందట ఒకసారి ఇదే పరాభవం జరిగింది అది గుర్తురాగానే ఆ నోటుని అదేదో అంటరాని వస్తువైనట్టు విదిలించి పారేసి, విటారుగా నిలబడి, వెనక్కి తిరిగి చూడకుండా చకచక ముందుకి సాగిపోయాడు.

కొద్దిసేపట్లో అతడికి ఆ పిల్లమీద కోపం పోయింది. తన పరధ్యానానికి తెలివితక్కువకి తనకే నవ్వు వచ్చింది. ఒట్టి అల్లరిపిల్ల! తను ఉండే వీధిలోనే చివరి ఇంట్లో ఉంటున్నారు వాళ్ళు

ఆ రోజు ఇలాగే —ఏదో ఆలోచిస్తూ నడుస్తున్న తను రోడ్డుమీద కాళ్ళకడ్డంగా పడిఉన్న ఐదు రూపాయల నోటు మడతని చూసి ఆగిపోయాడు. పాపం, ఎవరో పారేసుకుని ఉంటారు! పొద్దున్నే లేచి తను ఎవరిముఖం చూశాడో ఎవరిదో ఏమిటి? తన ధర్మపత్ని ముఖమే — ఆ అదృష్టహీనుణ్ణి విడనాడిన లక్ష్మి తనని వరించింది నెలాఖరు రోజుల్లో అయాచితంగా దొరికిన ఐదురూపాయలు ఏ ఖర్చుకైనా పనికొస్తాయి అనుకుంటూ వంగి దాన్ని తీశాడు. తీరా పైకితీసి దాన్ని పరీక్షగా చూస్తే అది పిల్లలు ఆడుకునే బొమ్మనోటు. జాగ్రత్తగా చూడకపోతే ఎవరైనా పొరపాటు పడతారు. ఏ కిళ్ళీషాపులోనైనా ఐదుపైసలకొకటి దొరుకుతాయి అలాంటి బొమ్మనోట్లు.

ఒక్కసారి నిరుత్సాహం ముంచుకురాగా ఆ దొంగనోటు నేలకి విసిరికొట్టి, తన తొందరపాటు పనిని ఎవరైనా చూశారేమోనని చుట్టూ చూశాడు. ఎడమపక్క ఇంటి గేటుదగ్గర - సన్నజాజి పందిరి క్రింద నిలబడి తనకేసే చూస్తోంది ఒక పన్నెండేళ్ళ పాప. అవతలి వాళ్ళలోని దురాశని ఎక్స్ప్లాయిట్ చేసి ఇలా ఆటలు పట్టించి నవ్వుకోవడంలో ఒక ఆనందం ఉంది ఆ ఆనందం ఆ పిల్ల కళ్ళలో స్పష్టంగా కనిపించింది. తను ఆ పిల్లకేసి చూడగానే ఏం ఎరగనట్టు అమాయకంగా ముఖంపెట్టి కొబ్బరిచెట్టు చాటుకి తప్పుకుంది చెట్టువారకి వెళ్ళి తనని తలచుకుని నవ్వుకుందేమో! ఇవాళ లాగే

ఆ రోజు మొదటిసారి అలా మోసపోవడం తనూ సరదాగానే తీసుకున్నాడు. ఆ పిల్ల చేసిన కొంటెపనిని భార్యకి చెప్తే నవ్వుతుందని, తనని ఎగతాళిచేస్తుందని ఆమెకి మాత్రం చెప్పలేదు. అయినా, అందులో తనకి జరిగిన అవమానం ఏమీ లేదని సమర్ధించుకున్నాడు. ఎదురుగా నోటు కనిపిస్తే ఎవడి మనసు ఆశపడకుండా ఉంటుంది?

కాని మళ్ళీ అదే పద్ధతిలో ఫూల్ అవడం బాగులేదు. పైగా ఈసారి ఆ పిల్ల తన ఎదురుగానే నవ్వింది. తన పరధ్యానానికి తనని తను మళ్ళీ తిట్టుకున్నాడు పార్వతీశం. ఇంటి మెట్లెక్కుతూ ఈ

విషయం మరచిపోవడానికి ప్రయత్నించాడు

ఆటు తర్వాత ఆ ఇంటిముందునుంచి ఆఫీసుకి వెళ్తున్నా వస్తున్నా, అక్కడికి వచ్చేసరికి ఆ సంఘటన గుర్తువచ్చేది పార్వతీశానికి వెంటనే మనిషి ఇంకేం ఆలోచించకుండా ఎలర్ట్ అయిపోయేవాడు. రోడ్డుమీద ఏ వస్తువునీ చూడకుండా, చూసినా, పట్టించుకోకుండా, పట్టించుకున్నా అగి, వంగి, తీసే బుద్ధి తక్కువపని చేయకుండా బుద్ధిగా ముందుకి నడిచి వెళ్ళిపోయేవాడు ఆ అమ్మాయి అక్కడ ఉందేమోనని మాత్రం ఓసారి గేటువైపు చూశాడు. ఒకటి రెండు సార్లు కనిపించింది నొచ్చుకున్నట్టుగా, సాకీ చెప్తున్నట్టుగా చూసింది కూడా. పార్వతీశం ఏమైనా అవకాశం ఇస్తే, 'సారీ అంకుల్, ఇంకెప్పుడూ అలా చెయ్యను' అని చెప్పిఉండేదేమో కూడా! ఏమైనా రోజూ ఆ ఇంటికేసి, ఆ పాప కోసం ఓసారి చూడడం అలవాటై పోయింది పార్వతీశానికి

దాదాపు నెల్లాళ్లు గడిచిపోయాయి. ఈ మధ్యలో, ఆ పాప చురుకైనదీ, తెలివైనదీ అని చూపులద్వారానే గ్రహించాడు పార్వతీశం. మాట్లాడే అవసరం, అవకాశం మాత్రం కలగలేదు.

ఓ రోజు సాయంకాలం ఆఫీసునుంచి అలసిపోయి ఇంటికి తిరిగివస్తున్నాడు పార్వతీశం. ఆఫీసు పనివల్ల తల నొప్పిగా, ఒళ్ళంతా చెమటపట్టి, చికాగ్గా ఉంది. నీరసంగా ఇంటికేసి అడుగులు వేస్తున్న పార్వతీశానికి మళ్ళీ రోడ్డు ప్రక్కగా దాదాపు అదేచోట ప్రత్యక్షమైంది నోటు. ఈసారి వందరూపాయల నోటులా ఉంది! గేటుకేసి చూశాడు. ఆ పాప లేదు ఏ కొబ్బరిచెట్టు చాటునో, కిటికీ వెనకో ఉంటుంది. పార్వతీశానికి ఈ ఆట ఇక ఆసక్తి అనిపించలేదు. ఆ నోటువంక నిర్లక్ష్యంగా ఓసారి చూసి నడక సాగించాడు.

ఇల్లు చేరిన పార్వతీశానికి భార్య ముందుగదిలో దిగాలుగా కూర్చుని కనిపించింది. తలనొప్పినీ, చికాకునీ వాయిదా వేసి, లేని ఉత్సాహం తెచ్చిపెట్టుకుని "ఏం, అలా కూచున్నావేం?" అనడిగాడు.

"ఏమండీ, ఏమీ అనకండేం! నా తప్పేంలేదు, నేను జాగ్రత్తగానే ఉన్నాను. అయినా " నీళ్ళు నమిలింది భార్య.

పార్వతీశానికి ఆందోళన, ఆతృత హెచ్చాయి.

"ఏమైంది, ఇంతకీ? ఇంట్లో ఏదైనా.. పోయిందా? పగిలిపోయిందా — అద్దం గానీ .."

"ఉహూ(! ఆ మాత్రం అయితే బాగానే ఉండును. ఇందాక బియ్యం తెద్దామని బజారు కెళ్లానండీ! ఉదయం చెప్పానుగా, వెళ్తానని.... వెళ్తూ ఉంటే—

పార్వతీశం బుర్రలో ఫ్లాష్‌లా ఏదో మెరిసింది.

"కొంపతీసి—ఉదయం నేను బీరువాలో ఉంచిన వందరూపాయల నోటు తీసుకెళ్ళావా?" అనడిగాడు.

"ఊఁ! అదే...." భయం భయంగా అంది ఆమె.

"అది పోయిందా, ఎక్కడో? జారి పోయిందా చేతిలో మడిచి పట్టుకుంటే?"

"ఊఁ! మీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగింది.

"ముందు బయలుదేరు. తాళం కప్ప ఏదీ? తలుపుకి వేసి రా, చెప్తాను. అర్జెంటు...." త్వర పెట్టేడు పార్వతీశం.

అతడి భార్యకి వెంటనే లైటు వెలగ లేదు. "ఎక్కడికండీ" అంది అర్థంకాక.

"దార్లో చెప్తాను, నువ్వు బయలుదేరు ముందు. లేటుచేస్తే అదెవడో కొట్టేస్తాడు.... అసలు ఇప్పటికే ఎవడికంటో పడేఉంటుందది" అదుర్దాగా అన్నాడు పార్వతీశం.

"ఉందా? ఆ నోటు మీరు చూశారా?" అయోమయం, ఆనందం కలగలిపిన స్వరంతో అడిగింది ఆమె.

"చూశాను. ఇందాక అక్కడే రోడ్డు పక్కన పడిఉంది. ఇప్పటికింకా ఉందో ఎవడైనా తీసుకున్నాడో...." తాళంవేసి బయటకి నడుస్తూ అన్నాడు పార్వతీశం.

"మరి చూస్తే తియ్యలేదేమండీ?" ఇంకా అయోమయంగా అడిగింది ఆమె.

"రోడ్డుమీద వందరూపాయల నోటు కని పిస్తే చూసి, ఓహో అనుకుని వచ్చేశారా? లేకపోతే అది మనది కాదుకదా, ఇంకెవరిదో మనకెందుకని వదిలేశారా, సత్య హరిశ్చంద్రుడిలా?"

పార్వతీశానికి భార్యమీద, తనమీద, ఆ పాపమీద ఒకేసారి కోపం వచ్చింది. దాన్తో తలనొప్పి ఎక్కువై, ఆ గందర గోళంలో విషయమంతా వివరించడానికి వ్యవధి, ఓపిక లేక, "నువ్వు కొంచెం నోరు మూసుకుంటావా" అన్నాడు అసహనంగా.

ఆమె తెల్లబోయి చూసింది. పరుగు లాంటి నడకతో అతడు వెళుతూంటే అతడి వెనకే ఆమెకూడా వెళ్ళింది.

ఆ ఇంటిముందు రోడ్డుమీద, రోడ్డు ప్రక్కనా జాగ్రత్తగా వెతికారు దంపతు లిద్దరూ. ఫలితం శూన్యం. ఈ అదృష్ట హీనుల్ని విడిచిపెట్టి లక్ష్మి ఇంకే అదృష్ట వంతుడినో అప్పుడే చేరుకుంది. చీకటి ముదిరాక ఇంక లాభంలేదని నిర్ణయానికి వచ్చారు ఇద్దరూ.

"ఇంక మరి దొరకదు పోదామండీ" అంది భార్య దీనంగా. ఇంతకీ అది ఇక్కడే పడిఉంటే భర్త దాన్ని చూసి కూడా ఎందుకు తియ్యలేదో ఆమెకి అంతుపట్టలేదు.

పార్వతీశం కూడా నిరాశ చేసుకుని, వెనుతిరగబోతూ, "ఒక్క నిముషం" అన్నాడు, ఆ ఇంటికేసి అడుగేస్తూ. అంతసేపూ ఆ ఇంటిగేటు మూసుకునే ఉంది.

"ఆ ఇంటివాళ్ళ కేమైనా దొరికిందేమో ననా?" అడిగింది ఆమె.

"ఊహూఁ!" ఏరేమీ చెప్పకుండా గేటు తీసుకుని లోపలికి వెళ్ళి, గుమ్మం పక్కగా ఉన్న కాలింగ్‌బెల్ నొక్కాడు పార్వతీశం.

తలుపు తీసుకుని ఆ పాప తల్లి కాబోలు, ఆవిడా, వెనకనే ఆ పాపా వచ్చారు.

పార్వతీశం డైరెక్ట్‌గా ఆ పాపనే అడిగాడు. "ఏం పాపా! ఇవాళ కూడా నన్ను ఫూల్ చేద్దామనుకున్నావా!"

శ్రోతలు ముగ్గురికీ ఆ ప్రశ్న అర్థం కాలేదు.

"ఆదేంటండీ" అంది ఆ పాప, అయోమయంగా, కొంచెం భయంగా.

"అదే.... ఇవాళ కూడా బొమ్మనోటు రోడ్డుమీద పడేసి, నేనది తీసి ఫూల్నైతే చూసి నవ్వుదామని ట్రైచేశావా," మృదువుగానే అయినా, సూటిగా అడిగాడు పార్వతీశం.

"లేదండీ! గాడ్ ప్రామిస్! ఇవాళ నాకు జ్వరం. సాయంకాలం అస్సలు బయటకే రాలేదు. ఇంతకుముందు అలా చేసినందుకు సారీ అండీ, రియల్లీ సారీ!- ఇవాళ మాత్రం నేనేం చెయ్యలేదు." ఆ పాప ముఖం దీనంగా ఉంది.

పార్వతీశం నిట్టూర్చాడు. "అయితే ఆ నోటు మనదే. నిజం నోటే అన్న మాట...." అన్నాడు భారంగా.

ఆడవాళ్ళిద్దరికీ ఇంకా విషయం బోధ పడలేదు. పాపకి మాత్రం అర్థం అయింది. వెంటనే అవాక్కై తర్వాత ఏదో అనబోయింది.

కాని ఇంతలోనే పార్వతీశం "వస్తా మండీ. సారీ ఫర్ ది డిస్టర్బెన్స్" అని పాపా వాళ్ళమ్మతో చెప్పి వెనుతిరిగేడు. అతడి భార్య అతడిని అనుసరించింది.

—o—

# నాకు నచ్చిన నా కథ



తేది 6-5-1978 ది సినీహెరాల్డ్ వార పత్రికలో ప్రచురించిన "అడుగుల భారం" కథ, నా కథలు అన్నిటిలోకి నన్ను బాగా ఆకట్టుకొన్న కథ.

కథకో ప్రయోజనం ఉండాలనేది నా గట్టి నమ్మకం, సహజంగా హాస్య కథలు, ప్రేమ కథలు పాఠకుణ్ణి తాత్కాలికంగా ఆకట్టుకోవచ్చు, ఆనందింప చేయవచ్చు కానీ, పాఠకుణ్ణి వెంబడించేది అతనికో ప్రయోజనం చేకూర్చగలిగేది -విన్నూతన పంథాలో నడిచే సమస్యాపూరితమైన కథలే. అందుకే క్రొత్త సమస్యలను పాఠకులముందు ఉంచాలనే నేను వివిధ జీవన లోతుల్ని త్రొవ్వుతుంటాను. అలాంటి లక్ష్యంలో నా కలం నుండి వెలువడిన కథలకు ప్రాయను మార్గదర్శి కాగలుగుతున్న కొన్ని కథలలో ఈ "అడుగుల భారం" మొట్టమొదటిది.

—ఈతకోట సుబ్బారావు

# అడుగుల భారం

"నమస్కారం సార్!"

చదువుతున్న పత్రికనుంచి తలెత్తి చూశాను. ఎవరో అపరిచిత యువకుడు పాతికేళ్ళుంటాయేమో, నవ్వుతూ ఏమిటన్నట్టు అతనివైపు చూశాను. అతని కళ్ల లోని గాంభీర్యం, ధైర్యం చూసి ఒక్క క్షణం విస్తుపోయాను.

"నాపేరు కిరణ్ సార్! మీ 'జ్యోతి అవుట్‌డోర్ యూనిట్'లో లైట్ బోయ్‌గా పనిచేస్తున్నాను. మీతో కొంచెం ప్రైవేటుగా మాట్లాడదామని వచ్చాను సార్." మాటలతీరు చూస్తుంటే మొహమాటస్తుడుగా వున్నాడు. ఇలాటి వారు మాట్లాడేది నా అనుభవం ఎంతో నేర్పింది. జీతం పెంచమని కొందరు చిన్న చిన్న వేషాలు ఇప్పించమనేవారు. మరి కొందరయితే, రోజూ వచ్చే అభిమానులు మరికొందరు. ఇతను వీటికే చెంది ఉంటాడనే నమ్మకంతో "చూడండి మిస్టర్ కిరణ్! మా యూనిట్‌బోయ్ అంటున్నారు! మీ కష్టసుఖాలు గాని, వ్యక్తిగత విషయాలు గాని యూనిట్ విషయాలు గాని, మేనేజర్‌గారితోనే మాట్లాడాలి" ఇలాంటివారిని వదిలించుకోవడానికి నే నవలంబించే మార్గాలలో ఇదొకటి.

"క్షమించండి సార్! నేను ముందుగా చెప్పాను ప్రైవేటుగా మాట్లాడవలసిన విషయమని మీరు ఆదివారం షూటింగ్‌లో పాల్గొనరు, ఖాళీగా వుంటారని ఇంటికెళ్ళాను సార్. డబ్బింగ్ ప్రోగ్రాం కొరకు ఇక్కడున్నారని తెలిసి, మీరు తప్పక సహాయం చెయ్యగలరని వచ్చాను సార్. నా ఆశ నిరాశ చెయ్యకండి సార్!"

అతని ప్రాధేయతకు నేను బాధపడిన విషయం నిజమేకాని నా బాధను అర్థంచేసుకొనే దెవరు? వారంరోజులు కెమెరాముందు ఆడి, పాడి, వారానికి ఒకరోజు రెస్ట్ తీసుకుందామంటే డబ్బింగ్ ప్రారంభోత్సవాలని కాళ్ళావేళ్ళ బడి లాక్కురావటం, లేకుంటే కట్టిస్తున్న స్టూడియో విషయాలుగాని, నడిపిస్తున్న అవుట్‌డోర్ యూనిట్ ప్రోగ్రాంలుగాని, నా కాల్‌షీటు విషయాలలో నా బాధ అర్థం చేసుకొనేదెవరు? ఏం చెపుతాడో విని చూద్దాం అనుకొని "చెప్పండి మిస్టర్, మీ పనేమిటో" అనడిగాను.

తల దించుకొని ఒక్క క్షణం తర్వాత 'ఇది పూర్తిగా నా వింత సమస్య సార్! మీ కెందుకు చెబుతున్నానంటే మీకీ సమయంలో నా ఆర్థిక సమస్య తీర్చగలరనే దృఢనిశ్చయముతోనే సార్" అన్నాడు.

"ఆర్థిక సమస్య" ఆశ్చర్యంగా అడిగాను.

"నా ప్రస్తుత ఆర్థికసమస్యకు కారణం ఒక రకంగా మీ యూనిట్ అని చెప్పగలను సార్. స్టూడియో యజమాని, ప్రముఖ హీరో ముందు కేవలం ఒక బోయ్ ఇలా మాట్లాడుతున్నందుకు క్షమించండి సార్

చెంపమీద కొట్టి రాజకీయమన్నా, చెప్పుతో కొట్టి సారీ అన్నా, మానవత్వమున్న ఎవరు మాత్రం ఏం చేయగలరు. అందుకనే "పర్వాలేదు. చెప్పండి" అన్నాను.

నేను బి ఇ. పాసయ్యాను. నా మీద ఆధారపడి ఉన్న తల్లిదండ్రులు, మా యింటి ఒక్కగా నొక్క ఆడపడుచు, నా భార్య, నాకు తండ్రి బిరుదు సంపాదించిపెట్టిన నా రెండేళ్ళ కొడుకు, వీరికోసం, విజయవాడ 'విజయశ్రీ' లాడ్జిలో పనిచేస్తున్న రోజులవి. విజయవాడ పరిసరప్రాంతాలలో 'హీరో సుమంత్' గారి "కాలేజీ కుర్రాడు" చిత్రం షూటింగ్ జరుపుకొని ఓ రోజు రాత్రి నటీనటులు, దర్శక నిర్మాతలు, సాంకేతిక నిపుణులు ఆ చిత్రానికి పని చేసిన మీ జ్యోతి అవుట్‌డోర్ యూనిట్ మేనేజరూ, వీరందరూ కలసి మా లాడ్జిలో బసచేశారు. ఆ లాడ్జిలోనే తిరుగుతున్న నన్ను బోయ్‌నేత పిలిపించారు. ఏదో కంప్లెయింటు అని గాభరాగా వెళ్ళాను, ఆ పిలిపించింది ఎవరోగాదు మీ యూనిట్ మేనేజరుగారే. అతను చెప్పిన మాటలు విని ఆశ్చర్యపోవటం నా వంతయింది ఒంటినిండా బంగారుపూత పూస్తున్నారో, కొండమీద కూర్చో బెడుతున్నారో నాకే అర్థంగాని సమయంలో "ఇప్పుడే ఏ విషయం చెప్ప నవసరంలేదు. నేను చెప్పింది మీ మంచి కొరకే. రాత్రి బాగా ఆలోచించుకునే రేపు ఉదయం చెప్పండి" అన్న అతని చివరి మాటలతో పంజరం విడిచిన పక్షిలా సంతోషంతో బయటపడ్డాను. ఆ రాత్రంతా ఈ ఊహలతోనే నిదుర పట్టింది కాదు. ఆ రాత్రంతా అతని మాటలే మననం చేసుకుంటూ గడిపాను. "ఈ కాలపు హీరోలకు మేడమెట్లు సరసరా దిగాలన్నా, పడి గెత్తాలన్నా, గుర్రం ఎక్కాలన్నా డూప్ ఎంతో అవసరం. కేవలం డూప్ పాత్రల కొరకు ఈ ఉద్యోగం ఎలా వదులుకోవాలని బాధపడతారేమో! మీరు ఆలోచించండి.




హీరో సుమంత్‌గారి ఒడ్డూ పొడుగూ విషయాలలో ఏ విధంగానూ తీసిపోరు. సుమంత్ గారి చిత్రాలన్నిటికీ మీరు ఉపయోగపడతారు. కేవలం ఇది పార్ట్‌టైం వర్క్‌గా భావించండి. మా యూనిట్‌లో మీకు పర్మనెంట్ ఉద్యోగం ఇప్పించగలను. పరిశ్రమలో అడుగుపెట్టిన తర్వాత నలుగురు పెద్దలు పరిచయమవుతారు. మీ గ్లామర్‌తో చిన్న చిన్న పాత్రలు పోషిస్తూ మంచి పేరు తెచ్చుకోవచ్చు. ఇలా ఎన్నో చెప్పిన తర్వాత నాకు తోచిందల్లా పెద్దలు చెప్పినట్లు అదృష్టమనేది వడిలో వచ్చి కూర్చోదు. కాళ్ళదగ్గరకు వచ్చిన దానిని తన్నకుండా వంగి తీసుకోవటం మేలనిపించింది, అందుకనే మరునాడు అంగీకారం తెలిపాను. నేను అంగీకరించటంలో నా స్వార్థం గూడ భాగస్వామి. ముఖ్యంగా నన్నొక అధికారిగా చూడలని పైసాలు కూడబెట్టి బి.ఇ. చదివించిన నా తల్లిదండ్రుల ఆశయం మేరకు, నా చెల్లాయికి ఘనమైన సంబంధం చేయాలని, నా జీవితంమీద పెంచుకున్న ఎన్నో ఆశల మేరకు నా అంగీకారం తెలియజేశాను సార్; అంగీకారం తెలియచేసిన పదిహేను దినాలకే "కాలేజి కుర్రాడు" చిత్రానికి కూడ డూప్ పని ఉంది. వెంటనే రండి" అని పిలుపొచ్చింది. సెలవు పెట్టి మద్రాసు వెళ్లాను. మూడు రోజులు సెలవు పెట్టిన నేను ముప్పది రోజులకు వచ్చేటప్పటికి లాడ్జిలో నా 'జాబ్' కాస్తా పోయింది.

తప్పనిసరై జీవనోపాధికి కుటుంబంతో మద్రాసు చేరాను. అప్పటి సుమంత్ గారి చిత్రాలన్నిటిలో పాల్గొనేవాణ్ణి, కాని ఆ డబ్బుతో ఈ సిటీలో అంతమంది జీవించాలంటే ఎంత కష్టమో మీకు తెలిసే ఉంటుంది సార్. ఆ పరిస్థితిలోనే ఇష్టంలేకున్నా మీ యూనిట్ లైట్‌బోయ్‌గా చేరాను. చెప్పటం ఆపి "విసుగనిపిస్తుందా సార్" అనడిగాడు

"అ లేదు లేదు. ఇంటరెస్టింగుగా ఉంది, చెప్పండి" అన్నాను.

"పరిశ్రమలో చేరి మూడేళ్ళు దాటినా లైట్‌బోయ్‌గా, డూప్ హీరోకన్న ఎక్కువ ఎదగలేకపోయాను. ఈ మూడేళ్ళు కష్టపడిన దానికి నేననుకున్న నా చెల్లాయికి వివాహం చేశాను. నాకు తండ్రి బిరుదు సంపాదించి పెట్టిన పెద్ద వాడి మాటను మరో ఇద్దరు బలపరచారు. అప్పుడే నా భార్యకు పిల్లలు కలగకుండా ఆపరేషన్ చేయించాను అది సక్సెస్‌గాక ఆమెకు పెద్ద జబ్బు చేసింది. ఇప్పటికే నా భార్య రోగాలతోనే బాధపడుతున్నా మందులిప్పించగల స్థితిలో లేను సార్. రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి ఏర్పడింది. ఆ రోజుల్లోనే సుమంత్ గారి చిత్రానికి మదుమలై అడవులలో పనిచేస్తున్నాను అప్పుడు ఇంటి వద్ద నుంచి లెటర్ వచ్చింది. దాని సారాంశం హైద్రాబాదులో ఆ నెల 28న ఇంటర్వ్యూ ఉందని. ఇన్నాళ్ళూ నాకో డిగ్రీ ఉన్న సంగతి మరచిపోయాను. ఇన్నాళ్ళకి చదివిన 'బి ఇ.' డిగ్రీకి ఒక సార్థకత ఎర్పడుతుందనే సంతోషంతో యూనిట్ మేనేజరు గారికి చెప్పాను. వారు చెప్పింది విని ఆశ్చర్యపోవటం నా వంతయింది. ఈ విషయం తెల్సిన నిర్మాత, దర్శకులు వచ్చి 'చూడండి మిస్టర్! మీరు ప్రభుత్వ ఉద్యోగి కాబోతున్నారంటే మాకు సంతోషం కాని చూశారా మీరీ సమయంలో వెళ్ళారంటే ఈ షెడ్యూల్ కాన్సిలవుతుంది. కాన్సిలవుతే కొన్ని లక్షలు నష్టమవుతులవి. ఇదే షూటింగ్ ఏ అడవిలోనయినా పర్వాలేదు ఇలాంటి పరిస్థితిలో మాకెంత నష్టమో ఆలోచించండి మిమ్మల్ని నమ్ముకొని మరే డూప్ హీరోనూ తీసుకురాలేదు. అలాటప్పుడు మరో షెడ్యూల్ వేసి ఈ అడవిలోకి రావాలంటే చదువుకొన్నావారు, మీరూ ఆలోచించండి' వారి బాధ వారు చెప్పి వెళ్ళారు. ఎదిరించి వెళ్ళదామంటే ఆ అడవికి ప్రత్యేక బస్సులు లేవు. చేతిలో డబ్బుల్లేవు. ఇలాంటి పరిస్థితుల్లో వారి మాటను కాదనలేక, అటు వెళ్ళనూ వీలులేక మానుకున్నాను.

"తరువాత రెండు నెలలకే నేనూహించని ఘోరమైన వార్త నాన్నకు యాక్సిడెంట్. నా వ్యథ ఎంతఉన్నా నా కర్తవ్యాన్ని సరిగ్గానే నిర్వర్తించేవాణ్ణి కాని నా జీతంతో ఇల్లు గడవక నాన్న సబ్బుల కంపెనీలో సేల్స్‌మన్‌గా చేరాడు. అప్పుడే సైకిల్‌మీద వెడుతున్న నాన్నను సిటీ బస్సు కొట్టింది. ఇప్పుడాయన పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. ఇప్పుడు నా కర్తవ్య మేమిటో చెప్పండి సార్! ఇటు తల్లి పసుపుకుంకుమలు నిలబెట్టనా! రోగాలతో బాధ పడుతున్న నా భార్యను కాపాడుకోనా! చెప్పండి సార్! నా కర్తవ్యం ఏమిటి సార్? నేను దేనికోసం ఈ ఫీల్డ్‌లో ఎందుకు అడుగుపెట్టానో! ఆ డబ్బు కోసం ఫులులతో పోరాడాను మోటారు సైకిళ్ళతో గాలిలో తేలాను. మేడలని ఎగిరి దూకాను. నా కుటుంబాన్ని ఓ దారికి తీసుకురావాలనే గదా సార్ నా ప్రయత్న మంతా? ఇంత చేసి తల్లి పసుపుకుంకుమలను, భార్యాబిడ్డలను రక్షించుకోలేని నా కర్తవ్యమేమిటి సార్! దయచేసి మీరైనా చెప్పండి సార్!" అంటూ తల వంచుకున్నాడు. తలెత్తిన అతని కంటినిండా నీళ్ళు.

"భయపడకు మిస్టర్! సమస్యలన్నీ పరిష్కార మవుతాయి. నచ్చచెప్పను ప్రయత్నించాను.

"నా జీవితాన్ని మీ ముందు ఉంచాను సార్! పరిష్కారము మీరే చూపించాలి సార్!, కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"ఐ విల్ ట్రై మై లెవెల్ బెస్ట్. అపరేషనుకు మూడు వారాలు టైం ఉంటుందంటున్నారు గదా! వచ్చే అదివారం కనిపించండి, చూస్తాను."

"థాంక్యూ సార్" అంటూ భారంగా అడుగులు వేసుకుంటూ వెళుతున్న అతను కనుమరుగయ్యేవరకు చూశాను.

అదివారం

కిరణ్‌ను పోయిన వారమే రమ్మన్నాను. రెండు వారాలైనా రాలేదు. కిరణ్ గూర్చే ఆలోచిస్తున్నాను. షాట్ రెడీ అయ్యేటప్పటికి సెట్‌మీద కెళ్ళాను. అక్కడ మా యూనిట్ మేనేజరు ఎదురయ్యాడు. నెల రోజులు అవుట్‌డోర్ కని బొంబాయి వెళ్ళిన యూనిట్ మేనేజరును చూసేటప్పటికి ఆశ్చర్యమని పించింది.

"ఎప్పుడొచ్చారు? షూటింగ్ అయిపోయిందా?" అనడిగాను.

"మీకు తెలియదా సార్? మన యూనిట్ లైట్‌బోయ్ అదే సార్ డూప్ హీరో కిరణ్ మొన్న చనిపోయాడు సార్" అన్నాడు

నిశ్చేష్టుడనయ్యాను. "ఈజ్ ఇట్?" నమ్మలేనట్లుగా అడిగాను. "అవును సార్! మొన్న హోటల్ రిట్జ్ ఏడవ అంతస్తు పైన సుమంత్‌గారికి డూప్‌లో పాల్గొన్నాడు. ప్లాట్ మీద దూకటంలో జారిపడిపోయాడు."

మనసు భారమైంది తన కుటుంబానికి పరిష్కారం చూపకముందే తన జీవితానికే భగవంతుడు పరిష్కారం చూపించాడు. అతని ఆలోచనలతో ఇంటి కెళ్ళాను పి. ఎ. ఉత్తరాలు తెచ్చిపెట్టాడు.

"ప్రేమ ఉదయకిరణ్" చూడగానే గుండెలు అదరసాగాయి. ఆత్రుతగా చించాడు.

'సార్ బహుశా ఈ ఉత్తరం చదివేటప్పటికి నే నీ లోకంలో ఉండ నేమో! చనిపోయే ముందు మిమ్మల్ని ఒకసారి కలుసుకోందా మనుకున్నాను. కాని వీలుకాలేదు. చనిపోవాలని ఇదివరలో ఎన్నోసార్లు అనుకొన్నాను కాని నేను వెళితే నా కుటుంబం దిక్కులేని దవుతుందని భయపడ్డాను. నేను వుంటే ఉద్ధరించేదీ లేదు, లేకున్నా నా కుటుంబానికి ఒరిగేదీ లేదని ఆలశ్యంగా తెలుసు కొన్నందున ఇంతకాలం ఉన్నాననిపిస్తుంది. ఎంతో ఆలోచించి ఈ నిర్ణయాని కొచ్చాను. అందరనుకున్నట్లు జారిపడి మరణించటం కాదు. ఇది నా ప్రయత్నమే. ఒక షాట్‌కోసం మరణిస్తే కొన్ని ప్రతికలయినా హర్షిస్తాయి. నిర్మాతల నుండి, మీ యూనిట్‌నుండి కొంత డబ్బు నష్టపరిహారంగా అందుతుంది. అది నా కుటుంబానికి అందచెయ్యండి. నా మీద కొండంత బలం పెట్టుకున్న తల్లిదండ్రులు నా దౌర్బల్యం మూలంగా బలికాగూడదు. అందుకే ఆ బాధను భరించలేక ఈ నిర్ణయం తీసుకున్నాను. నా సమస్యకు ఇదే ముగింపు. అభాగ్యుడు 'ఉదయ్‌కిరణ్.

ఉత్తరం ముగించేసరికి నాకు తెలియకుండానే నా కళ్ళు చెమ్మగిల్లాయి.





# హలో!

ఎన్. తారకరామారావు

సుందరి స్టాఫ్‌రూంలోకి వెడుతుంటే హెడ్‌మిస్ట్రెస్ రమ్మందని కబు రొచ్చింది.

చేతిలో వున్న పుస్తకాలు, దప్తరూ, బీరువాలో పెట్టి, తాళంవేసి, వాష్‌బేసిన్‌లో చేతులు, మొహం కడుక్కుని, ఫ్లాస్కులో

కాఫీ త్రాగి నింపాదిగా వెళ్ళింది.

"త్వరగా రమ్మంటున్నారమ్మా" ఆయా మళ్ళీ వచ్చింది.

"ఎవరొచ్చారూ?"

"తెలియదమ్మా. ఎవరో కారులో వచ్చారు."

'ఎవరబ్బా!' అని మనసులో అనుకుని సుందరి హెడ్‌మిస్ట్రెస్ గదిలోకి వెళ్ళింది.

సిస్టర్ ఇగ్నాషియస్ ముందో వ్యక్తి కూర్చునున్నాడు, లుంగీ, లాల్చీ ధరించి.

"వీరు సుందరంగారు. నీ కోసం వచ్చారు."

సుందరం వేపు అయోమయంగా చూసి నమస్కారం చేసింది, సుందరి.

"నేను రాంబాబుగారి పి.ఏ. నమ్మా. వారు మిమ్మల్నోసారి తీసుకురమ్మన్నారు" సుందరం నిలబడి చేతులు కట్టుకు చెప్పాడు.

"రాంబాబు .... అంటే .... సినిమా హీరోనా" సిస్టర్ ఇగ్నాషియస్ కళ్ళింత చేసుకు అడిగింది సుందరాన్ని.

"అవు!" అని, సుందరం, "వెళ్దామా అమ్మా. వారు ఊర్వశిలో వున్నారు!" అన్నాడు.

సుందరి తలొంచుకుంది.

"వారు నీకు తెలుసా సుందరీ—అయితే నేనూ వస్తా పద వారిని మన స్కూలుకు ఆహ్వానిద్దాం." సిస్టర్ అంది.

"రాండి పోదాం!" సుందరం దారి తీశాడు.

"నే రాను!" అమాటనేసి, సుందరి అక్కణ్ణుంచి చకచకా వెళ్ళిపోయింది స్టాఫ్‌రూంలో, కుర్చీలో వాలిపోయింది.

రాంబాబు ఎందుకు కబురంపాడు? ... సుందరికి సమాధానం దొరకని ప్రశ్న.

"సుందరిగారూ! పెద్దవాళ్ళు కబురంపితే అలా రాను అనకూడదు. వారు నొచ్చుకుంటారు. పైగా వారిని చూడాలని పిల్లామేకా, పెద్దాచిన్నా పొద్దుణ్ణుంచీ, హోటల్ ముందూ, సినిమాహాలు దగ్గరా, పడిగాపుల పడుతున్నారు అలాంటిది ఆయనే స్వయంగా కారుపంపి రమ్మంటే పోకపోతే ఏం బావుంటుంది?" సిస్టర్ అన్నది.

సుందరి తలెత్తి చూసింది. సిస్టర్‌ను, ఆమె వెనుకగా నిలబడ్డ మరికొందరు సహాధ్యాయులనూ. అంటే ఈ సరికే ప్రముఖ సినిమా హీరో రాంబాబు, సుందరి టీచరుకోసం కారు, కబురు పంపాడని తెలిసిపోయిందన్నమాట!

"చూడు సిస్టర్, రాంబాబు పొరపడి వుంటాడు, నాకాయన తెలియదు. ఏ సుందరి అనుకుని నాకు కబురెట్టారో! ఆయనకు చాలామంది సుందరీమణులు తెలిసుండొచ్చు."

"అయినా పోయొద్దాం. ఇందులో నష్టమేముంది! కారుందిగదా!"

"నే రాను" మొండిగా సమాధానమిచ్చింది సుందరి.




"ఒకేఒక్కసారి.... మళ్ళీ రాత్రికి మెయిల్లో అయ్యగారు వెళ్ళిపోతారు!" సుందరం చెప్పాడు. "అసలు అయ్యగారే వద్దామనుకున్నారు. కానీ ఫిలిం శతదినోత్సవం గదా!"

"అవునవును!" సిస్టర్ వంతపలికింది.

సుందరికి ఏం చెయ్యాలో క్షణం తోచలేదు. అ సరికే, స్టాఫ్‌రూం దగ్గర పిల్లలు కూడ పోగయ్యారు. మెరుపులా లేచి,హ్యాండ్ బాగ్ తీసుకుని, కాంపౌండ్ దాటి, రిక్షా బేరం అడక్కుండా ఎక్కి "పోనియ్యి పట్టాభిపురం" అంది అప్పటికిగానీ ఆమె గుండెదడ తగ్గలేదు.

రిక్షావాడు ముసలివా . తాపీగా త్రొక్కుతున్నాడు. అలా అనిపించింది సుందరికి. కానీ అంతలోనే జాలివేసింది. పాపం! అతని కెన్ని కష్టాలో! పిల్లలు ఎక్కువే అయుండొచ్చు! పూట గడవని బ్రతుకు అయ్యుంటుంది! అందుకే ఈ వయస్సులో....

తనెందుకు ఉద్యోగం చేస్తున్నది!

సుందరి మనస్సులో ప్రశ్నలు తరంగాల్లా ఉవ్వెత్తున లేచాయి.

'ఖర్మ' అనుకుంటే!

పెళ్ళిలో అందరూ, సుందరిని అదృష్టవంతురాలని అన్నారు. సుందరీ అలానే అనుకుంది. తొలిసారి కాపురానికి వెళ్ళినప్పుడు తనెంతో అదృష్టవంతురాలు అని సుందరి నమ్మింది అత్తమామలు, భర్త, అంతా అపురూపంగా చూసుకున్నారు. కలల బరువు, కాపురంలో మాధుర్యమూ అనుభవించే వేళలో నెల తప్పింది. అటు

కన్నవారూ, ఇటు కట్టుకున్నవారూ మరీ మురిపెంగా చూశారు. ఏడో నెలలో పుట్టింటికి తీసుకొచ్చారు చీరె, సారే పెట్టి! అంతే!

"ఏ ఊరి అమ్మా!" రిక్షావాడు ఆపి ప్రశ్నించాడు.

"అదిగో ఆ సందులో పెంకుటింటి దగ్గర ఆపు!"

కంకరరోడ్డు మీద రిక్షావాడు చిన్నగా నడుస్తూ లాక్కెళ్ళాడు. ఇంటిముందు దిగింది. రిక్షావాడికి డబ్బిచ్చి పంపేసి, తలుపు తాళంతీసుకుని లోపలి కెళ్ళింది. బల్లమీద చీటీ.

"మమ్మీ.

ఇవాళ మాకాలేజీకి హీరో రాంబాబుగా రొస్తున్నారు. పంక్షనుంది. నే రావడం ఆలస్యమౌతుంది.

గ్యాస్ తెచ్చా! రేషన్‌షాపులో పంచ దార లేదుట.

రమణ"

"ఓరిదేవుడా. ఈ రాంబాబు ఇంట్లోకి కూడా వచ్చాడే!" అనుకుంది సుందరి.

ఏమీ తోచక, ఏమి పనిచెయ్యా లనిపించక, వాలుకుర్చీలో జారగిలబడ్డది.

గోడమీద నాలుగైదు పటాలు. అందులో హీరో రాంబాబు కూడ ఉన్నాడు.

"ఆ సినిమాబొమ్మ లెందుకూ!" అంటే "ఉండనీవే! ఆయన నా అభిమాన హీరో" అని రమణ తియ్యనివ్వలేదు.

ఆ హీరో ప్రక్క ఫొటో....సుందరి కాలేజీలో తీయించుకుంది. సుందరి కాక మరి నలుగురున్నారు. ముందు కుర్చీల్లో రమ, ఉష, గాయత్రి. వెనుక నుంచు న్నది సుందరీ,భారతి. ఆ ఫోటో కోసమని సుందరి పట్టుచీర అమ్మది కట్టుకుంది. మిగతా స్నేహితురాళ్ళంతా లంగా ఓణీలె. కాకపోతే భారతి మాత్రం నూలు చీర కట్టుకుంది. మిగతా ఫోటోల్లో రమణ కొయ్యగుర్రంతో నిలుచుని తీయించుకుంది. వెధవ అనాదే గుర్రం చెవుపట్టుకుని హీరోలా నిలబడ్డాడు.

అలా గోడమీద ఫోటోలు, క్యాలెం డర్లు చూస్తూ అలసట, నీరసం, ఆలో చనతో మగతగా పడుకుంది.

మగత నిద్రలో ఎన్నో కలలు.... కొన్ని రంగురంగుల కలలు కొన్ని సాదా కలలు__మరికొన్ని పీడకలలు.

తొలిచూలు మగపిల్లవాడు బొద్దుగా ఎర్రగా వున్నాడు. వళ్ళో పడుకోబెట్టుకుని స్తన్యం ఇస్తుంటే, స్వర్గధామంలో తేలు తున్న అనుభూతి. ప్రక్కలో పడుకో బెట్టుకుని, నిద్రలో బాబు కాలితో తన్ను తున్నా, గుప్పిట మూసుకుని, నిద్రలో నవ్వుతున్నా చూడటం ఏదో ఆనందం!

బారసాలరోజు, భర్త రాలేదు. గ్రీటింగ్స్ మాత్రం పంపాడు. భర్త ఊహలు, ఆలోచనలు సుందరికి తెలుసు. అందుకే తల్లీ తండ్రీ, అత్తమామల మాటలు కాదని, కొడుక్కి వెంకట రమణమూర్తి అని పేరు నిర్ణయించింది.

బాబు పెరుగుతున్నాడు. బోర్లపడటం, [illegible], తప్పటడుగులు వేయడం అన్నీ సుందరికే స్వంతమైనాయి.

ఏడీ భర్త?

అడపా దపా, [illegible]రావడం, లేదా, ఏదో [illegible] వార్త. అంతే

సుందరికి [illegible]మైంది. భర్తకు త[illegible]లేదా? దంపతులైన తొలి రోజుల్లో చెప్పుకున్న గుసగుసలు, ఆశలు అన్నీ ఆయన మర్చిపోయ్యాడా?

[illegible] భర్తకు ఉత్తరం వ్రాసింది జవాబు లేదు. గుండె రాయిచేసుకుని [illegible] బయలుదేరింది. భర్త స్టేషన్[illegible]. వెతుక్కుంటూ భర్త దగ్గరకు [illegible]. ఆయన ఇంట్లో లేడు. [illegible]

ఎవరండీ మీరు?"

సుందరికి తల కొట్టేసినట్లయింది. తన భర్తయింట్లో తనెవరో చెప్పుకోవాల్సి వచ్చినందుకు

"తెలిసినవాళ్ళమే" అంది. గుండెల్లోంచి వచ్చే దుఃఖాన్ని, అసహాయతను ఆపుకుంటూ.

మూడేళ్ళ బాబూ. తను ఏంచెయ్యాలి?

"అయ్యగారెప్పుడొస్తారు?"

"ఆఫీస్ టూర్ కెళ్ళారు కాశ్మీర్‌కు. యింకో వారందాకా రారు!"

నీరసం నిస్సహాయత ఆవరించాయి. దిగాలుపడి కూర్చుంటే సుందరి, పి. ఏ. దయదల్చాడు.

"సాయంత్రం అమ్మగారొస్తారు. వారిని కలవండి. మీ కేదన్నా సహాయం చేస్తారు!"

సుందరి ఆశ్చర్యపోయింది. తనను బిచ్చగత్తెగా చూసినందుకు, [illegible] మరో 'అమ్మ' ఎవరు?

"మీకు తెలియదులెమ్మా. అయ్యగారు అసలు భార్యను వదిలేసి, సినీతార ప్రేమకుమారిని వివాహం [illegible]రు.... ఆవిడ స్టూడియో కెళ్ళారు. సాయంత్రం వస్తారు!"

తన ఉత్తరాలు చేరలేదా?

భర్త తనను వదిలేశాడా?

భవిష్యత్తు అంధకారమేనా?

బాబు పాలరాతి గచ్చుమీదపడి ఆడుకుంటున్నాడు. సూన్యమైన భవిష్యత్తుని ఊహించుకుంటూ సుందరి దిగాలుగా కూర్చుంది.

సాయంత్రం దీపాలు పెట్టాక ప్రేమకుమారి వచ్చింది. సుందరిని చూసింది. చూసి "ఏంకావాలి?" అని అడిగింది యధాలాపంగా.

సుందరి మాట్లాడలేదు. అలా వారం గడిపింది పి. ఏ. వచ్చి ఏంకావాలో అడిగి వెడుతుండేవాడు. ప్రేమకుమారి ఏ అర్ధరాత్రో వచ్చి వెడుతుండేది.

నిద్రలేకుండా భవిష్యత్తుని తల్చుకుంటూ, రాంబాబుకోసం ఎదురుచూసింది సుందరి.

రాంబాబు వచ్చాడు. సుందరిని చూశాడు. "ఎప్పుడొచ్చావు! ఏం ఇబ్బంది లేకుండా ఉందిగదా! ఏం కావాలన్నా పి.ఏ.ని అడుగు!" అన్నాడు.

అంతే!

ఆ తర్వాత నెల వుండి సుందరి రాంబాబుకు తీరికలేదు - సుందరిని పలకరించ లేదు.

ఇలా ఎన్నాళ్ళు?

తిండికి మొహంవాచి వచ్చిందా! లేక భర్త దగ్గరున్నానన్న సంతృప్తికోసం వచ్చిందా! తెల్చుకోలేకపోయింది సుందరి.

అదే ప్రశ్న ఓ రోజు రాంబాబును అడిగింది

రాంబాబు అప్పుడే అంత అర్ధరాత్రి దాటాక వచ్చాడు. రంగు మొహంమీద అలాగే వుంది. అలసటలో బెడ్ మీద వాలిపోయ్యాడు. ప్రక్కన ప్రేమకుమారి మళ్ళీ తెల్లారితే రాంబాబు వెళ్ళిపోతాడు. అందుకే చొరవతీసుకుని లోపలకు వెళ్ళింది

"ఏం కావాలి?"

"మీతో మాట్లాడాలి!"

"అర్జంటా!"

"ఊఁ ఏకాంతంగా మాట్లాడాలి."

బద్ధకంగా లేచి వరండాలోకొచ్చాడు. సిగరెట్ ముట్టించుకుని, కాళ్ళు పోర్టికో గోడను తన్నిపట్టి, "త్వరగా చెప్పు!" అన్నాడు. ఆ అనటంలో విసుగు వుంది.

"నా సంగతేం తేల్చారు?"

"తేల్చడాని కేముంది!" యిప్పుడు నీకేం కష్టమొచ్చింది నీ కేంకావాలన్నా చూడమని పి. ఏ.కి చెప్పాను. ఇక్కడ వుండటం ఇష్టంలేకపోతే వేరే ఇల్లు తీసుకుంటాను. అక్కడ వుండు!"

సుందరికి నోరు పెగల్లేదు. రాంబాబు లేచివెళ్ళి తలుపేసుకున్నాడు

సుందరికి ఏం చెయ్యాలో తోచలేదు. డబ్బు మేడలు, కారు అన్నీ పుష్కలంగా వున్నాయి రాంబాబు వాటికి కానేం డకు బ్రతికేందుకు రక్షణ ఇస్తాడు, తాళి కట్టినందుకు. కానీ, ఆయన భార్యగా... ఆయన కష్టసుఖాల్లో భాగం పంచుకునేందుకు తనకు అవకాశం లేదు! పంజరంలో బ్రతుకు గడపాలి సంవత్సరాల తరబడి, ఆయనకోసం ఆయని పిలుపు కోసం, చకోరపక్షిలా వేచి ఉండాలి!

సుందరి వచ్చేసింది

తను కోరుకున్న జీవితం ఇది గాదు. అందుకే బంధువుల్ని, మిత్రుల్ని అందర్నీ వదులుకుని వాళ్ళ సానుభూతి, అనునయం అందనంత దూరంగా వచ్చి జీవిస్తున్నది

బయట కారు ఆపిన శబ్దానికి కలలు చెదిరాయి సుందరికి. మగత వదిలిపోయి లేచి తలుపు తెరిచింది.

ఎదురుగా రాంబాబు!

ప్రక్కన రమణ!

"మమ్మీ అలా వున్నావేం! ఈయన రాంబాబుగారే! కావాలని మనింటికి వచ్చారు "

రమణ ఎంతో ఉత్సాహంగా సుందరిని

నెట్టుకుని లోపలకెళ్ళి కుర్చీలు సర్ది "రాండి సార్" అన్నాడు

రాంబాబు వచ్చి కూర్చున్నాడు. సుందరి వంటగదిలో కెళ్ళింది.

క్షణాలు, నిముషాలు గడిచాయి. సుందరి గడపకానుకుని శూన్యంలోకి చూస్తూ కూర్చుంది ఈయన ఎందు కొచ్చాడు? తన బ్రతుకు ఏం కాబో తున్నది? అని ఆలోచిస్తూ.

"అమ్మా! ఆయన పిలుస్తున్నారే! రా!"

సుందరి వెళ్ళింది. రమణ చాల విచిత్రంగా ఇద్దరినీ చూస్తూ నిలబడ్డాడు.

"రమణా! మీ అమ్మతో కొంచెం మాట్లాడాలి. నీ కభ్యంతరమా?"

"లేదండి!"

"అయితే కొంచెంసేపు బయటకు వెళ్ళు!"

రమణ బయటకు వెళ్ళాడు.

## 2

రమణ మళ్ళీ ఇంటికొచ్చేప్పటికి బయట కారు లేదు. సుందరి మాత్రమే వుంది!

"మమ్మీ! ఆయన వెళ్ళిపోయ్యారా?"

"ఊఁ!"

"రాంబాబుగారు మద్రాసు రమ్మన్నారే నన్ను హీరోగా చేస్తారట."

"అహాఁ!"

"పరీక్షలవగానే వెళ్ళిపోతానే!"

సుందరి మాట్లాడలేదు

"ఏమంటావమ్మా! అంతటి హీరో పిల్చి, పైకితీసుకొస్తానంటే. .అదృష్టమే గదమ్మా!"

సుందరి కళ్ళు నీళ్ళతో నిండిపో యాయి. కొడుకువేపు జాలిగా, దీనంగా, చూసింది.

"రమణా! రాంబాబుగారు నీ కన్న తండ్రి! ఆ సంగతి తెలుసా?"

రమణ ఆశ్చర్యపోయాడు.

"నీకు రెక్కలొచ్చాయి నీ యిష్టం. వెడితే వెళ్ళు! కానీ నీకు కొన్ని విష యాలు చెప్పాలి. అది నా ధర్మం! విన్నాక నీ యిష్టం! ఆయన నిజంగా హీరోనే! కానీ నాకు మాత్రం దొంగ. నా జీవిత మాధుర్యాన్ని దొంగిలించారు. ఇప్పుడు నా కొడుకుని దొంగిలించబోతు న్నాడు!" సుందరి లేచివెళ్ళి మొహం కడుక్కుంది. చెరిగిన జుత్తు సరిచేసు కుంది. బొట్టు పెట్టుకుంది.

ఆమె గదిలోకి వచ్చేసరికి, రమణ రాంబాబు ఫోటోతీసి అటకమీద విసిరే స్తున్నాడు.



# సీరియల్
# సౌందర్యదీపం
## ఆర్. సంధ్యారాణి

(గత సంచిక తరువాయి)

**53**

కృష్ణమౌళి నవ్వాడు.

ఆ నవ్వు ఎంతో అందంగా పున్నమి నాటి చంద్రుడు వెన్నెలలు వెదజల్లినంత హాయిగా అందంగా నల్లగా అనిపిస్తుంది ఎవ్వరికి అయినా, ఏ కన్నె మనసుకి అయినా.

కాని ఇంద్రసేనకు ఆ నవ్వు కంపరంగా ఏమిటోగా అనిపించసాగింది.

"మీరా! మీరు .. " అంది తడబడుతూ.

"ఆ నేనే" హుందాగా నడుంమీద రెండుచేతులు ఆనించుకుంటూ అన్నాడు.

"మీరు మీరు ఇక్కడికి ఎలా వచ్చారు!" ఆమె కంఠస్వరం అదోలా పలికింది.

యింట్లో ఎవరూ లేరు తను ఒక్కర్తే ఉంది.

ఒంటరిగా ఉందని అతను ఏమైనా చేస్తే!

ఆమె మనసులో భయపడసాగింది.

గుండెలు దడదడలాడసాగాయి.

అతన్నిప్పుడు తప్పించుకోవటం ఎలా!

ఆమె మనసు గడుసు ఉపాయాల కోసం ఆలోచిస్తోంది.

ఇంద్రసేన ప్రశ్నకు అతను నవ్వాడు.

"ఎలా వచ్చానా! ఎగిరి వచ్చాను" అన్నాడు.

అతని కంఠస్వరంలో వెటకారం రవ్వంత ఉన్నా కళ్ళల్లో మాత్రం కొంటెతనం దోబూచులాడుతుంది.

ఆమెకు ఒళ్ళు మండిపోయింది.

మరో టైములో అయితే నాగుపాము కాటువేసినట్టుగా ఎగిరి అతని చెంప ఛెళ్ళు మనిపించేది. కాని ... తను ఒక్కర్తే ఉన్నానన్న భయం లేకపోతే. ఒక్క క్షణం అలానే రెప్పవాల్చకుండా అతని వైపే చూడసాగింది.

అతను అలానే చూశాడు క్షణంసేపు.

"నువ్వు అంటే నాకు ఎంత అసహ్యమో తెలుసా!" అన్నట్టున్నాయి ఆమె చూపుల్లో అర్థం.

"నువ్వు అంటే నాకు ఎంత ఇష్టమో తెలుసా!" అన్నట్టున్నాయి అతని చూపులు.

"నిన్ను ఈ చెంపా ఆ చెంపా వాయి చెయాలన్నంత కోపం, కసి ముంచుకువస్తున్నాయి తెలుసా!" అన్నట్టు చూసింది.

"నువ్వు అంటే నాకు ఎంత ముద్దో తెలుసా!నిన్ను దగ్గరకు లాక్కుని గుండెలకు అదుముకుని నిన్ను ముద్దులతో ముంచెయ్యా లనిపిస్తుంది తెలుసా!" అన్నట్టుగా ఉన్నాయి అతని చూపులు.

"అందుకే నువ్వు అంటే నాకు ఒళ్ళు మండిపోతుంది. అసంగతి నీకు తెలుసా!" అన్నట్టు చూసి ముఖం తిప్పుకుంది.

అతను చిన్నగా నవ్వాడు.

ఒక్క అడుగు మెల్లగా వేస్తూ ఆమె మంచందగ్గరగా వచ్చాడు.

తల తిప్పి బెదిరినట్టుగా చూసింది. అతని వైపు.

"ఎందుకా భయం!" అడిగాడు.

ఆమె మాట్లాడలేదు.

కృష్ణమౌళి ఆమె బుజంమీద చేతులు వేసి గట్టిగా పట్టుకున్నాడు.

"ఏమిటిది! ముందు చేతులు తియ్యండి" కోపంగా విసరుగా అతని చేతులు తోసేయబోయింది.

కాని అతను వదలిపెట్టలేదు!

"నా చేతుల్లోంచి ఎలా తప్పించుకుంటావు!" అన్నట్టు మరింత పట్టుదల పెరిగిపోయింది అతనిలో.

ఇంద్రసేన కోపంగా లేస్తూ అతని పట్టు విడిపించుకోవడానికి చూసింది

"మర్యాదగా వదలండి" అంది ఆవేశంగా.

"వదలకపోతే!" రెట్టిస్తూ కోపంగా అడిగాడు.

"చంపేస్తాను" అంది పళ్ళు బిగించి కళ్ళెర్రజేసి చూస్తూ.

"ఆహా" అన్నాడు. అతని కనుబొమ్మలు ఆశ్చర్యంతో కుతూహలంగా పైకి లేచాయి.

"పిచ్చి పిచ్చి వేషాలు మానేసి మర్యాదగా బయటకు నడవండి" అంది చేత్తో బయటకు దారిచూపిస్తూ.

"నన్ను అజ్ఞాపిస్తున్నావా!" అంటు ఆమెను విసురుగా దగ్గరకు లాక్కున్నాడు.

అతను లాగిన విసురుకి వెళ్ళి అతని గుండెలమీద పడింది.

అతను నవ్వి రెండు చేతులతో ఆమెను చుట్టేసి దగ్గరకు లాక్కున్నాడు.

"వదలండి ఏమిటిది! ఎవరూ లేరని ఇంత ధైర్యం చేస్తారా! నా దగ్గర మీ ఆటలు సాగవు చంపేస్తాను. ముందు బయటకుపోతారా పోరా!" అంటూ అరిచింది.

"నేను ఏం పరాయివాడ్ని కాదు" సూటిగా చూశాడు అమె కళ్ళల్లోకి.

'మరి!' అన్నట్టు కళ్ళు విప్పార్చి ఆశ్చ

తంగ్యగా చూసింది,

"నేను నీ కాబోయే భర్తని. పరాయి వాడ్ని అని భయపడటం అనవసరం నువ్వు నా దానివి. నేను నీ వాడ్ని"

"గాలిలో మేడలు కట్టకండి" అంది అతని చేతుల్లోంచి బయటపడటానికి గింజు కుంటూ.

"అంటే!" నుదురు చిట్లించి అడిగాడు.

"అంతస్తుల విషయం మర్చిపోతు న్నారు" రోషంగా అంది.

"అంతస్తుల విషయం గుర్తు తెచ్చు కుంటే నాదగ్గర నా డబ్బుదగ్గర మీరు ఏంకారు."

"మీరు అనుకుని అలా గర్వపడు తున్నారు. మీది నడమంత్రపు సిరి."

"మీది, మీ నాన్నది!" వెటకారంగా చూశాడు.

ఇంద్రసేన కోపంగా చూసింది

"ఒక్కసారి నువ్వు, నీ తండ్రి వెను తిరిగి చూసుకోండి. బ్రతికి చెడి మళ్ళా పుంజుకున్నవాడ్ని నేను. అందర్నీ కాకాపట్టి చేతులు నులుపుకుంటూ అందరి కాళ్ళ క్రిందాగోతులుతవ్వి వాళ్ళని అధః పాతాళానికి తొక్కేసి పుంజుకుని పైకి వచ్చిన మహానుభావుడు నీ తండ్రి. నడమంత్రపుసిరి నీదా! నాదా!" అన్నాడు కోపంగా.

అతని కళ్ళుచింతనిప్పుల్లా అయ్యాయి.

"మా సంగతి మీకు ఏం తెలుసు!" రోషంగా అడిగింది.

"తెలుసు గనుకనే చెప్తున్నాను కటువుగా చెప్పాడు

"తెలుసు" కోపంగా ప్రతి అక్షర[illegible] నొక్కి పలుకుతూ "ఏం తెలుసు? ఒకర[illegible] అయిశ్వర్యంతో ఉన్నారని లేనిపో[illegible] కబుర్లుచెప్పి ఈర్ష్యతో బుకాయించకండి.

"ఎవరికి ఈర్ష్య!" ఖండించి అడిగాడ[illegible]

"మీదే ఈర్ష్య కాకపోతే!" హేళ[illegible] ధ్వనించింది ఆమె కంఠస్వరంలో.

"ఈర్ష్య నీది మీనాన్నది. మీ బ్రతుక[illegible] ఏమిటో గడిచిన రోజులు ఏమిటో నా[illegible] తెలుసు"

"కృష్ణమాళీ!" గట్టిగా అరిచింది.

"ఇంకా గట్టిగాఅరు. ఇల్లు అదిరిపోర[illegible] టట్టు అరు భూమి బ్రద్దలయినట్టు అర[illegible] అరిచి, అరిచి నీకే పిచ్చెక్కిపోతుంద[illegible] ఆ పిచ్చిలో నిజం కక్కేస్తారు" అన్నా[illegible] కోపంగా.

"నా యింట్లో ప్రవేశించి న నే[illegible] అంటారా? మీ పని చెప్తాను. అడది అం[illegible] అబల కాదు" అంటూ చెయ్యి పైకిఎ[illegible] కొట్టబోయింది

అతను ఆచేతిని గట్టిగా పట్టుకున్నాడ[illegible]

అతని కళ్ళల్లో కోపం, కసి, కక్ష వె[illegible] రేగసాగాయి.

రెండో చెయ్యి పైకి ఎత్తింది.

ఆ చేతినీ గట్టిగా పట్టుకున్నాడు.

ఆమె బలం అంతా ఉపయోగిం ఒక్క తోపు తోసింది.




అతను క్షణంసేపు అలా నిలబడిచూసి చప్పున ఆమె చెయ్యి అందుకుని దగ్గరకు లాక్కున్నాడు.

"ఛీఛీ మర్యాద లేకుండా " అంటూ అతని చెంప వాయించడానికి ప్రయత్నించింది.

అందుకు అతను అవకాశమివ్వలేదు.

దగ్గరకు ఇంకా దగ్గరకు ఆమెను లాక్కున్నాడు.

అంతే

ఇద్దరు క్షణంసేపు అలా ఉండిపోయారు.

ఇద్దరికి ఆ సమయంలో ప్రపంచం ఒక్కసారి ఆగిపోయినట్టు అయింది

ఇంద్రసేనకి తను ఎక్కడ ఉందో ఏమిటో గ్రహించుకునే స్థితిలో లేదు.

మనసు మొద్దుబారిపోయింది.

శరీరం అంతా ఎలాగో అయిపోయింది

ఒంట్లో శక్తి అంతా హరించుకుపోయినట్టు అయింది.

కళ్ళు అప్పగించి అతనివైపు అలాగే రెప్పవాల్చకుండా అయోమయంగా మతిపోయినట్టు చూడసాగింది.

కృష్ణమౌళి నవ్వాడు.

ఇంద్రసేన రోషంగా ముఖం తిప్పుకుంది.

అతని చేతుల్లో బొమ్మల్లా మాటా పలుకు లేకుండా అలాగే ఉండిపోయింది.

అతను అపురూపంగా ఆమె చెంపలు నిమిరాడు.

ఆమె అతనివైపు చూడ్లేదు

"పురుషుడు పురుషుడితో కలబడి కొట్టొచ్చు. స్త్రీ స్త్రీతో కలబడి కొట్టొచ్చు కాని " అంటూ మళ్ళీ నవ్వాడు.

"పురుషుడితో స్త్రీ కలబడితే అది ఒక అపురూపం తియ్యని భావం అయి మనసు దగ్గరవుతుంది" అన్నాడు.

ఆమె మాట్లాడలేదు

ఇంద్రసేనకు దుఃఖం ముంచుకు వచ్చేస్తుంది. కళ్ళల్లో నీళ్ళు అతను గాని చూస్తే!

తనని ఇంకా లోకువచేసి చులకన చేస్తాడు. అందుకే వస్తున్న దుఃఖాన్ని గుండెల్లోనే దాచుకుంది

కృష్ణమౌళి మెల్లగా ఆమెను వదిలే శాడు.

చూపుడువేలు చూపిస్తూ అన్నాడు.

"ఈ క్షణం నీ గుండెల్లో, మెత్తగా, మత్తుగా, తియ్యగా, మధురంగా, హాయిగా ఆనందంగా, పాలపొంగులా హత్తుకు పోయి ఉంటుంది. నీవు ఈ క్షణాన్ని మర్చిపోవాలన్నా మర్చిపోలేవు. ఈ క్షణం నీ మదిలో మెదులుతూ అనుక్షణం నీకు గుర్తుచేస్తూనే ఉంటుంది," అంటూ ఆగి అన్నాడు.

"ఈ క్షణంనుండీ నీ మనసు నా గురించి ఆలోచిస్తుంది. నీ మనసు నన్ను గుండెల్లో దాచుకుంటుంది. నీ మనసు నా మనసుతో కలిసిపోవాలని కలలు కంటుంది. ఆ కలలు నిజం కావాలని మనసారా అనుకుంటుంది ఆ మార్పు నీలో వచ్చి తీరుతుంది." అన్నాడు.

ఇంద్రసేన మాట్లాడలేదు. అతని వైపు చూడ్లేదు.

"మీ వదినగారు అంటిక నన్ను అదిం చాలని చూస్తుంది. జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తుంది ఎంత ధైర్యం! ఆమెనే జాగ్రత్తగా ఉండమని చెప్పు. నేను తల్చు కున్నాను అంటే మిమ్మల్ని అందర్నీ ఈ బంగళాతోసహా పెళ్ళగించి అవతలకి విసిరేయగలను, జాగ్రత్త" అన్నాడు మహా కోపంగా.

ఏమనాలా! అన్నట్టు విసురుగా తల తిప్పి గిర్రున చూసి ది ఇంద్రసేన.

కాని అతనివైపు చూశాక మాట రాలేదు ముఖ్యంగా ఆమె జడవడానికి కారణం తను ఒంటరిగా ఉండటంవలనే.

అందుకే ఆమె మౌనం వహించింది.

మనసులో తన్నుకు వస్తున్న కోపాన్ని దుఃఖాన్ని బలవంతంగా మింగు కోసాగింది.

"నేను వస్తా" అంటూ ఒక్క అడుగు ముందుకేసి ఆగి తలతిప్పి వెనక్కు చూసి చెయ్యిచాపి ఆమె భుజంమీదకేసి చిన్నగా నవ్వాడు

ఆ నవ్వు ఈసారి అందంగా పున్నమినాటి వెన్నెల వెదజల్లినట్టుగా లేదు.

ఆ నవ్వు పట్టుపుగా పంతమే నా ధ్యేయం అన్నట్టు కోపంగా కసిగా, కక్షగా ఉంది.

ఇంద్రసేన తలతిప్పకుండా కళ్ళు మాత్రమే తిప్పి అతనివైపు చూసింది.

"నీవు ఐశ్వర్య గర్వంతో ఎంత విర్రవీగినా నువ్వు నన్ను ఎంత పరాయి వాడిగా చూసినా నువ్వు ఏదో ఒకరోజు నా వద్దకు నిరుపేదలా అన్నీ ఉన్నా ఏమీ లేనిదానిలా పరుగెత్తుకు వస్తావు. ఆ మాట మాత్రం నిజం."

"అది నా కంఠంలో ప్రాణంఉండగా జరగదు," అంది ఆవేశంగా.

"అలా జరగని మరుక్షణం నిన్ను ఎగరేసుకువెళ్ళి నీ మెడలో బలవంతంగా తాళికట్టి నిన్ను నా అర్ధాంగిని చేసుకుంటాను" కచ్చితంగా అన్నాడు.

"మీకు అంత ధైర్యం వచ్చినప్పుడు చూద్దాంలెండి. మీరు ఇకదయచెయ్యండి" అంది కాస్త కోపంగా

"వెళ్తాను. నువ్వు ఉండమని నాకాళ్ళు పట్టి బ్రతిమాలినా ఉండను. నువ్వే నాకాళ్ళు పట్టి బ్రతిమాలే రోజు వస్తుంది. వచ్చి తీర్తుంది." అన్నాడు

ఇంద్రసేన నిర్లక్ష్యంగా తల తిప్పుకుంది.

"వెళ్తున్నాను ఈ క్షణం నీకు గుర్తుండేలా చేసి మరీ వెళ్తున్నాను. ముందు మనం గడపబోయే దాంపత్య జీవితానికి ఇది పునాదిరాళ్ళుగా వేసి వెళ్తున్నాను. ఈ క్షణాన్ని గుర్తు ఉంచుకో" అంటూ విసురుగా తలుపు తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళినవైపే బొమ్మలా నిలబడిపోయింది.

అతను ఇక్కడికి ఎలా వచ్చాడు?

లోపలకు ఎలా రాగలిగాడు?

ఒంటరిగా ఉన్నానని తెలిసి మరీ చులకనచేస్తూ మాట్లాడేడు.

ఎంత ధైర్యం? తనని ఎన్ని మాటలు అన్నాడు?

ఇంద్రసేనకు దుఃఖం ముంచుకు వచ్చింది.

పురుషునితో కలబడితే అన్న నిజాన్ని మధురక్షణంగా మార్చి వెళ్ళాడు.

మధురక్షణం అనుకున్న అతను ఆ క్షణాన్ని నామరూపాలు లేకుండా చెయ్యాలి.

అది మధుర క్షణమా?

తన గుండెల్లో నిలిచిపోయి హత్తుకుపోయే క్షణమా?

మనసులో అసహ్యించుకుంది.

మంచం మీద కూలబడుతూ కళ్ళు గట్టిగా మూసుకుంది.

అదే క్షణం కళ్ళ ముందు కదలసాగింది

ఆమె గుండెలు దడదడలాడిపోసాగాయి.

అతని గుండెలకు తను ఎంత దగ్గరయింది.

ఆ క్షణాన్ని ఆధారంచేసుకుని అతను ఎంత ధైర్యం చేశాడు.

ఆ క్షణం ఏమిటోగా అయిపోయింది.

ప్రేమ అనురాగం అంటే తెలియని తను ఆ క్షణంలో ఏమయిపోయిందో ఏమిటో చెప్పటం కష్టం

ఆ క్షణం రోజురోజుకి పెద్దది అయి తన గుండెల్లో పర్వతంలా తిష్టవేసు కుంటే!

ఇంద్రసేన గుండెలు భయంతో గుబ గుబ లాడాయి.

తన తండ్రి, అన్నయ్య, వదిన, తల్లి అందరూ తన పెళ్ళివిషయంలో ఎన్ని ఆశలు పెట్టుకున్నారు

విద్యావంతుడు, అయిశ్వర్యవంతుడు, గుణవంతుడు, అందగాడు అయిఉండాలి అవి ఎన్ని అనుకుంటున్నారు.

వాళ్ళ ఆశలని మసిచేసి తమ యింట్లో పనివాడిగా ఉన్న కృష్ణమౌళిని తను పెళ్ళి చేసుకుంటుందా!

అది ఈ జన్మలో జరగని పని

కాని . . కాని . అతను బాగా పంతం పట్టి ఉన్నాడు. బలవంతంగా లాక్కు వెళ్ళి పెళ్ళిచేసేసుకుంటే

ఆమెకు భయంతో మొత్తం చెమటలు పోసేశాయి.

వెంటనే తనకు తాను ధైర్యం తెచ్చు కుంది.

అన్నయ్య తన పక్కన ఉండగా అతను చుట్టుపక్కలకి రాడు. రాలేడు.

వదిన కూడా జాగ్రత్త పడుతుంది తన విషయంలో.

ఆమె చెప్పిన సంబంధం ఏదో చేసేసు కుంటే అతని మాటే ఉండదు. తన ప్రాణం హాయిగా ఉంటుంది.

ఇంద్రసేన ఆలోచిస్తూ అలా ఉండి పోయింది.

ఎంత వద్దనుకున్నా అవే ఆలోచనలు.

అప్పుడే అంబిక హాస్పటల్ నుండి యింటికి వచ్చింది.

వస్తూనే ఇందూ ఏం చేస్తుందో! ఒక్కర్తే ఉందని ఆమె గదిలోకి వచ్చింది

"ఇందూ ఏం చేస్తున్నావమ్మా" అంటూ తల తిప్పి వదినవైపు చూసింది.

"ఇందూ అలా పడుకున్నావేం!" అంటూ దగ్గరకు వచ్చింది

ఆమె వైపుచూసి తిరిగి తల తిప్పేసు కుంది.

ఇంద్రసేనకు దుఃఖం ఆగటంలేదు.

"ఏమిటమ్మా అలా పడుకున్నావ్!" మంచం మీద కూర్చుంటూ తలపై చెయ్యి వేసి నిమిరింది.

అంతే ఆమెకు దుఃఖం ఆగలేదు

వదినను పట్టుకుని "వదినా!" అంటూ బావురుమంటూ ఏడ్చేసింది.

"అరే ఏమిటిది! ఏమైంది!" అంబిక కంగారుగా అడిగింది.

ఇందు వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"ఇందూ! ఇందూ! ఏం జరిగింది!

నిన్ను ఎవరైనా ఏమన్నా అన్నారా? చెప్పమ్మా!"

"అరే అలా ఏడుస్తావేమిటి!"

"నువ్వు ఏం చెప్పకపోతే నాకు ఏం తెలుస్తుంది!"

"వదినా " ఆమెకు మాట రావటం లేదు.

"ఏమిటమ్మా !" బుజ్జగిస్తున్నట్టుగా అడిగింది.

"మరి మరి " ఆమె వెక్కిళ్ళ మధ్య అంది.

అంబిక కనుబొమ్మలు ప్రశ్నార్థకంగా ముడుచుకున్నాయి. తను యింటివద్ద లేదు అత్తగారు, మావగారు, ఆయనా ఎవరూ యింటివద్ద లేరు.

ఇందూ ఒక్కర్తే ఉంది

ఒకవేళ కృష్ణమోళిగాని ఫోన్ చేశాడా!

ఫోన్ చేసి ఇందూ మనసు కష్టపెట్టు కునేటట్టుగాని మాట్లాడేడా!

అసలు ఏం చెప్పటంలేదు కదా!

"ఇందూ! ఏమిటమ్మా నాకు చెప్పక పోతే ఎలా తెలుస్తుంది! కృష్ణమోళిగాని ఫోన్ చేశాడా!"

"ఫోన్ చెయ్యటం కాదు" అంది- దుఃఖంతో పూడుకుపోయింది ఆమె కంఠ స్వరం.

"మరి!"

"అతను సరాసరి యింటికే వచ్చేశాడు" అంది కన్నీళ్ళతో.

"ఆ! యింటికి వచ్చాడా!" ఆశ్చర్యంగా తెల్లబోయినట్టుగా చూసింది.

"అవును వదినా. యింటికే వచ్చేశాడు. తిన్నగా నా గదిలోకి వచ్చి " అంటూ మళ్ళీ చేతుల్లో ముఖం దాచుకుని ఏడ్వ సాగింది.

"ఆ" అంబిక క్షణంసేపు ఊపిరి బిగపట్టి అలా ఉండిపోయింది.

పెళ్ళికాని పిల్ల ఒంటరిగా ఉంది. అతను అసలే మంచివాడు కాదు. తనలో తాను అనుకుంటూ ఆ మాటలు పైకే అనే సింది

ఇంద్రసేన మాట్లాడలేదు

"వచ్చి ఏమన్నాడు!" అడిగింది.

"నన్ను ఎంత అవమానించాలో అంతా అవమానించాడు ఆ మాటలు, అతని ప్రవర్తన నేను తట్టుకు భరించలేక పోతున్నాను" అంది

"అంటే నిన్ను ఏం చెయ్యలేదు కదా! పెళ్ళి కావలసిన పిల్లవు. అతను మంచి వాడు కాదు. అది నా భయం" అంది అంబిక భయంగా చూస్తూ.

"అతని మనసులో ఏ ఉద్దేశం ఉందో ఏమనుకుని ఈ యింటికి వచ్చాడో కాని నన్ను చూసి నా కోపంచూసి కాస్త తగ్గాడు. అంత సాహసం చెయ్యలేకపోయాడు. కాని ఎన్ని మాటలు అన్నాడు వదినా" అంది ఏడుస్తూనే.

ఆ మాట వినగానే అంబిక తేలిగ్గా నిట్టూర్చింది.

"ఏమన్నాడు!"

"నన్ను ఎలా అయినా పెళ్ళిచేసుకో వాలని పంతం పట్టి కూర్చున్నాడు. అతని మాటలు వింటుంటే నాకేదో భయంగా ఉంది. ఏ మత్తుమందో చల్లి తీసుకు పోతాడు అనిపిస్తుంది"

అంబిక మాట్లాడలేదు సీరియస్‌గా ఏదో ఆలోచిస్తూ కూర్చుంది.

"వదినా! ఈ విషయం మనం దాస్తే చాలావరకు వెళ్తుంది. ముందు ఈ సంగతి అన్నయ్యకు, నాన్నగారిక్కి చెప్పేద్దాం" అంది ఆవేశంగా.

ఆ మాటతో అంబిక ఉలిక్కిపడింది.

"ఎవరికి చెప్తావు?" అడిగింది.

"అన్నయ్యకు నాన్నగారిక్కి"

"చెప్తే వాళ్ళు ఏం చెయ్యగలరు అనుకుంటున్నావు?"

"అతని ప్రాణాలు తీస్తారు" కసిగా కోపంగా ఒక్కొ అక్షరం నొక్కి పలుకుతూ అంది

"చంపేస్తారు సరే, ఆ తరువాత" అడిగింది సూటిగా.

ఇంద్రసేన అయోమయంగా చూసింది అర్థంకానిదానిలా.

"అతన్ని చంపేస్తారు మన కసి, కోపం చల్లారిపోతాయి, సరే. అప్పుడు చట్టం ఏం చేస్తుంది?" అడిగింది.

తృళ్ళిపడినట్టు చూసింది ఇందు.

"ఒకరి ప్రాణాలు తియ్యడానికి మనకి హక్కు, అధికారం లేదు. చట్టం వెయ్యి కళ్ళతో వేటాడి మరీ తరిమి, తరిమి చివరకు పట్టుకుంటుంది. శిక్షకు శిక్ష విధిస్తుంది. ఆ శిక్ష నీ తండ్రికి, నీ అన్నయ్యకు పడ్తే అప్పుడు నువ్వు ఏమవు తావు? నువ్వు తట్టుకోగలవా?" అడిగింది సూటిగా

ఇందూ తలవంచేసింది. తను అంత దూరం ఆలోచించలేదు కసితో కోపంగా ఆవేశంగా అనేసింది. ఈ విషయం తన తండ్రికి, అన్నయ్యకు చెప్తే వాళ్ళు అంతపనీ చేస్తారు ఆ తరువాత బాధ పడేది ఎవరు?

ఆలోచనలతో అలా బొమ్మలా ఉండి పోయింది.

అంబిక చిన్నగా నవ్వింది

"ప్రాణం తియ్యటం అంత సులభం కాదు చట్టంఉంది దానికి మనం దడవాలి. ఆవేశం పనికిరాదు. ఆలోచన ముఖ్యం ఇప్పుడు. ఈ విషయం మనం అంత వరకూ తీసుకువెళ్ళవద్దు" అంది అంబిక.

"మరి ఆ కృష్ణమౌళి రోజురోజుకి పంతం పట్టినట్టు మాట్లాడుతున్నాడే! అతడ్ని తప్పించుకోవటం ఎలా?" అడి గింది భయంగా.

అంబిక నవ్వుతూ ఆమె భుజం తట్టింది ధైర్యం చెప్తున్నట్టుగా.

బేలగా చూసింది ఇంద్రసేన.

"నీ పెళ్ళి జరిగిపోతే అతనితో గొడవే ఉండదు నాకు హాస్పటల్‌కి ఫోన్‌చేశారు. రేపు వాళ్ళ అబ్బాయి కృష్ణ మన ఇంటికి వస్తాడట నిన్ను చూడ్డానికి, వాళ్ళ

ఆశ్చర్యపోకు... మా ఆవిడేలే... ఏ విషయం చెప్పినా నోట్లో దాగదు · వూరంతా పబ్లిసిటీ చేస్తుంది!




అబ్బాయికి ఇష్టం అయితే వాళ్ళకి ఇష్టమే నట. అతను మన ఇంటికి వచ్చేముందు గొడవ ఏం పెట్టుకోవద్దు. ఈ పెళ్ళి చూపులు చాలా రహస్యంగా జరిగిపోవాలి. పెళ్ళి సంబంధం నిశ్చయం అయిపోయి పెళ్ళి జరిగిపోతే అతను అతని పట్టుదలా ఏమవుతుంది" అంటూ నవ్వింది అంబిక.

"వదినా!" అంది సంతోషంగా, ఆశ్చ ర్యంగా, ధైర్యంగా.

"ఈ విషయం ఎవరికీ చెప్పకు. నేను ఉన్నాను. నీవు ధైర్యంగా ఉండు. నాన్న గార్కి, అమ్మగార్కి నేను చెప్తాను కృష్ణ రేపే మన యింటికి వస్తున్నాడు" అంది.

ఇంద్రసేన సిగ్గుగా చూసింది.

"నీవు చక్కగా అందంగా ముస్తాబు అవ్వాలి. అసలే నీవు అందమైనదానివి అనుకో. అతను నిన్ను చూడగానే అలా ఉండిపోవాలి అంతే" అంటూ నవ్వింది అంబిక.

"పో వదినా" అంటూ సిగ్గుపడి పోయింది.

అంబిక ఆమెకు ధైర్యం చెప్పి నవ్వించి, ఆమె మళ్ళీ మామూలు ఉషారుగా అయ్యేటట్టుచేసి ఆమె మనసులో భయాన్ని పోగొట్టింది.

అంబిక మనసులో నవ్వుకుంది.

ఇందు ఎంత పెంకిఘటమో! తన తెలివి, గడుసుదనం ముందు ఆమె ఓడి పోతుంది. కృష్ణమౌళి వస్తాడని తనకి తెలుసు. ఈ యింట అందర్నీ చూస్తుంటే తనకి జాలి ముంచుకువచ్చి నవ్వు వస్తుంది. అంబిక మనసులో నవ్వుకుంది.

(సశేషం)




శ్రీ సరస్వతీ ఆశ్రమం అంతా సద్దు మణిగింది.

ఆ రోజు జరగవలసిన కార్యక్రమా లన్నీ ముగిసాయి.

ఆశ్రమవాసులంతా ఎక్కడివారక్కడ నిద్రావస్థలోకి జారుకుంటున్న సమయం!

ఆశ్రమ ప్రాంగణం మధ్యలో ప్రము ఖంగా కనిపించే ఒక కుటీరంలో మాత్రం ఇంకా దీపం వెలుగుతోంది. అది ఆశ్రమ సంస్థాపకురాలు, అధిపతి అయిన గురుశ్రీ రాజేశ్వరీదేవి నివాసం.

గదిలో ఒక ప్రక్కగా వెదురు బొంగులతో తయారుచేసిన మంచం కొబ్బరి పీచుతో కుట్టిన పలుచని పరుపు, దానిమీద జింక చర్మం పరచిఉంది. మంచంమీద కూచునిఉన్న రాజేశ్వరీదేవి చేతుల్లో మహాగ్రంథ మేదో ఉంది కానీ ఆమె దృష్టి పుస్తకంలో పేజీలు, అక్షరాల వరుసల మీద లేదు. మనసు ఇంకె క్కడో ఉంది.

పుస్తకాన్ని పక్కకున్న ముక్కాలి పీటమీదుంచి, లేచి, గదిలో అటూ ఇటూ పచార్లుచేయడం ప్రారంభించింది.

అయిదున్నర అడుగుల ఎత్తు, ఎత్తుకు తగిన శరీర సౌష్టవం, వయసు ఏభయి పైబడినా, నలభయ్యేళ్ళ మని షంత దేహదార్ఢ్యంతో, ధరించింది కాషాయవస్త్రాలూ, రుద్రాక్షమాలా అయినా, సామ్రాజ్ఞిలా కనిపిస్తుంది రాజేశ్వరీదేవి. జుట్టు లేని తలకు ఎప్పుడూ కాషాయవస్త్రం ఒకటి గట్టిగా కట్టుకుని ఉంటుంది.

బయట వాతావరణం చల్లగా ఉంది. అయినా, బహుశా, ఆలోచనలతో ఆవిడ తల వేడెక్కి ఉండటంవల్లనేమో, చిరుచెమటలతో, ముఖాన ఉన్న విభూతి

రేఖలు, వాటి మధ్యని కుంకుమబొట్టు కొద్దిగా చెదిరిపోయిఉన్నాయి.

ఉదయం ఆశ్రమ సేవాదళం ముఖ్య సేవిక రంగమ్మ చెప్పిన మాటలు విన్న క్షణం నుంచీ ఆవిడ మనసుకు శాంతి లేకుండా అయింది.

మామూలుగా ఎప్పటిలాగే, గది ఊడ్చేందుకు వచ్చింది రంగమ్మ. రాజేశ్వరీదేవి కన్నా వయసులో పెద్దదీ, ఆశ్రమం ప్రారంభించిన నాటినుండీ ఆమె వెంట ఉన్నదీ అవటంవల్ల, రంగమ్మ అంటే ఆవిడకు కొంత ప్రత్యేక అభిమానం ఉన్నది

"అమ్మగారూ! చాలా రోజుల్నించీ మీతో ఒక మాట చెబుదామనుకుంటున్నా.. మీ కోపం వస్తుందేమోనన్న భయంతో నోరు పెగలకుండా ఉంది" అన్నది రంగమ్మ.

"ఇంత వయసు వచ్చి, నా కోపం తెప్పించేంత తప్పు ఏంచేశావు!"

"తప్పు చేసింది నేను కాదమ్మగారూ!"

"అయితే నీ కెందుకు భయం చెప్పు" అన్నది రాజేశ్వరీదేవి ప్రసన్నంగా.

"రూపాదేవమ్మ ప్రవర్తన బాగుండటం లేదమ్మా!" సంకోచంగా అంది రంగమ్మ.

"రంగమ్మా. ఏమిటి నువ్వంటున్నది!" ఆవిడకి అర్థంకావడంలేదు.

"నిజమేనమ్మా. నా మాటల మీద నమ్మకం కుదరకపోతే, ఏ రోజయినా రాత్రి పదిగంటల తర్వాత గుట్ట అవతల కాలవగట్టుకు వెళ్ళి చూడండి, మీకే తెలుస్తుంది."

రాజేశ్వరీదేవి నోటమాట లేకుండా ఉండిపోయింది.

అప్పటినుంచీ ఆవిడ మనసు మనసులో లేదు. నిజానిజాలు తెలుసుకోకుండా రూపను ప్రశ్నించటం, కోపగించి దండించడం ఆవిడ కిష్టంలేదు అందుకనే హృదయంలో తుఫాను రేగుతున్నా, సహించి, ఉదయంనుంచీ మౌనంగా ఉండిపోయింది.

ఒక్కొక్క ఘడియ గడుస్తున్న కొలదీ, రంగమ్మది ఒట్టి అనుమానం కాదు, నిజమే అయివుండాలి అన్న నమ్మకం బలపడుతోంది ఆమె మనసులో.

ఎందుకంటే రంగమ్మ అబద్ధాలు చెప్పే మనిషి కాదు ఉత్తినే అనుమానించే తత్వం అసలే కాదు. రూప విషయంలో అసలు వీరబాబు అనేది చేయదు.

ఎందుకంటే రూపాదేవి తన కెంతో, ఒక సేవికే అయినా రంగమ్మకూ అంతే! ఇంకా ఎక్కువేనేమో!

రంగమ్మ ఉన్న ఒక్కతే కూతురుకు అతిచిన్నవయసులో పెళ్ళిచేసింది. ఆ పిల్ల ఒక పాపను కని, మొదటి ప్రసవంలోనే మరణించింది. రంగమ్మ వెంట ఉన్న పసిబిడ్డ తనదయింది. రూపాదేవిగారాశ్రమంలో పెరిగింది. ఆ అమ్మాయికి రంగమ్మతో తనకున్న సంబంధం గురించి

తెలీదు. తెలిసే అవకాశమూ లేదు.

అంటే రంగమ్మ చెప్పిందంతా పూర్తిగా నిజమేనా?

ఎందుకల్లా అయింది? ఎక్కడుంది లోపం?

రూపను తను బుద్ధి వికసించకముందు నుండీ, ఎంత క్రమశిక్షణతో పెంచింది! తన తదనంతరం, ఈ ఆశ్రమం గురు పీఠాన్ని అధిష్ఠించవలసిన రూప ఇలా ఎందుకు చేస్తోంది? ఈ అపశ్రుతి ఎలా ఏర్పడింది?

దైవభక్తిని, సన్యాసాన్ని, తను రూపలో ఉగ్గుపాలతో రంగరించిపోసిందే! అవన్నీ ఏమయాయి? రూపకి బుద్ధి ఎందుకు పుట్టింది?

తెలిసీ తెలియని వయసు, అమాయకత్వం.... అవును అంతే! రూపాదేవి కావాలనే, తన్ను బాధించాలని, ఈ దొంగచాటు వ్యవహారం మొదలు పెట్టిందని అనుకోవడానికి, రాజేశ్వరీ దేవి మనసు అంగీకరించటం లేదు.

అవును. అంతే అయి ఉంటుంది! తెలియక ఆమె పొరబాటు చేస్తే సరిదిద్దవలసిన బాధ్యత తనదే! ఆ మోసగాడెవరో, మంచి అనుభవశాలి ఏమో! లేనిదే ఆశ్రమం అధినేత అయిన, తన పెంపుడు కూతుర్నే వలలో వేసుకోవడానికి, వాడికి ఎన్ని గుండెలు కావాలి!

గోడనున్న పాత గడియారం హఠాత్తుగా గంటలు కొట్టటం ప్రారంభించింది.

అంటే పది గంటలయిందన్నమాట.

'ఇదేమిటో ఇవాళ తెలిపోవలసిందే, అనుకుంది రాజేశ్వరీదేవి. కాషాయ రంగు శాలువ ఒకటి తీసి భుజంచుట్టూ కప్పుకుంది. గంధపు చెక్కతో తయారుచేసిన, చేతికర్రను పుచ్చుకుని, పాంకోళ్ళు వేసుకుని, గది దాటి వెలుపలికి అడుగు పెట్టింది.

అంతటా నిశ్శబ్దంగా ఉంది. నాలుగడుగులు వేసి రూప గదిని సమీపించింది రాజేశ్వరీదేవి. మంచం మీద పడక నలగనే లేదు. గది ఖాళీగా ఉంది.

'హుం! అయితే బయలుదేరి వెళ్ళిందన్న మాట!' అనుకొని అడుగేసింది రాజేశ్వరీదేవి.

ఆమె ఆలోచిస్తూ, పరిసరాలని పరిశీలిస్తూ, నడుస్తోంది.

సూర్యుడు లేనందువల్ల అది రాత్రి అయింది కానీ, ఎక్కడా చీకట్లు మాత్రం కనిపించటం లేదు పౌర్ణమి వెళ్ళిన రెండవ రోజేమో, చంద్రుడు, లోకమంతా నాదే అన్నట్లు, అంతటా వెలుగులు వింపుతున్నాడు.

ఆశ్రమం ఆవరణ దాటింది రాజేశ్వరీ దేవి. గుట్ట వయిపుగా అడుగులు వేసింది. అదంతా ఆశ్రమం ఆస్తే. ఆశ్రమం అవసరాలకు, తగినంత మేరకు అక్కడ వ్యవసాయం జరుగుతుంది.

చిరుగాలికి కొద్దిగా కదులుతున్న, పంటచేలు, వెన్నెల వెలుగులో కొత్తగా కన్పిస్తున్నాయి. ఈ వెన్నెల, ఈ వాతావరణం అంతా ఏదో వింతగా అని పిస్తోంది రాజేశ్వరీదేవికి.

అసలు తను చంద్రుణ్ణీ, వెన్నెలనూ చూసి ఎన్ని సంవత్సరాలయిందో గుర్తు లేదు. సూర్యోదయం కన్నా ముందు నుంచీ, సూర్యాస్తమయం వరకూ, క్షణం తీరుబాటు దొరకని దినచర్య ఆమెది. ఆశ్రమద్వారం దాటి వెలుపలికి రావటం అన్నదే అపురూపం. అలా అయినా, ఇంత రాత్రి అయిన తరువాత బయటికి రావలసిన అవసరం అసలు ఉండదు.

పంటచేలు దాటి గుట్ట ఎక్కడం వల్ల కొద్దిగా అయాసం అయి, నడక వేగం తగ్గిపోయింది.

ఏవో గడ్డిపూవుల సువాసనల్ని మోసు కొస్తున్న చిరుగాలులు, ఆమె శరీరానికి హాయిగా సేద దీరుస్తున్నట్లుగా ఉన్నాయి.

ఎక్కువ దూరం ఒక్కపట్టున ఎక్కలేకపోయింది రాజేశ్వరీదేవి. చదునుగా ఉన్న ఒక బండమీద చతికిల బడింది పరిసరాలను పరిశీలిస్తూ కూచుండిపోయింది.

చిత్రంగా ఆవిడ మనసులోని అశాంతి అంతా ఎటుపోయిందో, కొత్త తేలిక పడినట్లుగా ఉంది.

అక్కడినుంచీ చూస్తే, ఆశ్రమం పర్ణశాలలు, అటువయిపు తోట, ఇటు వయిపు పంట పొలాలు. అన్నీ వెన్నెల వెలుగులో, గొప్ప చిత్రకారుడు గీసిన ప్రకృతి చిత్రపటంలా కనిపిస్తున్నాయి.

వెన్నెల! ఎటు చూసినా వెన్నెల! చెట్టూ, పుట్టా, రాయి, రప్ప, అన్నిట్లో నిండిపోయి ఉండి ప్రకృతి అంతా ఏదో రమణీయతను సంతరించుకున్నట్లుగా ఉంది.

ఈ వాతావరణం, ఈ వెన్నెల ఆనందాన్నిచ్చే ఇంత అందం, ఇవన్నీ ఎందుకు సృష్టించాడు దేవుడు? ఎవరి కోసం? జీవకోటి సర్వస్వం, నిద్రావస్థలోకి వెళ్ళిపోయిన ఈ సమయంలో ఇంత ఆహ్లాదం వృధాకాదూ? దీన్ని అనుభవించే దెవరు?

ఒళ్ళుమరిచి నిద్రపోతున్న మనిషికి కారుచీకటి అయినా, వెన్నెలరాత్రి అయినా ఒకటే! అయితే చంద్రుడు వెదజల్లుతున్న ఈ చల్లని వెన్నెల ఎవరికోసం?

ఏమిటో! దైవలీలలే చిత్రం! ఎంత జ్ఞానం ఆర్జించినవారికయినా అర్థంకానివి ఉంటూనే ఉంటాయి.

రాజేశ్వరీదేవి సందేహానికి సమాధానం దొరకలేదు.

బండమీది నుంచీ లేచి ముందుకు సాగింది.

గుట్ట ఎక్కి దిగటం అయింది.

అక్కడినించీ అరటితోట ప్రారం భం. అరటితోటకి అవతలే చిన్నపిల్ల కాలువ ఒకటి ప్రవహిస్తోంది.

అరటితోట మధ్యనున్న చిన్న కాలి బాట వెంబడి నడుస్తోంది రాజేశ్వరీదేవి. ఆవిడ మనసులో ఇప్పుడు ఏ విధమయిన ఉద్వేగం, ఉత్సుకత లేవు.

అప్పుడప్పుడు గాలికి కదలుతున్న అరటి ఆకులు, చంద్రకిరణాల వెలుగులో తళుకులీనుతున్నాయి.

అరటితోట దాటగానే, అల్లంత దూరంలో, నిశ్శబ్దంగా ప్రవహిస్తున్న కాలువ కనిపించింది.

సంవత్సరానికి ఒక్కసారి ఈ కాలువ దగ్గరికి వస్తుంటుంది రాజేశ్వరీదేవి. శివరాత్రి వెళ్ళిన మరురోజు వచ్చి ఇక్కడ గంగాపూజ చేయిస్తుంది. శివరాత్రికి వారంరోజులు ముందరే తమ ఆశ్రమంలో ఆరంభంఅయ్యే పూజలు, ఉత్సవాల్లో పాల్గొనేందుకు భక్తులు తండోపతండాలుగా వస్తారు. తను పూజచేయవచ్చేసరికి, కాలువ గట్టు, సాన్నాలు చేసేవాళ్ళతో కిటకిటలాడుతుంటుంది.

ఏటా అదే జనసమ్మర్దంతో చూడటం వల్లనేమో, ఇవాళ నిర్మానుష్యంగా ఉన్న కాలువఒడ్డు, మేటలు వేసి ఉన్న ఇసుక, వింతగా కనిపిస్తున్నాయి రాజేశ్వరీదేవికి.

ఆమె కళ్ళు రూపకోసం వెతుకుతున్నాయి.

ఎక్కువసేపు వెతకనక్కరలేక పోయింది.

పాదాలు ఇసుకలో కూరుకుపోయినదానిలా, కదలకుండా నిలుచుండిపోయింది రాజేశ్వరీదేవి.

కాలువ కొద్దిగా ఒంపు తిరిగి దిగువకు ప్రవహిస్తున్న చోట రెండు బండరాళ్ళు ఒకదానికొకటి ఆనుకొని ఉన్నాయి వాటి మీద కూచుని ఉన్నారు రూప, ఆమె చెలికాడు.

వాళ్ళిద్దరూ ఈ లోకంలో లేరు.

కాళ్ళు నీటిలోకి వదిలి వాలుగా కూచుని ఉన్న అతని ఒళ్ళో తలపెట్టుకుని జారగిలబడి ఉంది రూప.

అతని చేతులు ఆమె జుట్టు సవరిస్తున్నాయి.

ఆమె చేతులు, అతని మెడచుట్టూ పెనవేసి ఉన్నాయి.

అదేపనిగా ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటున్నారు.

రాజేశ్వరీదేవికి కోపం రాలేదు. ఆశ్చర్యంగా చూస్తూ నిలుచుంది. అక్కడున్నది ఆమె ఊహించినట్లు కొమ్ములు తిరిన మగవాడు కాదు.

ఆ అబ్బాయికి రూప అంతే వయసు ఉంటుంది. మీసమయితే ఉంది కానీ, బుగ్గల్లో పసితనం కనిపిస్తోనే ఉంది.

ఓహ్! వాళ్ళిద్దరిలో ఎంత మైమరుపు! చూపుల్లో ఎంత ఆరాధన! వాళ్ళు చేస్తున్నది తప్పు అనుకోవడానికి రాజేశ్వరీదేవి మనసు వెనుకాడుతోంది.

ఒక్క నిముషం ఆలోచిస్తూ కళ్ళు మూసుకుంది.

మళ్ళీ కళ్ళుతెరిచిచూస్తే, ఎదురుగా ముఖాలకి బదులు మరేవో కనిపిస్తున్నాయి ఆమెకు!

అరె! అది తన ముఖంలాగే ఉంది, రూప వయసులో ఉండగా తన ముఖం అట్లాగే వుండేది! అవును అయితే.... అతను తనకు చిరపరిచితం అట్లాగే ఉండేది! అవును....అయితే....అతను .. తనకు చిరపరిచితం అయిన వ్యక్తే.... తనని ప్రాణంగా ప్రేమించిన పిచ్చి వాడు ... ఏమిటిది? ఇట్లా ఎందుకు కనిపిస్తోంది? ఎన్నేళ్ళగా మరుగున పడిపోయిన, పాత జ్ఞాపకాలు ఇప్పుడు బయటి రావటం ఏమిటి?

కాదు కాదు! అక్కడున్నది తను కాదు. దృశ్యం మారిపోయింది. మళ్ళీ వాళ్ళిద్దరే కనిపిస్తున్నారు. ఏదో మాట్లాతున్నట్లు, వాళ్ళ పెదవుల కదలికలు తెలుపుతున్నాయి.

పిల్ల కాలువ, ఇసుకమేటలు, ఒక వయిపు, అరటితోట. గుట్ట మరొక వయిపు, వెన్నెల వెలుగులో అతి అకర్షణీయంగా ఉన్న ఆ ప్రకృతి దృశ్యంలో ఒక భాగంలా కలిసిపోయారు వాళ్ళిద్దరూ. నిజాని కా జంట, పరిసరాలకి మరింత అందాన్ని సమకూర్చుతున్నట్లుగా కని పిస్తోంది.

అతడు చంద్రుడివయిపు వేలుపెట్టి చూపి, రూపకేదో చెబుతున్నాడు. బహుశా 'చంద్రబింబం కంటే నీ ముఖమే అందంగా ఉంది' అంటూన్నాదేమో!

ఊహు కాదు, చేతిని గాలిలో చుట్టూ తిప్పి, రూప భుజానికి తాకించి,అదే చేతిని ఎదమీద ఉంచుకున్నాడు. "ఈ వెన్నెల వెలుగు, చల్లదనం అంతా మన కోసమే" అని అంటున్నటుంది.

అంతే అయిఉంటుంది.

అవును! తన సందేహానికి సమాధానం ఇప్పుడు దొరికింది. ఈ రాత్రి, ఈ వెన్నెల, ఈ అహ్లాదం అన్నీ, ప్రేమ భావంలో మైమరచి ఉన్న ఆ ప్రేమికుల కోసమే అయుండాలి!

రాజేశ్వరీదేవి మనసు మారిపోయింది.

నోరు విప్పి ఆ నిశ్శబ్దాన్నీ వాళ్ళ ఏకాంతాన్ని, భంగంచేయటం ఇష్టంలేక మౌనంగా వెనుదిరిగింది.

ఆశ్రమంలో గది చేరి విశ్రమించ బోయే ముందు 'ఉదయం, ఆ అబ్బా యెవరో వివరాలు తెలుసుకొమ్మని రంగమ్మకు చెప్పాలి' అనుకుంది రాజేశ్వరీదేవి.

అవును రూప తన కూతురు అయి నంత మాత్రాన, ఆమె భవిష్యత్తును నిర్ణయించే హక్కు తనకేం ఉంది! అందరి భవిష్యత్తులు నిర్ణయించే భగ వంతుడుండగా తనకెందుకా శ్రమ!

**ముద్దంశెట్టి హనుమంతరావు**

# బుద్ధి చెప్పింది!



రామరాజుగారింట్లో ఆ రోజు ఓ పండుగలా వుంది. అందరి మొహాల్లోనూ చెప్పలేనంత వుత్సాహం తొణికిసలాడుతోంది. అంత సందడికీ, ఆ వుత్సాహానికీ కారణం ఆ రోజు డాక్టర్ రవీంద్ర స్టేట్స్ నుంచి తిరిగివస్తూండటమే.

పై చదువులకోసం స్టేట్స్‌కి వెళ్ళిన డా. రవీంద్ర, ఫారెన్ డిగ్రీతో తిరిగి వస్తున్నందుకు, అతని తలితండ్రులు, కాబోయే అర్ధాంగి సుధ, ఆనందంతో వుక్కిరిబిక్కిరవుతూ, అతణ్ణి ఎప్పుడు చూస్తామా అన్న ఆతృతతో వున్నారు.

సుధ, నారాయణగారమ్మాయి, బి.ఏ. పాసయ్యింది. అందమూ, అందానికి దీటైన అణకువ, అకర్షణ, ఆమెని మరో మెట్టు పైనే నిలిపాయి.

సుధ ఆశలన్నీ రవీంద్ర పైనే ఉన్నాయి. బావ స్టేట్స్‌నుంచి తిరిగి వచ్చాక, తమ వివాహం వైభవోపేతంగా జరుగుతుందని, హాయిగా యెన్నెన్నో స్వప్నాలు చవిచూస్తూ సంసార జీవితాన్ని సాగిస్తామని స్నేహితురాండ్రతో చెప్పుకుంటూ ఉండేది.

రవీంద్ర తండ్రి, రామరాజు సంగతి సరేసరి; కొడుకు స్టేట్స్‌లో ఉంటూ కూడా తమకి యెటువంటియిబ్బందీ కలుగ జెయ్యలేదు. ఇప్పుడెలాగూ స్వదేశం తిరిగి వచ్చేస్తున్నాడు గాబట్టి, తమ అంతస్తు, నిత్యజీవిత సరళి, యింకా పెరుగుతాయన్న ఆశ, అతనిలో బాగా నాటుకుంది. అదో తృప్తి.

ఇంత మంది యిన్ని విధాలుగా అనూహ్యమైన ఆనందాన్ని పొందుతున్నా ప్రతి ఒక్కరిలోనూ ఒకే ఒక్క భయం కూడా లేకపోలేదు. బాహ్యంగా ఆ భయాన్ని ఏ ఒక్కరూ వ్యక్తంచెయ్యక పోయినా, అది అందర్నీ పట్టి పీడిస్తున్న భయమే. రవీంద్ర స్టేట్స్‌లో ఏ పాశ్చాత్య లలనామణినో వివాహం చేసుకొని వస్తే.... వాళ్ళు భయపడినట్టు అదే జరిగితే, అందరి ఆశలూ మట్టి గలిసినట్టే.

* * *

అందరూ డా. రవీంద్రను రిసీవ్ చేసుకోడానికి ఏర్‌డ్రోమ్‌కి వెళ్ళారు.

రవీంద్ర ప్రయాణం చేస్తున్న బోయింగ్ విమానం వచ్చింది. రవీంద్ర విమానంనుంచి దిగివస్తూనే తన వాళ్ళని గుర్తించి చేయి వూపాడు. అతణ్ణి రిసీవ్ చేసుకోడానికి వచ్చినవాళ్ళంతా వుత్సాహంగా చేతులు వూపారు. వారిలో అంతులేని ఆనందం పెల్లుబికింది. సుధ హృదయం స్పందించింది రవీంద్రబావ ఒంటరిగానే వచ్చినందుకు, లోలోన మురిసిపోయింది ఆమె అంతరంగంలో అంతవరకూ దోబూచులాడుతున్న భయం పటాపంచలయ్యింది. మిగిలినవాళ్ళూ అదే అనుభూతిని పొందారు.

రవీంద్ర వస్తూనే తలిదండ్రుల్ని కౌగలించుకున్నాడు. ఆ పక్కనే నిల్చున్న మామయ్యకి, అతని సరసనే మందస్మిత వదనంతో సిగ్గులొలకబోస్తూ నిల్చున్న 'సుధ'ని ఆప్యాయంగా పలకరించాడు. "నేను జ్ఞాపకమున్నానన్న మాట.... ఏం బావా?" సిగ్గుతో ముకుళించుకుపోయి అంది సుధ.

"వై నాట్? నీ వుత్తరాలు అనుక్షణం నిన్ను గుర్తుచేస్తూనే వున్నయ్ కదా?" నవ్వుతూనే అన్నాడు రవీంద్ర.

రవీంద్ర మాటల్లో హుందాతనం పెరిగినట్టూ, శరీర ఛాయలో కాన్తతం

మెరుపు వచ్చినట్టూ, అప్పుడే గుర్తించింది సుధ.

"నేను యెన్ని వుత్తరాలు రాసినా, నువ్వు మాత్రం యే రెండు నెలలకో, మూడు నెలలకో ఉత్తరం రాసేవాడివి. నాకు భలే కోపం వస్తూండేది బావా" చిలిపిగా అంది సుధ

"అవన్నీ ఇంటిదగ్గర తీరిగ్గా మాట్లాడుకోవచ్చున్లే అమ్మాయ్. ఇక బైల్దేరండి. అల్లుడు ప్రయాణపు బడలికతో వున్నాడు కదా, కాస్సేపు విశ్రాంతి తీసుకోనీ" నారాయణ కిలిగించుకుంటూ అన్నాడు.

దాంతో అందరూ బైటికొచ్చేసి కారులోనూ, టాక్సీలోనూ ఇంటిముఖం పట్టారు.

ఆ రోజు రామరాజు ఇల్లు, బంధుజనంతో, స్నేహితులతో, కళకళలాడుతూ హడావిడిగా వుంది. సుధ స్నేహితురాళ్లు అమెనో ఆట పట్టిస్తున్నారు.

రామరాజు, నారాయణ కేవలం బావమర్దులే కాదు—సన్నిహిత స్నేహితులు కూడాను. నారాయణ ఆర్థికంగా ఓ మెట్టు పైనేవున్నా, రామరాజుని యేనాడూ చిన్నచూపు చూళ్ళేదు. తన కొడుకు విదేశాల్లో వున్నాడన్న అధిక్యత రామరాజూ కనబర్చలేదు. అటువంటి భేషజాలు, అహంభావాలు లేవుగాబట్టే ఆ రెండుకుటుంబాలూ అనన్య ఐక్యతతో మసలుతున్నాయి.

రవీంద్ర వచ్చేశాడు గాబట్టి, యింక వుపేక్షించకుండా, అతడి వివాహం సుధతో జరిపించేయాలన్న యోచన వాళ్ళిద్దరికీ వుంది.

అందుకనే, మరునాడు అందరూ కూచుని కబుర్లు చెప్పుకుంటున్న తరుణంలో, రామరాజే ఆ ప్రసక్తి తీసుకొచ్చాడు.

"ఒరేయ్ రవీ! నువ్వెలాగూ వచ్చేశావు. ఇన్నాళ్ళనించీ మేమందరమూ యెదురుతెన్నులు చూస్తోన్న నీ వివాహం జరిపించేయడానికి యేర్పాట్లు చేయించమంటావా! మీ మావయ్య కూడా ఆరాటపడుతున్నాడు "

నారాయణ చప్పున అందుకున్నాడు. "ఔన్రా రవీంద్రా! మా చిరకాలవాంఛ, మీ యిరువురి వివాహబంధం. సుధ, నువ్వూ, చిలకాగోరింకల్లా మా కళ్ళముందు తిరుగాడుతుండటమే మేమంతా కాంక్షించేది."

సుధ సిగ్గుతో మొహం దించుకునే వుంది.

రవీంద్ర, చప్పున జవాబు చెప్పలేకపోయాడు. ఈ ప్రశ్న తప్పకుండా యెదురవుతుందని, స్టేట్స్‌లో బైలుదేరుతున్నప్పుడే అనుకున్నాడు. సమాధానం యేంచెప్పాలో కూడా అప్పుడే నిర్ణయించుకున్నాడు. అయితే, తాను నిర్ణయించుకున్న సమాధానం, తనవాళ్ళెవంకీ సంతృప్తి నివ్వదని అతనికి తెలుసు. అందుకే, కాస్తంత తటపటాయించాడు.



"ఏవిట్రా అబ్బాయ్, అంతగా ఆలోచిస్తున్నావు?" తల్లి శకుంతల అంది. "ఇందులో ఆలోచించడానికేముంది? సుధ పుట్టిందగ్గర్నించీ మేం అనుకుంటున్నదేగా, మీ యిద్దర్నీ ఓ ఇంటివారిని చెయ్యాలని. ఇది మా అందరి అభిలాష."

రవీంద్ర గుటకలు మింగాడు.

"అది కాదమ్మా! నా పెళ్ళికి, యిప్పుడేం తొందరొచ్చిందని?" అన్నాడు ఆకరికి.

అక్కడున్న వాళ్ళందరి మధ్య, ఓ బాంబు పడినట్టయ్యింది. అందరూ విస్తుబోయారు. వారి మొహాల్లో రంగులు మారినయ్.

ఎప్పుడో నిర్ణయమైన యీ పెళ్ళికి రవీంద్ర సంతోషంగా అంగీకరిస్తాడని, అందరూ నమ్మేవారు. ఆశతో వుండేవారు. కాని యిప్పుడు రవీంద్ర వేసిన యెదురుప్రశ్న వారి నమ్మకాన్ని వమ్ముచేసింది. వారిలో నైరాశ్యం చోటుచేస్తుకుంది. సుధ గుండెలు ఝల్లుమన్నాయి. రవీంద్ర బావపై తానెన్ని ఆశల్ని పెంచుకుంది. తన భవిష్యత్తును గురించి యెన్నెన్నో సుందరస్వప్నాల్ని కన్నది. కాని, రవీంద్ర యిప్పుడిలా అంటున్నాదేవిటి? ... ఆమెలో నిరాశ ఛాయలు ముసురుకున్నాయి,

రామరాజు మొహం, చిరుకోపంతో రాగరంజితమయ్యింది.

"ఏవిట్రా రవీ నువ్వంటున్నది? నీ పెళ్ళికి తొందరేమొచ్చిందంటున్నావా? నీకు వయస్సు రాలేదనే అనుకుంటున్నావా? సరైన వయస్సులో పెళ్ళిచేసి

వుంటే, యీసరికి యిద్దరు బిడ్డల తండ్రివి అయ్యుండేవాడివిరా: నీ మాట యెట్లా వున్నా, నిన్నే నమ్ముకుని, నీమీద యెన్నో ఆశల్ని పెంచుకున్న సుధ సంగతేవిటి?" అన్నాడు రామరాజు.

"ఔను రవీంద్రా: 'సుధ'కి యింకా పెళ్ళి చెయ్యలేదేమని అంతా అడుగుతూ వుంటే, మేం యేం సమాధానం చెబుతాం చెప్పు; ఎన్నో సంబంధాలు వస్తున్నా, మేనరికం వుందని చెప్తూ వస్తున్నాం." తన ఆందోళనవి వ్యక్తంచేశాడు, నారాయణ.

రవీంద్ర యిరకాటంలో పడ్డాడు. "అది కాదు మావయ్యా। మీ సమస్యలు మీరు చెబుతున్నారు బాగానే వుంది. కాని, నా సమస్యల్ని మీరు సహృదయంతో ఆలోచించాలి. మరో మూడేళ్ళు స్టేట్స్‌లో వుండడానికి నాకు అవకాశం దొరికింది. ఇటువంటి అవకాశాలు అందరికీ రావు. ఇది నా భవిష్యత్తుకి సంబంధించిన విషయం. అందుకే, మరో మూడేళ్ళయినా ఆగితే వివాహం చేసుకుంటాను." అన్నాడు తొణక్కుండా.

రవీంద్ర యీసారి వెలిబుచ్చిన వైనం మరింత ఆశ్చర్యంలో ముంచింది, అందర్నీ. అతడు భారతదేశం తిరిగి వచ్చేశాడనే అనుకుంటున్నారుగాని, మళ్ళీ వెళ్ళిపోతాడన్న విషయం, అతని తలిదండ్రులక్కూడా తెలీదు. అందరి మొహాలూ తెల్లబడినయ్.

సుధ, కలవరపడింది. నీరసించిన కళ్ళతో రవీంద్రకేసి చూసింది ఆ చూపులు 'నిజమేనా?' అని నిలదీసి అడుగుతున్నట్టున్నయ్... అలా అనిపించింది రవీంద్రకి.

"నిజం సుధా, బిలీవ్ మి.. ఇటువంటి సదవకాశాన్ని జారవిడుచుకోవడం నా కిష్టంలేదు. ఈ అవకాశపు విలువను నువ్వు గుర్తించగలవనుకుంటాను..." ఆమె మనోభావాన్ని చదివినట్టుగా ఆమెకి సమాధానం చెప్పాడు, రవీంద్ర

నారాయణ, రామరాజుకేసి అదోలా చూశాడు. "ఏం బావా, రవీంద్ర యేకంగా వచ్చేస్తున్నాడనే చెప్పావు కదా; మరి, యిప్పుడిలా అంటాదేవిటి?" సూటిగా ప్రశ్నించాడు.

"నే నలా చెప్పిన మాట వాస్తవమే బావా; నాకు తెల్సిన నిజం కూడా అదే: రవీంద్ర చెబుతున్న విషయం, యింత వరకూ నాకు గాని, మీ చెల్లెలిగ్గాని తెలీదు." అంటూ కొడుక్కేసి అసహ్యంతో చూశాడు "ఆయేడుపేదో ముందుగానే వుత్తరంలో యేడవలేకపోయ్యావ్రా?" కోపాన్ని అణుచుకోలేక అన్నాడు రామరాజు. తన మాటకి విలువలేకుండా పోయిందన్న విషయం అతణ్ణి బాధించింది.

"వ్యవధి లేకపోయింది నాన్నా."

రామరాజు మరేం అనలేకపోయాడు. కాని, నారాయణ వూరుకోలేదు

"సరే; బాగానే వుంది. నువ్వా అవకాశాన్ని వదులుకోదల్చకపోతే, నిన్ను

మేం బలవంతపర్చంరా రవీ! నువ్వు స్టేట్స్‌లోనే మరో మూడేళ్ళు వుండు. ఎవరు కాదన్నారు! కాని, దానికీ, నీ పెళ్ళికి ముడి పెట్టడ మెందుకు? హాయిగా వివాహం చేసుకొని, మీ రిద్దరూ వెళ్ళి అక్కడే మూడేళ్ళూ వుండొచ్చును కదా! అలా యెంతమంది వుండటంలేదు?" బాధ్యత గల 'సుధ' తండ్రిగా, నారాయణ తన అభిమతాన్ని వెలిబుచ్చాడు.

అంతవరకూ మౌనంగా వున్న రవీంద్ర తల్లి మళ్ళీ అందుకుంది.

"ఔనా అబ్బాయ్! మావయ్య చెప్పింది బాగానే వుందిగా! అట్లాగే చేద్దాం. నీ కోరికా తీరుతుంది. మా సమస్యా పరిష్కృతమౌతుంది."

రవీంద్ర కొత్త చిక్కులో యిరుక్కున్నాడు.

అతని మొహం పాలిపోయింది. ఆ చిక్కులోంచి యెలా బైటపడ్డమా అని తీవ్రంగా యోచించాడు.

"మీ రెవ్వరూ నన్ను అర్థంచేసుకోవటం లేదమ్మా. వివాహం చేసుకుని మా యిరువురం అక్కడికి వెళ్తే, సుఖంగా కాలం గడపలేం. అక్కడి వాతావరణం వేరు. సుధ యెన్నో యిబ్బందుల్ని యెదుర్కోవల్సి వస్తుంది. అందుకే, మరో మూడేళ్ళు ఆగితే...." అని రవీంద్ర యింకేదో చెప్పబోతూవుంటే, రామరాజు అడ్డొచ్చాడు.

"అది సబబుగా వుండదురా అబ్బాయ్! మనం మాటకి కట్టుబడి వుండాలి. అది మన ధర్మం. నన్నడిగితే, నువ్వు మళ్ళీ స్టేట్స్‌కి వెళ్ళడమనే నిర్ణయాన్ని విరమించుకుంటే సరి. మీ మావయ్య కట్నం రూపంలో లక్షరూపాయ లిస్తానంటున్నాడు. హాయిగా ప్రయివేటు ప్రాక్టీసు పెట్టుకో. మా కళ్ళముందు మీ రిద్దరూ తిరుగుతూ, మాకు ఆనందాన్ని పంచిపెట్టు"

రవీంద్రకి విసుగుపట్టింది. అతని మొహం యెర్రబారింది. తను యే విధంగానూ మెత్తబడకూడ దనుకున్నాడు.

"అబ్బ! ఏమిటినాన్నా, మీ మొండి పట్టుదల? డబ్బు ప్రసక్తి యిప్పుడెందుకూ? నాకొచ్చిన సదవకాశాన్ని విడుచుకోనంటున్నాను గాని, డబ్బుకోసం వెళ్తున్నా నంటారా?" అసహ్యంగా అన్నాడు రవీంద్ర.

సుధకి వొళ్ళు మండిపోయింది. ఆమె సన్నని, యెర్రని అధరాలు కోపంతో వణికినయ్. ఆమె మొహం, కెంపు రంగును పులుముకుంది. ఇన్ని విధాలుగా పెద్దలు చెబుతున్నా, రవీంద్ర బావ తప్పించుకోవాలని చూడ్డం, ఆమెలో యెన్నో సందేహాల్ని రేకెత్తించింది. తన పట్ల బావకి యేమాత్రం అనురాగం, ప్రేమ, అభిమానంవున్నా, యిలా తాత్సారం చేసివుండేవాడు కాదన్న నమ్మకం ఆమెలో బలంగా యేర్పడింది. దాంతో, ఆమెకి రవీంద్రపట్ల వుండే 'ప్రేమ'




అనే 'క్రేజ్' కరిగిపోయింది. ఓ విధమైన జుగుప్స కలిగింది.

ఆ విశృద్ధ వాతావరణాన్ని చించుకొని, ఆమె గొంతు పెగిలింది.

"బావా: సారీ....మిస్టర్ రవీంద్రా: స్టేట్స్‌కి వెళ్ళి, ఆ వాతావరణంలో కొన్నాళ్ళయినా పెరిగిన నీలో, నవనాగరికత బాగా జీర్ణించుకుందనే అనుకుంటున్నాను. మీనాన్న, మానాన్న నీకు నచ్చజెప్పాలని శక్తివంచనలేకండా ప్రయత్నిస్తున్నా, నువ్వు తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నావే గాని, వాటి ప్రతిపాదనల్ని స్వీకరించడం లేదంటే, దానికి బలీయమైన కారణం యేదో వుండివుంటుంది. నువ్వు స్టేట్స్‌కి మళ్ళీ వెళ్ళడంలో, డబ్బు ప్రసక్తి లేదంటున్నావు బాగానే వుంది. అయితే, నువ్వు వెళ్ళడానికి, నాతో వివాహానికి తాత్పర్యం చెయ్యడానికి ఒకే ఒక్క కారణం వుండి వుంటుందనుకోవడంలో తప్పులేదు. అదే నీ వివాహం: అక్కడ యెవరినో నువ్వు వివాహం చేసుకున్నావు ....లేకపోతే, నీ తలిదండ్రుల్ని, నన్నూ నిరుత్సాహపర్చే ధైర్యం నీలో రాదు నీ మనోభావాల్ని అర్థంచేసుకోలేదనుకోకు. ఉన్న నిజం ఒక్కముక్కలో చెప్పేస్తే పోయేదిగా:" విసురుగా అందామె.

"ఏవిటి సుధా, యేవిటా మాటలు:" దబాయించాలని మరో ప్రయత్నం చేశాడు రవీంద్ర.

"మరేం చెప్పొద్దు మిస్టర్ రవీంద్రా: దబాయించాలని, మమ్మల్ని నమ్మించాలని వ్యర్థప్రయత్నం చెయ్యకు. ఐజాన్ని ఒప్పుకో: నేను బాధపడతానని అనుకోకు ....అటువంటి బాధేలేదు నాకు... .... నా వ్యక్తిత్వం నాకుంది. నా అదృష్టం నాకుంది...." నిష్కర్షగా చెప్పింది.

రవీంద్ర మొహం వివర్ణమయ్యింది. నలుగురి సమక్షంలో సుధ తనవే అవమానపర్చిందనుకున్నాడు గాబోలు. చప్పున లేచి అక్కణ్ణించి పక్కగదిలోకి వెళ్ళిపోయాడు.

రామరాజు, శకుంతల విస్తుపోయారు. స్థాణువుల్లా నోటమాటరాక, క్షణం వుండిపోయారు.

నారాయణ మాత్రం కూతురి ప్రవర్తనకు లోలోపల మురిసిపోయాడు. రవీంద్రకి బాగానే బుద్ధి చెప్పిందని, సమాధానపడ్డాడు.

"ఛీ! ఛీ! ఏం నాగరికతో యేమిటో!" అని తనలో తనే గొణుక్కున్న రామరాజు, నారాయణకేసి తిరిగి "బావా, నన్ను క్షమించు." అన్నాడు.

నారాయణ చిన్నగా నవ్వేడు.

"నువ్వేం చేశావని నిన్ను క్షమించడం బావా? ఆ విషయం మర్చిపో, అన్నీ మన మంచికే అనుకుందాం."

"మావయ్యా! మీరేం బాధపడకండి. మీరంటే నాకెప్పుడూ గౌరవమే," అంది సుధ.

"ఆ మాట చాలమ్మా నా తృప్తికి.... ఆత్మ సంతృప్తికి" అంటూ భారంగా ఓ నిట్టూర్పు విడిచాడు రామరాజు.

శకుంతల మాత్రం కళ్ళొత్తుకుంటూ అక్కణ్ణించి లేచి వంటగదికేసి వెళ్తూ "లేవండర్రా, భోజనాలు చేద్దాం" అంది.

మేనత్తతో పాటు సుధ కూడా హుషారుగా వెళ్ళింది లోపలికి.

ఒక్కసారి వాతావరణం గంభీరంగా మారిపోయిందా ఇంట్లో!






వాలుగా వస్తూన్న గాలిదుమారం—

రిక్షా తొక్కకుండానే దూసుకు పోతోంది. సినిమా అయిపోవడంతో ఆదివారం రోజు హాయిగా రిక్షాలో కూర్చొని ఇంటికి వస్తున్నాను.

రిక్షావాడు బ్రేకులు అప్పుడప్పుడు నొక్కి ఒక్కొక్కసారి తొక్కుతున్నాడు. రోడ్డు మలుపు....

హఠాత్తుగా ఓ యువతి రోడ్డుకు అడ్డుగా వచ్చింది.

రిక్షావాడు లాఘవంగా బ్రేక్ వేసి చటుక్కున తిప్పాడు. నేను ముందుకు తూలాను.

రిక్షా హ్యాండిల్ తగలడంతో ఆ అమ్మాయి తూలిపడింది. కాలు, వేళ్ళ మీదుగా వెనుక చక్రం ఎక్కింది.

రిక్షావాడు చటుక్కున ఆపాడు.

"దెబ్బలేం తగల్లేదులే పోనివ్.. " రిక్షావాణ్ని కసిరాను

రిక్షావాడు నా మాటలేం విన్పించుకోకుండా ఆ అమ్మాయి జబ్బపట్టుకొని ప్రక్కకు నడిపించాడు.

దీనంగా, బాధగా కాలును సవరదీసుకొంటున్న ఆమెకు రిక్షావాడు రెండ్రూపాయిలిచ్చాడు.

నాకు చిరాకేసింది.

ఈ మాత్రానికే రెండురూపాయలా!

ఆమె వచ్చినదారిన వెళ్ళిపోసాగింది. రిక్షా ముందుకు కదిలింది.

నేను మౌనంగా వుండలేకపోయాను.

ఇలా చిన్న దెబ్బలకు డబ్బులు అలవాటు చేస్తే రేపు ఇదే వృత్తిలో బ్రతకడం అలవాటుచేసుకుంటారు.

రిక్షావాడు మాట్లాడలేదు.

డబ్బులు ఇచ్చినందుకు వాణ్ని మెచ్చుకోలేకపోయాను. వాడు బదులు చెబితే కసితీరా తిట్టివుండేవాణ్ని.

"అసలు ఆ వయస్సులో పిల్లలకు నెత్తిన కళ్ళుంటాయ్. ఏ మగాణ్ని ఎలా చూడాలా అని ఆలోచిస్తుంటారు" అన్నాను

అయినా రిక్షావాడు మాట్లాడలేదు.

మా ఇల్లు రానే వచ్చింది. రిక్షా మా ఇంటిముందు ఆగడ తో మాట్లాడిన విధంగా డబ్బులు రిక్షావాడి చేతిలో పెట్టాను

రిక్షావాడు ఏదోలా చూసి "ఇందాక రిక్షాక్రింద పడ్డమ్మాయి నా కూతురండీ!" అన్నాడు. అంతే!

నాకు మతిపోయినంత పనయింది




సాయంత్రం ఐదు దాటింది

నే వెళ్ళేసరికి రజని వొక్కతేవుంది ఇంట్లో. మధ్యహాల్లో ఉయ్యాలబల్ల మీద కూర్చుని ఊగుతోంది మధ్య మధ్య కాళ్ళని నేలకేసి తాటిస్తూ–ధ్యాసని తాను చదువుతున్న ఏదో తమిళ పత్రికలో నిమగ్నం చేసింది

మొహం ఎత్తి "కూర్చో" అంది. బల్ల మీద ప్రక్కకి జరిగింది. కూచున్నాను.

ఉయ్యాల నిమ్మళంగా ఊగుతోంది. కిటికీలోనుంచి చల్లగా గాలి వీస్తోంది.

కాలి ఊతంతో ఉయ్యాలని ఆపి, నా కళ్ళల్లోకి చూసింది. "ఈ కవిత చూడు ఎంత అద్భుతంగా వుందో! గ్లాసు ఖాళీ అయినా తాగేస్తున్నానంటాడు. ఏదో ఉర్దూ కవితల అనువాదం పడింది."

నేను సన్నగా నవ్వేను. ఆ కవిత జిగర్‌ది – నాకు తెలుసు. ఆ పాదానికి ముందున్న పాదమూ తెలుసు.

ఆమె పుస్తకాన్ని ప్రక్కన పెట్టింది. "చెప్పు" అంది.

"నేను రేపు రాత్రి బయలుదేరుతున్నాను–" చెప్పేను.

ఒకసారి మౌనంగా నా కళ్ళల్లోకి చూసి చూపులు మరల్చుకుంది.

"కావాలని తెప్పించుకున్న బదిలీ. వెళ్ళక ఏంచేస్తావ్!"–నిష్ఠూరం!

మా యిద్దరి మధ్య ఏకవచన సంబో ధనలే అలవాటయినై మొదట్నుంచీ.

"నువ్వెలాగన్నా అనుకో. బదిలీ వచ్చింది. వెళ్ళక తప్పదుగా," కొంచెం బాధగానే అన్నాను.

ఉన్నట్టుండి నా ఎడమ అరచేతిని తన కుడి అరచేతిలోకి తీసుకుని నొక్కింది. ఆమె పరిస్థితి ఉద్విగ్నంగా వుంది. గమనించాను. కళ్ళనిండా నీళ్ళు! ఇది నాకు హఠాత్తుగా ఎదురైన సంభవం! నిలదొక్కుకున్నాను.

"ఛ... ఛ.... ఏవిటిది-పసిపిల్లలా" అన్నాను, అనునయింపుగా.

"అవును. నువ్ నన్ను నలభై ఏళ్ళ పసి పిల్లను చేశావు," అంది. ముకుపుటా లెగరేస్తూనే గలగలా నవ్వింది. నుదురు తళతళమంది, నా కాళ్ళవేపుతల వంచి పడుకుంది.

గోడకు వేలాడుతున్న 'మొనాలిసా' నవ్వుతోంది. ప్రక్కగా ఫ్రేమ్‌లో ఏదో 'లేండ్ స్కేప్', కొండల్లోనుంచి దుమికి గలగల పారుతూ మైదానాల్లోకి ప్రవేశిస్తోంది సెలయేరు.

నా కళ్ళల్లోకి చూస్తూ ంది రజని, "ఏమన్నా కబుర్లు చెప్పు"

"ఇన్నాళ్లూ నీ మాటల కాపీనంతో చాల వాక్యాలు బాంక్‌లో వేసివుంటావ్. నువ్వే విత్‌డ్రా చేయాలి." అన్నాను.

సన్నగా నవ్వింది. "నాట్" అంది. కళ్ళు చికిలించింది. "మళ్ళీ ఎన్నాళ్ళకో మనం కలుసుకోవడం" నిర్వేదంగా అని శూన్యంలోకి చూడసాగింది.

"అసలు కలుసుకుంటామని గ్యారంటీ ఏం వుంది?" ఎందుకనో తక్కున అన్నాను. వెంటనే నాలిక కిరుచుకున్నాను

ఉలిక్కిపడ్డట్టు లేచి కూర్చుంది రజని. జంగమూతి పెట్టింది "అంతే నన్న మాట." అంటూ చరాల్న ఉయ్యాల దిగి విసవిసా వంటగదిలోకి వెళ్ళింది.

గడియారం ఆరు కొట్టింది. లేచి లైట్ వేశాను.

కుర్చీలో కూర్చున్నాను.

అనవసరంగా రజని మనసు నొప్పించా ననిపించింది. ఆమె బేలతనం తెలుసు కనుక నొచ్చుకున్నాను.

నా ఆలోచన ఒక్కసారిగా వెనక్కు నడిచింది.

మూడేళ్ళ క్రితం బదిలీమీద ఈ వూరొచ్చాను. రజనితో పరిచయమైంది. ఆమె మా సంస్థలోనే వేరే డిపార్ట్ మెంట్‌లో ఆఫీసరు. వయస్సులో నా కంటే మూడేళ్ళు పెద్ద. త్వరలోనే మేము మంచి మిత్రులమయ్యాం. దీనికి కారణం - ఆమె డిపార్ట్‌మెంట్‌కి నేను నా విధి నిర్వహణకోసం అతి తరచుగా వెళ్ళిరావలసిన పరిస్థితి వుండటమే, ఆమె కొంచమే మాట్లాడేది. కానీ ఆ వ్యక్తిత్వంలో ఒక గాంభీర్యం, ఒకఆకర్షణ నన్ను ఆమెకు సన్నిహితుణ్ణి చేసినై

పరస్పరం గౌరవించుకోగల వివేకం విచక్షణా ఆ మైత్రిని మరింత ఉదాత్తం చేశాయని నా వుద్దేశ్యం.

రెండేళ్ళ క్రితం–

రజని భర్త ఆనందం హఠాత్తుగా గుండెపోటుతో మరణించాడు. ఆమె ఆ దుర్ఘటననుంచీ తేరుకోవడానికి నా సహాయసహకారాలూ, మాట సాయమూ కారణమని - ఆమె, ఆమె కొడుకు ప్రభాకర్ ఆమె 'మామి'–విశాలాక్షి చాలా సార్లు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చెప్పుకున్నారు. మా ఆఫీసులో చాలా మంది నన్ను మెచ్చుకున్నారు. రజని పట్ల ఉద్యోగుల్లో ఎనలేని గౌరవభావం వుండటాన, ఆమెతో సాన్నిహిత్యాన్ని పొందిన నాపట్ల కూడా వారికి వొక విధమైన గౌరవం, అభిమానం కలిగినై.

నేను తరచూ వాళ్ళింటికి వెళ్ళేవాణ్ణి. అప్పుడప్పుడు రజనీ, ప్రభాకర్ మా యింటికి వచ్చేవాళ్ళు. నా భార్య శారద కూడా వాళ్ళతో చాల కలుపుగోలుగా వుండేది. నలుగురం కలిసి వొకటి రెండుసార్లు కారు మాట్లాడుకుని పిక్నిక్ లకి వెళ్ళేము

ప్రభాకర్ ఇంటర్ కాగానే ఇంజనీరింగ్‌లో చేర్తానన్నాడు. కొడుకు తనకు దూరంగా ఎక్కడో వుండటం ఇష్టం లేదు, రజనికి. అతన్ని విడిచి వుండ లేనంది. నేనే చెప్పి వొప్పించాను. తండ్రిలా అతన్నీ ఇంజనీర్‌ని కానిమ్మ నచ్చచెప్పాను.

ప్రభాకర్ మాండ్యా వెళ్ళాడు.

నాలుగు నెలలు గడిచినై.

రజనికి జ్వరం వచ్చింది. వచ్చిన జ్వరం ఏ వైద్యానికీ లొంగలేదు. శారద వూళ్ళోలేదు–పుట్టింటికి వెళ్ళింది. 'మామి' చాల కలతపడింది. ఆమె దిగులుకు అంతేలేదు. నేనే ఇద్దరికీ ధైర్యం చెప్పాల్సి వచ్చింది. వారం తిరిగేసరికి – రజనికి పొంగు బయటి పడింది. ఆ తర్వాత పదిహేను రోజులు మశూచితో పెద్ద యుద్ధమే జరిపింది రజని ఆమె పరిచర్యలు నిజానికి నన్నూ సగం చేసినై.

ఒకసారి–

ఇద్దరమూ లాన్‌లో కూర్చున్నాము. రజని మల్లెపూలు కట్తోంది. అవును తాను భర్తపోయినా - పువ్వులు ముడవడం. బొట్టు కాటుక దిద్దటం, గాజులూ సొమ్ములూ వేసుకోవడం మానలేదు.

ఆమె అన్నది. "నీ సాన్నిహిత్య లో నేను పునర్జన్మే ఎత్తాను. నీ పరిచర్యలకీ ఆదరణకీ నేను నీకు ఆజన్మాంతరం ఋణపడి వుండాలి."

రజని కృతజ్ఞతకి నా మనస్సూ ఆనందంతో గంతులు వేసింది. తాదాత్మ్యంతో ఆమెకేసి పరీక్షగా చూసేను

రెండు లక్షలకు అధికారిణి నా కంటే పెద్దదే అయినా ఐదారేళ్ళు చిన్నదిగా




కనిపించే శరీర సౌష్ఠవం. నవలా నాయికల అందగత్తె. గౌరవ ప్రదమైన ఉద్యోగిని.

రజని నాకు అమృతంలా భాసించిన భావన! బహుశా దీనికి కారణం — నాకు అందమైన వాటిని ఆరాధించే దృష్టి వుండటంవల్లనేమో! బంగారానికి తావి అబ్బినట్లు అందానికి ఉదాత్తతని ప్రసాదించిన విలక్షణమైన ఆమె వ్యక్తిత్వం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. ఆదర్శవంతమైన పాత్రకు రూపకల్పన జరిగితే రజనిగా వెలుస్తుందనిపించేది నాకు. నా కలలకూ, ఆలోచనలకూ మూర్తిగా దర్శనమిచ్చేది—రజని. భావయుక్తమైన రాగంలా, అర్థవంతమైన కవితలా నా భావనలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకుంది—రజని!

ఆలోచనల నుంచి తేరుకున్నాను. ఎదురుగా రజని ఏదో మాట్లాడుతూ టీపాయ్ మీది ప్లేట్లు సర్దుతోంది. చూశాను. రెండు శాండ్‌విచ్‌లూ, రెండు కప్పుల ఐస్‌క్రీము. "తీసుకో" అంటూ ఎదురు కుర్చీలో కూర్చుంది.

నేను ఆమెకేసి తేరిపార చూశాను. చెక్కిళ్ళ మీద ఏడుపు చారలు! నిప్పుకణికల్ని ఏరుతున్నట్లయింది నా పరిస్థితి. శాండ్‌విచ్‌లూ, ఐస్‌క్రీమూ—నాకు ప్రాణం. అయినా ఉసలేకపోయాను.

మామీ వచ్చింది — చేతుల్లో పంచీలూ, బుట్టలూ! చీరలూ, పళ్ళూ, ఇతర వస్తువులూ తెచ్చినట్లుంది. పరిచయ[illegible] మందహాసం చేశాను. లోపలికి వెళ్ళిపోయింది.

"ఇంత కటువుగా ప్రవర్తించటానికి నేను ఆశించింది ఏమంత పెద్ద కోరిక!" అన్నది — స్పూన్‌తో ఐస్‌క్రీమును గుచ్చుతూ.

నేను మాట్లాడలేదు.

"చెప్పు రాజా" అంది నవ్వి. తలెత్తి ఆమెకేసి చూసి తలవంచుకున్నాను.

నాలో రేగిన భావాలను ఐస్‌క్రీమ్‌తో కలిపి దింగమింగేస్తూ "అయాం సారీ" అన్నాను.

క్షణం ఆగి అన్నది, "నేను పొద్దు తిరుగుడు పువ్వులాంటి దాన్ని రాజూ. నానుంచీ పారిపోతున్నావు గానీ, నా చూపు ఎప్పుడూ నిన్ను అంటే వుంటుంది."

నాకు వాతావరణం ఇరుగ్గా తోచింది!

"జస్ట్ వన్ మినిట్" అంటూ ఒవాలున ఇంట్లోకి వెళ్ళింది రజని. వీణ తీసుకువచ్చింది.

దోరగా నవ్వుతూ నా ఎదురుగా కూర్చుంది. కొంత సర్దుకుంది అంత త్వరగా వాతావరణాన్ని ఆహ్లాదం చేయటానికి పూనుకోవటమే రజని విశిష్టత అనిపించింది. సంగీత స్రోతస్విని సాగింది.

ఆమె వీణ వాయించడం ఎప్పుడు ఆపిందో గమనించలేదు నేను. నా పక్కగా కుర్చీలో కూర్చుంది ఏ విరాగం తీస్తూ నా చేతిని తన చేతిలోకి తీసుకుని, నా చూపుల్లో చూపులు కలిపి అన్నది— "ఈ ఎడారిలో ఒయాసిస్‌వి నువ్వు. అంతే నేను చెప్పగలిగింది" అని నవ్వింది. స్త్రీ పురుషుల మధ్య మైత్రికి అవకాశం వుంది— వుందని సంబరంతో నా మనస్సు చిందులు వేసింది.

ఎర్ర జరీఅంచు తెల్ల చీరలో ఆమె అందాన్ని చూసి మురిసిపోతున్నాను నేను.

క్షణాల తర్వాత ఆమె నా చూపుల్ని పసిగట్టింది. "సిల్లీ" అంది గలగలా నవ్వుతూ.

సెలవు లేదు, మా ప్రయాణం సంగతి మాకు కూడా చెప్పి, సెలవు తీసుకుని వచ్చేశాను.

తీరా యింటికి వచ్చిన తర్వాత— మనస్సు పొరల్లో ఏదో సన్నని బాధ మొదలైంది. రజనితో ఏమేమో మాట్లాడి వుంటే బాగుండేదనిపించింది. అవ్యక్తమైన వ్యధ మొదలైంది.

మర్నాడు—

రైల్వేస్టేషన్‌లో—

చేతిలో పాకెట్‌తో ప్లాట్‌ఫారమ్ మీదకొచ్చింది రజని. శారద చేతిని తన చేతిలోకి తీసుకుంది ఆప్యాయంగా ఆమెతో మాటలు కలిపింది. ఇద్దరూ పక్కకి వెళ్ళి మాట్లాడుకోసాగేరు. నేను ఇతర మిత్రులతో సంభాషిస్తున్నాను

క్షణాల తర్వాత. తమ దగ్గరికి పిల్చింది రజని. వెళ్ళాను. ఇది మీ ఇద్దరికీ" అంటూ పాకెట్‌ని అందజేసింది థాంక్స్ చెప్పాను.

ఆ బహుమతి ఏమైవుంటుందా అనే ఉత్సుకత కలిగింది.

రైలు కదిలింది అందరూ చేతులు వూపుతూ వీడ్కోలు చెప్తున్నారు. అంత మందికీ మధ్యగా — రజని! రుమాలుతో కళ్ళు వత్తుకుంటూ నిలబడింది. నేనూ



చెయ్యి వూపేను.

రైలు వేగం పుంజుకుంది.

సామాను సర్దుకొని సీట్లలో కూర్చున్నాం నేనూ, శారదా.

చీకటిని చీల్చుకుంటూ సాగిపోతోంది రైలు!

మరి కొంతసేపటికి–రజని ఇచ్చిన పాకెట్ విప్పి చూసేము రెండు బిల్లార్ అద్దాలు, వాటి మధ్యగా ఫుల్‌సైజ్ ఫోటో. దానిలో నేనూ, శారదా, రజనీ– ఒకరి పక్కగా మరొకరం. సాగర్‌కి వెళ్ళినప్పుడు మమ్మల్ని ముగ్గుర్నీ నిల బెట్టి ప్రభాకర్ తీసిన స్నాప్ అది! ఎన్ లార్జ్ చేయించిదన్నమాట.

రజని బహూమతికి ముగ్ధుణయ్యేను.

పాకెట్‌ని తిరిగి కట్టేస్తూ అన్నది, శారద–"ఆమెకి మీరంటే ఎంత ఆరాధనా అభిమానమో, మాట్లాడుతుంటే కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నై. పాపం, మీరు ట్రాన్స్‌ఫర్ కావడం తనకి పెద్ద షాకే."

శారద కేసి పరీక్షగా చూసేను. ఏ భావమూ లేదు ఆమె మొహంలో. చాలా మామూలుగా అన్నట్టువున్నది.

నాకు మాత్రం మనస్సు చివుక్కు మన్నది శారద ఆలోచన ఏమిటా అనే సందేహం కలిగింది, మా ఇద్దరి గురించి తానే అభిప్రాయం ఏర్పరచుకున్నదో అనే అనుమానమూ వచ్చింది.

మౌనంగా కూర్చున్నాను.

—'నీకు వొక్క సూటు కూడా లేక పోవడమేమిటి! నేను కుట్టిస్తాను వేసుకో చక్కగా బొద్దుగా ముద్దు పాపాయిలా వుంటావు.'

—'సిగరెట్ కాల్చని మగవాడంటే భలే కోపం. అలాంటి చిన్న చిన్న సరదాలు వుండాలి. వెన్నెల రాత్రి శ్రీఖండ్ తిని, కిల్లీ వేసుకుని సిగరెట్ కాలుస్తూ డాబామీద కూర్చుని కబుర్లు చెప్పుకోవడమో, వీణ వినడమో చేస్తుంటే 'థ్రిల్'గా వుండదూ!'

ఎప్పుడో రజని అన్న మాటలు గుర్తు కొచ్చినై నాకు. నేను ఆమె కోరికల్ని ఏనాడూ ఆమోదపరచలేదు.

శారద మాటలూ గుర్తుకొచ్చినై. 'పాపం మీరు ట్రాన్స్‌ఫర్ కావడం ఆమెకి పెద్ద షాకే.'

'నిజమా!' అనే ప్రశ్న నాముందు నిలిచింది. ఏమీ అర్థంకాలేదు.

—పది రోజుల తర్వాత!

రజని నుంచీ వుత్తరం వచ్చింది. కోరి బదిలీ చేయించుకున్నందుకు మళ్ళీ నిష్ఠూరంతో మొదలెట్టి ఏమేమో రాసింది.. మధ్యలో అన్నది, "మనం చేసే అన్ని చర్యలకి ప్రతిచర్యలు వుంటాయని గానీ, ఉండాలని గానీ అనుకోవడం తప్పని అర్థంచేసుకున్నాను రాజూ. అలాగే, నేను స్పందించినట్లు నీవు స్పందించాలని ఆశించడం కూడా సబబు కాదేమో మరి. అందుకనే నన్ను నన్నుగా మిగిల్చి నువ్వు వెళ్ళిపోయావు. అవును కదూ!"

శారదకు ఉత్తరాన్ని చూపించాను. చదివింది. పరీక్షగా నా కళ్ళల్లోకి చూసింది. "ఉత్తరాల్లో ఇంతకంటే ఏం రాసుకుంటార్లెండి" అన్నది.

నేను న్రమాన్పడిపోయాను. మనస్సు వికలమైపోయింది నామాట నాకు అప్ప జెప్పింద నిపించింది. అవును, ఎనిమిదేళ్ళ క్రితం శారదకూ ఇలాంటి వుత్తరమే వచ్చింది. ఆమె బావ వ్రాశాడు. చదవ మని నా కిచ్చింది. చదివి నేనన్నమాట ఇదే మరి!

జిగర్ కవితలో మొదటి పాదం చప్పున స్ఫురించింది. బే ఖైఫ్ దిల్‌హై ఔర్ జియే జ్యాహాహుం." ఆనందం లేకున్నా జీవిస్తున్నానంటాడు!

ప్రేమ కథల ముగింపులన్నీ ఇంతే కాబోలు!!

# మేకకొమ్ములు



అంగర సూర్యారావు

అబ్బుల్ని అతి గారాబంతో పెంచింది తల్లి. వాడికి తనవూరు, తన మేనమామ వూరు తప్ప ప్రపంచం తెలియదు. పుట్టి పెరిగిన తర్వాత వాడు చూసిన లోకం అంతా అదే! వాడికి ఈ చిన్న ప్రపంచంలో ప్రాణప్రదమైనవి రెండే! ఒకటి తల్లి! రెండోది మేక!— ఆ మేక వాడి జీవితంలో ప్రవేశించి రెండేళ్ళయ్యింది. తల్లితో కలిసి మేనమామ ఇంటికి వెళ్ళినప్పుడు యీ మేక అతనికి దొరికింది. అప్పటికి అది నెలరోజుల పిల్ల. వాడు వచ్చింది మొదలు వెళ్ళేవరకూ ఆ మేక పిల్లతోనే ఆడుకోడం చూసి మేనమామ వాడికి ఆ మేకపిల్లను ఇచ్చేశాడు. "తోలుకు పోరా అబ్బులూ" అన్నాడు.

ఆరోజు వాడి ఆనందానికి అవధులు లేవు ఆ వేళనుంచీ మేకపిల్ల వాడి జీవితంలో చోటుచేసుకొంది ఉదయం దానికి ఆకులూ, పచ్చగడ్డి వేసి - దాని వొళ్ళు నిమిరి-పనిలోకి వెళ్ళేవాడు. అది మేత తినడం మానేసి-వాడికేసే చూస్తూ అరిచేది 'నన్ను వదిలిపెట్టి వెళ్ళిపోతున్నావా?' అని జాలిగా అడుగుతున్నట్లు వుండేది ఆ అరుపు.

సూర్యాస్తమయం తర్వాత దడికి వున్న తలుపు తొలగించుకొని లోపలకు వస్తున్న అబ్బుల్ని చూడగానే "అమ్మా! అన్నయ్య వచ్చేశాడు." అని సంతోషంతో చెబుతున్నట్లు వుండేది దాని అరుపు. అబ్బులు సరాసరి దాని దగ్గరకు వెళ్ళి కూర్చుని వొళ్ళు నిమిరేవరకూ అది అరుస్తూనే వుండేది.

స్వల్పకాలంలోనే మేకభాష అబ్బులికి వచ్చేసింది. అది ఒక రకంగా అరిస్తే మంచినీళ్ళు కావాలని అర్థం! మరో రకంగా అరిస్తే మేత కావాలని పిలుపు! ముందు కాళ్ళు పైకెత్తి అరిస్తే "ఆడుకోడానికి టైమయ్యింది నన్ను రాటనుంచి విప్పు!" అని భావం.

దానికి వయసుతోపాటు కొమ్ములు కూడా పెరుగుతున్నాయి - ఆ కొమ్ములకు దెబ్బతగలకుండా అబ్బుల్ని పొడుస్తూ-

అతనితో ఆటలాడుతూ వుండేది. వాళ్ళమ్మ తిట్టి భోజనానికి పిలిచేవరకూ వాడు మేకతో ఆడుతూనే వుండేవాడు.

పాపమ్మకు ఇరవైయేళ్ళ ప్రాయం లోనే భర్త పోయాడు. భర్త పోయేసరికి అబ్బులు వయసు రెండేళ్ళు. ఆమె తన ఆశలన్నీ కొడుకుమీదే పెట్టుకొంది తోటి ఆడవాళ్ళతో పొలాలలోకి వెళ్ళి కూలిపనులు చేసుకుంటూ కొడుకును పెంచుతోంది. వాడికి ఆరేళ్ళ ప్రాయం వచ్చినప్పటినుంచీ వాణ్ణి కూడా తనతోనే పనికి తీసుకుపోయేది. ఊడుపులకు, కలుపుతీతకు, కోతలకు - పదహారేళ్ళ ప్రాయం వచ్చేవరకూ వాణ్ణి తనతోనే తీసుకుపోతూ వుండేది.

వయసొచ్చిన కుర్రాణ్ణి ఆడాళ్ళమధ్య తిప్పడం మంచిది కాదని నలుగురూ నచ్చచెప్పిన తర్వాత పాపమ్మ కొడుకును సాటి మగవాళ్ళతో పొలం పనులకు పంప డానికి వొప్పుకుంది - పదహారేళ్ళ వరకూ తల్లి కొంగేపట్టుకు తిరిగాడు. అందుకే వాడికి ప్రపంచజ్ఞానం తక్కువయ్యింది. వాడు పుట్టి పెరిగిన వూరు గురించి కూడా వాడికి తెలియదు. వాడిమీద పరులకన్ను పడకుండా వాణ్ణి జాగ్రత్తగా పెంచింది.

వాణ్ణి పదిమంది మగాళ్ళతోనూ పని లోకి పంపేముందు వాడికి కొన్ని జాగ ర్తలు చెప్పింది. ఎప్పుడూ ఎలాంటి పరిస్థితిలోనూ ఆ వూరి కామందు పట్టాభి గారి పనిలోకి వెళ్ళొద్దని చెప్పింది. వాళ్ళింటి దరిదాపులకు కూడా పోవద్దని చెప్పింది.

తల్లి చెప్పినట్టే అబ్బులు నడుచు కుంటున్నాడు. ఆ వూళ్ళోవున్న పొలా లలో సగానికిపైగా పట్టాభిగారివే అయినా వాళ్ళ పొలంలో కూలికిగాని, వాళ్ళింటి గదులలోకి ధాన్యం ఎత్తడానికి గాని అబ్బులు ఎప్పుడూ వెళ్ళలేదు.

కూలికి వెళ్ళే యువకులలో పట్టాభికి వ్యతిరేక వర్గం ఒకటి వున్నట్టు - వాళ్ళు ఏనాటి నుంచో ఆయన పనుల్ని బహిష్క రించినట్టు - కొన్నాళ్ళు పెరిగిన తర్వాత అబ్బులికి తెలిసింది.

అబ్బుల్ని తోటి రైతుకూలీలంతా అభిమానంతో చూసేవారు. వాడు మేక లాంటి వాడు అని వేళాకోళం చేసేవారు. వాడు వొళ్ళు వంచి కష్టపడి పనిచేస్తాడు. వాడికి ఎప్పుడూ ఎవరితోనూ ఏ తగువూ రాలేదు. ఎవరైనా తిట్టినా ఎదురుచెప్ప కుండా తల వొంచుకు వెళ్ళిపోయేవాడు. అందుకే అందరూ అతనిని అభిమానంతో చూసేవారు

మరి కొంతకాలం గడిచేసరికి వాడికో రహస్యం తెలిసింది. నడినెత్తిమీదికి సూర్యుడు వచ్చిన తర్వాత కూలీలంతా పొలంగట్టుమీద కూర్చుని - ముంతలు విప్పుకొని భోజనాలు చేస్తూ కబుర్లు చెప్పు కోడం రివాజు ఆ కబుర్లలో అనేక సంగతులు దొర్లుతూ వుండేవి. అబ్బులు మౌనంగా వింటూ వుండేవాడు. వాటిని





పట్టించుకొనేవాడు కాదు. ఇతరులకు చెప్పేవాడూ కాదు. —ఒకసారి కూలికి వెళ్ళినప్పుడు పెద్దయ్య తారసపడ్డాడు. అతనికి దాదాపు నలభై ఐదేళ్ళుంటాయి. అబ్బుల్ని చూసి అతను సంతోషించాడు. "నువ్వు రాజయ్య కొడుకువా? - అలాగ చెప్పు. పోలికలు కనపడతన్నాయిలే." అన్నాడు. అబ్బుల్ని చూడగానే పెద్దయ్యకి పదహారేళ్ళనాటి సంగతులు గుర్తుకు వచ్చాయి. "ఎవరికీ చెప్పకండిరోయ్! కొంపలు మునిగిపోతాయి." అంటూ ఆ ఆరుగురు కూలీలకూ ఆరహస్యం చెప్పేశాడు.

"రాజయ్య మంచి అందగాడు. ఇప్పుడు అబ్బులుగాడు ఎలాగున్నాడు? అలాగే కండలు మెలితిరిగి వుండేవాడు. అదికి అప్పుడు ముప్పయియేళ్ళన్నా వుండవు. అదూ కోటయ్యగాడూ పట్టాభిగారి కమతంలో చిన్నోళ్ళప్పుడ్నుంచీ పనులు చేసేవోరు. ఆ గుంటనక్క కోటయ్య గాడు యిప్పుడికీ పట్టాభిగారి కొలువులోనే వున్నాడు పట్టాభి చెల్లెలు రాజయ్య మీద మోజుపడింది. అళ్ళిద్దరికీ ఎలాగ కలిసి పోయిందో ఎవరికీ తెలియదు. కలిసి పోయింది. ఈ సంగతి కోటయ్యగాడు కనిపెట్టేశాడు దాన్తో పట్టాభిగారికి కబురందింది. కబురందిన మూడోనాడే గాదిపక్కని రాజయ్య చచ్చిపడివున్నాడు. అదికి యిషం పెట్టి సంపేశారని అందరికీ తెలుసును, కానీ గుండె ఆగి సచ్చిపోయాడన్నారు. మునసబు, కర్ణాలు యిద్దరూ అలాగే అన్నారు. అణ్ణిమాసేతులతోనే బుగ్గిసేసేశాం" అన్నాడు కళ్ళొత్తుకుంటూ

ఈ సంగతి వినగానే అబ్బులు పసి హృదయంలో అశాంతి మొలకెత్తింది. తన తల్లి తనను పట్టాభి పనిలోకి ఎందుకు వెళ్ళొద్దందో అతనికిప్పుడు తెలిసింది. అయినా తల్లిని ఏమీ అడగలేదు. అయ్యం

దేదో అయిపోయింది. ఇప్పుడేం చెయ్యగలం? అదంతా మరిచిపోయి తల్లి ఎలా బ్రతుకుతుందో-తనూ అలాగే బ్రతకడం మంచిది అనుకున్నాడు. ఆ సంగతి మరచిపోడానికి ప్రయత్నించాడు.

అది కుగ్రామం. వూరంతా అస్తవ్యస్తంగా - చెల్లాచెదురుగా-అక్కడొక పాక, ఇక్కడొక గుడిసె, అక్కడొక లోగిలి వుండి-ఆకారంలో అదొక మురికివాడలాగ కనిపిస్తోంది వూరికి అవతల కొసని పట్టాభి మేడ వుంది. మేడ చుట్టూ ఎత్తయిన ప్రహారీగోడలు వున్నాయి. మేడ వెనక గదులు వున్నాయి. ముందు వున్న పెద్ద గేటులోంచి కారు సరాసరి లోపలికి రావడానికి వీలుంది. ముందు భాగంలో గారేజి వుంది. ఆ వూరికి జమీందారైనా, రాజైనా పట్టాభే -పట్టాభి తండ్రికి పరమ కర్కోటకుడని పేరు వుంది. వాళ్ళకు మొదట పదెకరాల పొలం మాత్రమే వుండేది తండ్రి జీవితకాలం లోనే ఆ పదిఎకరాల పొలం వంద ఎకరాలకు పెంచి ఆ ఆస్తి అంతా పదిలంగా కొడుక్కి యిచ్చి పరమపదించాడు. సంసార బాధలకు-అప్పులకు- వాటిమీద వడ్డీలకు తట్టుకోలేక ఆ వూరి చిన్న రైతులు కాల్రకమేణా వాళ్ళకువున్న కొద్దిపాటి భూముల్ని అమ్ముకున్నారు దాన్తో ఆ చిన్న రైతులంతా వ్యవసాయ కూలీలుగా మారిపోయారు. ఆ వూరికి అరుమైళ్ళ దూరంలో చిన్న పట్నం ఒకటి వుంది. తాలూకాకు కేంద్రం.- ఆ పట్నంలో వుండే కొందరు ధనవంతులకు యీ పల్లెలో పొలాలు వున్నాయి వాళ్ళు యిక్కడికొచ్చి సాగు చెయ్యరు. కౌలుకు యిస్తూ వుంటారు. ఆ పల్లెలో వున్న కుర్రకారంతా ఆ పొలాల్లో పని చెయ్యడానికే యిష్టపడతారు. దాన్తో పట్టాభికి పొరుగూరు నుంచి కూలీలను తెచ్చుకోవలసిన పరిస్థితి వచ్చింది. ఈ వూరి కూలివెధవలకి బుద్ధి చెప్పాలను కున్నాడు పట్టాభి. తన దగ్గరవున్న గూండాలకు తోడు- తను ఎప్పుడు పిలిస్తే అప్పుడు పట్నం నుంచి వచ్చేలాగ కొందరు కిరాయి గూండాలను కుదుర్చుకున్నాడు ఏమాత్రం చిన్న తగువు వచ్చినా గూండాలు రంగంలోకి దిగి దౌర్జన్యం చేస్తున్నారు. అవూరు యువకులలో చాలామంది ఆ గూండాల చేతుల్లో దెబ్బలు తిన్నారు. కానీ యింతవరకూ వాళ్ళు ఎదురుతిరగలేదు.

ఆస్తి పట్టాభి చేతికి వచ్చిన పదేళ్ళ లోనే ఆ తాలూకా పట్నంలో ఒక మిల్లు కొన్నాడు. అక్కడే అన్ని సౌకర్యాల తోనూ ఒక మేడ కట్టించాడు. నెలలో కొన్ని రోజులు పట్నంలోనే కుటుంబంతో సహా మకాంచేస్తూ వుండేవాడు. రాజకీయ నాయకుల్ని, ఉన్నతాధికారుల్ని ఆహ్వానించి వారికి విందులు, వినోదాలూ ఏర్పాటుచేసేవాడు.

అబ్బులు యింటికి పదిగజాల దూరం లోనే పట్టాభి పొలం వుంది. మూడు తరాల నుంచి - అంటే అబ్బులు, వాడి తండ్రి, తాత - ఆ తాటాకుల కొంపలోనే వుంటున్నారు ఆ యింటికి చేర్చి వున్న పొలం మాత్రం ఎన్నో చేతులు మారి యిప్పుడు పట్టాభి కమతంలో కలిసి పోయింది. ఏడాదికి నాలుగైదుసార్లు పట్టాభి ఆ పొలంలోకి వస్తూవుంటాడు. అతని ముఖం కనపడకుండా వుండడం కోసం పాపమ్మ తన యింటిచుట్టూ దడి కట్టించుకొంది ఆ విధంగా ఆ యింట్లో వున్నవాళ్ళు పొలంలో వున్నవాళ్ళకు, పొలంలో వున్నవాళ్ళు యింట్లో వున్న వాళ్ళకు కనిపించకుండా కట్టుదిట్టం చేసింది.

రోజులు గడుస్తున్నకొద్దీ పట్టాభికి, వూళ్ళోవున్న రైతుకూలీలకూ మధ్య ఉద్రేకాలు పెరుగుతున్నాయి వాళ్ళ దూడలు వీళ్ళ పొలంలోకి వచ్చాయనో, వాళ్ళ పిల్లలు వీళ్ళ చెట్లకాయలు కోసేశారనో నిత్యం తగువులు జరుగుతూ వుండేవి. ఆ పేదరైతుల దూడల్ని బందెలదొడ్డికి తోలేస్తూ - వాళ్ళ పిల్లల్ని చిదగ్గొడుతూ నానా భీభత్సం చేస్తున్నారు. ఇంత కల్లోలం చెలరేగుతున్నా పట్టాభి మాత్రం ఎప్పుడూ జనంమధ్యకు రాలేదు - అతని అనుచరులే అన్ని పనులూ చక్కబెడుతున్నారు పట్టాభి మనుషులు ఎన్ని ఘోరాలుచేస్తున్నా ఆ వూరి పేదరైతులు పెదవులు విప్పలేదు. కొడుకుల్ని కదల నివ్వలేదు. తిరుగుబాటు ప్రోత్సహించ లేదు. బలవంతుడితో వైరం వద్దని-అది ప్రమాదం అని - దేవుడి మీద భారంవేసి వూరుకోమని - ఆవేశపడుతున్న యువకు లకు పిరికిమందు నూరిపోస్తున్నారు.

అబ్బులు మాత్రం అవేవీ పట్టించుకో లేదు. వాడికి తన మేక, తన తల్లి, తన యిల్లు తప్ప - మిగిలిన లోకంతో ఏ విధమైన ప్రమేయం పెట్టుకోలేదు. వాడు అలవాటుపడిన - గానుగెద్దులాంటి నిత్యజీవిత గమనానికి అంతరాయం రానిచ్చేవాడు కాదు

ఇలా వుండగా—వాడు ఎన్నడూ అను కోని సంఘటన ఒకటి జరిగింది. ఎప్పటి లాగే ఆరోజు సాయంత్రం ఆరు గంట లకు పొలంనుంచి తిరిగివచ్చేసరికి వాడికి మేక కనిపించలేదు లోపలికి వెళ్ళిచూస్తే తల్లీ కనిపించలేదు వాడి మనసు ఏదో కీడు శంకిస్తోంది మేకను కట్టే రాటదగ్గర చతికిలపడ్డాడు అంతలో తల్లి లోపలికి వచ్చింది వస్తూనే "మేక నెవరో తోలుకు పోయార్రా అబ్బులూ" అంది ఆ మాట వినగానే వాడికి నవ నాడులూ కృంగిపోయాయి

పాపమ్మ పనిలోంచి తిరిగివచ్చేసరికి తడిక తెరిచివుంది. లోపలికి వచ్చిచూస్తే మేక లేదు మేకను వెతుక్కుంటూ చుట్టుపట్ల యిళ్ళన్నీ తిరిగింది. అబ్బు లొచ్చే వేళయ్యింది; వాదేం కంగారు

పడతాడో అని తిరిగివచ్చేసరికి ఆమెకు అబ్బులు కళ్ళనీళ్ళతో కనిపించాడు. తల్లి చెప్పిన సంగతి వినగానే వాడు వూళ్ళోకి బయలుదేరాడు.

అబ్బులు వూరంతా తిరిగాడు. కనిపించిన వాళ్ళనందర్నీ అడిగాడు అందరూ ఒకే ఒక సమాధానం చెప్పారు. మేకను ఎవరు తోలుకుపోయారో ఎవరికీ తెలియదు వాళ్ళింటి చుట్టుపట్లవున్నవాళ్ళలో అడామగా అంతా పొలంపనులలోకి వెళ్ళిపోతారు సాయంత్రానికి కానీ యిళ్ళు చేరుకోరు. పదేళ్ళలోపు పిల్లలు మాత్రమే యిళ్ళలో వుంటారు. మరీ కదలలేని ముసలివాళ్ళు యింటిపట్టున వుంటారు. అలాంటివాళ్ళు ఆ ప్రాంతంలో యిద్దరే వున్నారు. వాళ్ళు కూడా తెలియదన్నారు.

మతి చలించినవాడిలాగ అబ్బులు అలాగ తిరుగుతూనే వున్నాడు పనిలోంచి వచ్చిన తర్వాత వాడు వొళ్ళు కడుక్కోలేదు. గంజినీళ్ళయినా కడుపులో పోసుకోలేదు వూరంతా తిరిగిన తర్వాత పొలం, పుట్టా. వెతకడం సాగించాడు. తోటలూ, దూళ్ళశాలలూ వెతికాడు బాగా చీకటి పడిపోయింది.

"జోళ్ళు లేకుండా చీకట్లో తిరుగుతున్నావు. ఏ పామైనా కరవగలదు. ఇంటికెళ్ళిపోరా." అని తోటకు కాపలావున్న ఒక రైతు మందలించాడు

నిరాశా నిస్పృహలతో తిరిగి వూళ్ళోకి వచ్చాడు. వాడు చూడని చోటు ఒకటే వుంది. ఈ స్థితిలో వాడు తల్లి గీచిన లక్ష్మణరేఖను దాటెయ్యడానికే నిశ్చయించుకున్నాడు. పట్టాభి యింటికేసి బయలుదేరాడు. రాత్రి పది గంటలు దాటినా పట్టాభి యిల్లు కళకళలాడుతూ వుంది. పై అంతస్తులో ఎలక్ట్రిక్ దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. ఇంటి ముందు కార్లూ, మోటారుసైకిళ్ళు ఆగి వున్నాయి. మేడ రెండో అంతస్తులో చాలామంది మనుషులు అటూయిటూ తిరుగుతున్నారు. ఆ యింట్లో శుభకార్య మేదో జరుగుతున్నట్టు వుంది ఆ యింటి ప్రహారీగోడల చుట్టూ తిరిగిచూశాడు. పెరటి తలుపులమీద చెయ్యివేసి చూశాడు. ఉక్కు గోడలులాగ గట్టిగా చలనం లేకుండా వున్నాయి విధిలేక తలవంచుకొని యిల్లు చేరుకున్నాడు

"ఎక్కడికి వెళ్ళిపోయావురా బాబూ? ఇంత రేత్రిదాకా ఎందుకు తిరుగుతున్నావురా బాబూ? నువ్వేమైపోయేవో అని జడిసిపోయాన్రా నాయనా! రా! కొంచెం బువ్వ తిను." పాపమ్మ కళ్ళు నీళ్ళతో నిండివున్నాయి. ఆమె యింతవరకు మంచినీళ్ళు కూడా తాగలేదని తెలుసుకున్నాడు. తను తినకపోతే తల్లి కూడా పస్తు వుండిపోతుంది విధిలేక కంచం ముందు కూర్చున్నాడు

ఆ రాత్రి వాడికి నిద్రపట్టలేదు కన్ను మూసినా తెరచినా - దీనంగా తనకేసి చూసి అరుస్తున్న మేక కనిపిస్తోంది.




తెల్లవారగానే తిరిగి మేక కోసం వెతుకుతున్నాడు. ఆడామగా అంతా పొలం పనులకు వెళ్ళిపోయారు. తల్లి కూడా పనిలోకి వెళ్ళిపోయింది కష్టాలకు అలవాటుపడ్డ ప్రాణం ఆమెది. చెట్టంత భర్త పోయినా ఆ కష్టానికి తట్టుకొంది. మేక పోయినందుకు ఆమెకు బాధ కలిగినా వెంటనే తేరుకొంది. నిత్యకృత్యాలు మానలేదు.

అబ్బులు పుట్టి పెరిగినతర్వాత వాడి వచ్చిన తొలికష్టం యిదే. వాడు మేక మీద మమకారం పెంచుకున్నాడు. ఆ మమకారమే యిప్పుడు అంతులేని వ్యధకు దారితీసింది. బాగా పొద్దెక్కిన తర్వాత – బొంగరాలు ఆడుతున్న ఒక చిన్న కుర్రాడు సమాచారం చెప్పాడు

గట్టిగా అరుస్తున్న మేకని ఒకడు ఆ పెద్దింటికి తోలుకుపోయాడని చెప్పాడు. వాడు చెప్పిన ఆనవాళ్ళన్నీ తన మేకకు సరిపోయాయి. వాడు చెప్పిన పోలికలన్నీ కోటయ్యకు సరిపోయాయి

అబ్బులు వెంటనే పెద్దింటికేసి పరిశీలించి చూశాడు. అక్కడ నరసంచారం లేదు. రాత్రి తను అక్కడ చూసింది మనుషుల్నా? దెయ్యాల్నా? అనుకున్నాడు. ఆ సమీపంలో వున్న ఒక చెట్టెక్కి చూశాడు కింద భాగంలో కూడా మనుషులు లేరు తలుపులు మూసివున్నాయి చెట్టు దిగాడు గోడదూకి లోపలికి వెళ్ళి చూడడానికి నిశ్చయించుకున్నాడు. ప్రహరీ గోడ చుట్టూ తిరిగి చూస్తున్నాడు. ఒక చోట గోడకు చేర్చి పెంటకుప్ప వుంది. దానిమీది నుంచి గోడ ఎక్కడానికి సులువుగా వుంది. వాడు కుప్పమీదికి ఎక్కుతున్న సమయంలో కుప్పపైని వున్న తుక్కు దూగరాతోపాటు రెండు మేక కొమ్ములు వచ్చి వాడి కాళ్ళమీద పడ్డాయి వాటిని చూడగానే వాడి కళ్ళు బైర్లు కమ్మాయి. ఇక గోడ దూకవలసిన పని లేదు తన మేకను చంపుకు తినేశారు. వాడు ఎలా వెళ్ళాడో వాడికే తెలియదు. అక్కడికి రెండు ఫర్లాంగులు దూరంలో వున్న చెరువు దగ్గరకు వెళ్ళాడు. చెరువు గట్టుమీద ఒక చెట్టుకింద కూర్చుని మేక కొమ్ముల్ని వొడిలో పెట్టుకొని భోరున ఏడ్చాడు. జీవంతో ఎగిరిపడే ఆ కొమ్ములకు తను ఎన్నోసార్లు బంతిపువ్వుల దండలు కట్టాడు మువ్వలు కట్టాడు. ఆ కొమ్ములలో ఎక్కడ ఏ మెలిక వుందో—ఏ మెలికలో ఏ సొగసు వుందో వాడికి బాగా తెలుసు. అలాగ ఏడుస్తూ ఎంతసేపు కూర్చున్నాడో వాడికే తెలియదు. పొద్దు వాలిపోతున్న సమయంలో పొలాలనుంచి మనుషులు తిరుగుముఖం పట్టే సమయంలో — అబ్బులు అక్కడి నుంచి లేచి యింటిముఖం పట్టాడు.

పాపమ్మ యింట్లో అడుగుపెట్టగానే—నులకమంచంమీద పడుకొని వున్న కొడుకుని చూసింది గాబరాపడుతూ వాడి దగ్గరకెళ్ళి "ఏరా బాబూ! ఏమయ్యింది?" అంది వాడు జరిగినదంతా తల్లికి చెప్పి మేక కొమ్ములు చూపించాడు తల్లి కూడా వాటిని గుర్తుపట్టింది గుర్తుపట్టగానే దుఃఖం ఆపుకోలేకపోయింది. పట్టాభికీ, కోటయ్యకీ తమ కుటుంబం మీద యింకా పగ చల్లారనందుకు వాళ్ళిద్దరినీ తిట్టి శాపనార్థాలు పెట్టి - ఆ తర్వాత కొడుకును వోదార్చింది.

రెండు వారాలు దాటినా ఆ దుఃఖం నుంచి అబ్బులు తేరుకోలేదు. పనిలోకి వెళ్ళడం మానేశాడు. ఇంటిలోంచి యివతలకు రాలేదు. తల్లి బలవంతంచేస్తే కొంచెం గ జితాగి - నులకమంచం మీద పడుకుంటున్నాడు. వాడి పరిస్థితి చూస్తే తల్లికి భయంవేసింది. తన కొడుకు తనకు దక్కకుండా పోతాడేమోనని




కొంతసేపు చలనం లేకుండా వుంటాడు. ఆ తర్వాత వాటిని తిరిగి సంచిలో పెట్టి భద్రంగా చూరులో దాచేసి—గంజి తాగి పనిలోకి వెళ్ళిపోతూ వుంటాడు.

పాపమ్మకు భర్త మరణం తర్వాత కొడలి దారుణ హత్య పిడుగులాగా తగిలింది. ఆమె నెల రోజుల వరకూ మంచం దిగలేదు. ఆ తర్వాత లేచి తిరిగినా ఆమె మునుపటి మనిషి కాలేదు.

చిన్నమ్మి హత్య జరిగిన నాటినుంచీ ఆ వూరి వాతావరణం మారిపోయింది. వయసొచ్చిన ఆడపిల్లల్ని గడప దాట నివ్వడంలేదు. ఏ ముసలమ్మనో యింటికి కాపలా పెట్టి పెద్దవాళ్ళు పొలాల్లోకి వెళు తున్నారు దీపాల వేళకు పొలం నుంచి తిరిగివచ్చి తమ పిల్లల్ని మూసుకొనే వరకూ వారి మనసులలో ఆరాటం తగ్గడంలేదు. రాత్రి ఏడుగంటల తర్వాత మగ పిల్లల్ని కూడా యిళ్ళోంచి పైకి వెళ్ళనివ్వడం లేదు పాము పడగ నీడను కూర్చున్నట్టు ఆ వూరి ప్రజలు భయకంపితులై ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని కూర్చున్నారు.

ఆరు నెలలు గడిచిపోయాయి చిన్నమ్మి హత్య పాతబడి పోయింది. కేసూ పాతబడి పోయింది. అయినా ప్రజలలో భయం తగ్గలేదు. ఇంకా ఎక్కువయింది. ఎవరైనా ఆ వూరు వచ్చి చూస్తే అక్కడి పరిస్థితులు ఎంతో ప్రశాంతంగా కనిపిస్తున్నాయి. ఆవూరి ప్రజలంతా మౌనంగా ఎవరి పనులలోకి వాళ్ళు వెళుతున్నారు. వారిలో సంతృప్తి

కాని అశాంతి మచ్చుకైనా కనిపించటం లేదు.

అంత ప్రశాంతంగా వున్న ఆ పల్లెలో ఒకనాటి సూర్యోదయ సమయంలో సంచలనం కలిగింది. దావానలంలా క్షణంలో ఆ వార్త వూరంతా పాకిపోయింది. పొలాల్లోకి వెళ్ళినవాళ్లు పనికూడా వదిలేసి వురకలు పరుగులు వూళ్లోకి వచ్చారు.

ఎప్పటిలాగ పాలికాపు పొలంనుంచి పాలకావిడితో వచ్చేసరికి—పెద్దింటి గేటు తెరిచిలేదు. వాడు అరిచి పెడబొబ్బలు పెట్టినా ఎవరూ వచ్చి తలుపు తియ్యలేదు. వాడు గేటుదూకి లోపలికివెళ్లి చూసేసరికి రక్తంమడుగులో తల మొండెం పడివున్నాయి. మేడమీదికి వెళ్లి చూస్తే పట్టాభి పడకగదిలో కూడా అలాంటి దృశ్యమే కనిపించింది: ఆ రెండు శవాలు తప్ప ఆ మేడలో సజీవులు కాని నిర్జీవులు కాని లేరు.

ఈ వార్త ఆ పక్కనే పట్నంలో వున్న పట్టాభి కుటుంబానికి చేరింది. జిల్లా పోలీసు యంత్రాంగం అంతా అక్కడదిగింది. పరిశోధన సాగించారు. మేడకింద వరండాలో పడుకున్న కోటయ్యనూ, మేడమీద పడకగదిలో పడుకున్న పట్టాభినీ ఎవరో కసాయి కత్తితో దారుణంగా నరికి చంపేశారు — ఆరాత్రి ఎనిమిది గంటలకు తాను వెళ్లిపోయేసరికి పట్టాభి, కొటయ్య తప్ప ఎవరూ ఆయింట్లోలేరని పనిమనిషి చెప్పింది. ఆ పడకగది అంతా శోధించిన పోలీసులకు పట్టాభి శవం పక్కని పసుపుతాడుకు కట్టిన రెండు మేక కొమ్ములు కనిపించాయి

ఆ పసుపుతాడు, మేక కొమ్ములు తామెపుడూ చూడలేదని — అవి తమ యింట్లోవి కావని — పట్టాభి కుటుంబ సభ్యులు చెప్పారు. వూళ్లోవాళ్లు కూడా వాటి గురించి తమకేమీ తెలియదని— ఎప్పుడూ చూడలేదని చెప్పారు.

పోలీసులు యింకా నిశితంగా ఆ పడకగది పరిశీలించగా — ఒక మూల చిట్లినగాజుపెంకులు, నలిగిన పూలదండ కనిపించాయి. ఆ రాత్రి ఆగదిలో ఎవరో ఆడమనిషి కూడా వున్నట్టు అనుమానం వచ్చింది. దర్యాప్తు చెయ్యగా పట్నం నుంచి అప్పుడప్పుడు ఎవరో ఆడవాళ్లు కారులో రాత్రి పదిగంటలకు వచ్చి తెల్లవారుఝామున వెళ్లిపోతు వుంటారని తెలిసింది. పట్టాభిగారి డ్రైవర్ని పట్టుకున్నారు. పట్నంలో వున్న ఆ ఆడమనిషిని కూడా ప్రశ్నించారు. ఆ రాత్రి పదిగంటలకు వచ్చి తెల్లవారుఝాము రెండుగంటలకు వెళ్లిపోయినట్టు ఆవిడ డ్రైవర్ కూడా చెప్పారు.

తెల్లవారుఝాము మూడూ ఐదు గంటల మధ్య హత్యలు జరిగినట్టు శవ పరీక్షలో కూడా తేలింది. ఈసారి పోలీ

భయపడింది. ఇరుగూ పొరుగూ - చోటు మార్చమని సలహాయిచ్చారు.

పాపమ్మ కొడుకుని బలవంగా పుట్టింటికి తీసుకువెళ్ళింది. ఆపద నుంచి తప్పించమని అమ్మను సాయంకోరింది. అంతకంటే అందమైన మరో మేకను తీసుకు వచ్చాడు. అబ్బులు దానికేసి కన్నెత్తి చూడలేదు. ఒక ఆవుదూడను యివ్వబోయాడు. అదీ వద్దన్నాడు అబ్బులు మేనమామకు అప్పుడొక ఆలోచన వచ్చింది. ఆతగాడికి దూరపు బంధువు ఒకడు ఆ వీధిలోనే వున్నాడు అతగాడికి ఇప్పుడిప్పుడే వయసొస్తున్న కూతురొకతె వుంది. ఆ పిల్లని అందరూ చిన్నమ్మి అనే పిలుస్తారు. ఆ వీథికంతకీ అల్లరిపిల్ల. ఆ పిల్ల అబ్బుల్ని చూసినప్పటినుంచీ వాడిని వేళాకోళం చెయ్యసాగించింది అయినా అబ్బులు వుడుక్కోలేదు. పైగా వాడి పెదాలమీద చిరునవ్వు కనిపించింది.

అబ్బులు తల్లి, మేనమామ కూడ బలుక్కొని-వాడికి ఆ పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యడానికి నిశ్చయించారు అబ్బులు యీసారి వద్దనలేదు సూక్ష్మంలో మోక్షంలాగ అబ్బులికి, చిన్నమ్మికీ గుళ్ళో పెళ్ళయ్యింది. ఒకానొక శుభ ముహూర్తంలో చిలకలాంటి చిన్నమ్మిని, తల్లినీ తీసుకొని వూళ్ళో అడుగు పెట్టాడు అబ్బులు.

చిన్నమ్మి తెల్లగా, ముద్దుగా కడిగిన ముత్యంలాగ వుందన్నారు, చూడ్డానికి వచ్చిన ఇరుగుపొరుగు అమ్మలక్కలు. కొత్త కోడలు అడుగు పెట్టిన తర్వాత తన యింటికి వచ్చిన కళ చూసి మురిసిపోయింది పాపమ్మ. అబ్బుల్ని చూసిన తొలిచూపులోనే చిన్నమ్మికి లోలోపల ఏదో చెప్పరాని సంతోషం కలిగింది. అది వలపు అని ఆమెకు తెలియదు. తన కంటికి నచ్చినవాడు, తనను మెచ్చినవాడూ తనకు భర్తగా దొరికినందుకు చిన్నమ్మి లోలోపల మురిసిపోయింది. అత్తకూ, భర్తకూ ఏలోటూ రాకుండా - ఆడుతూ పాడుతూ - యింటిపనులన్నీ చక్కదిద్దుతోంది. ఇద్దరూ పనులలోంచి తిరిగివచ్చేసరికి వంటచేసి స్నానాలకు వేణ్ణీళ్ళు పెట్టి వుంచేది.

మనసులు కలిసిన ఆ నూతన దంపతులిద్దరూ ఆ ఇరుకు గుడిసెలోనే ఇంద్రభోగాలనుభవిస్తున్నారు. రెండు నెలలు గడిచిన తర్వాత కోడలు "నేను కూడా మీతో పనిలోకొస్తాను." అంది అత్తతో - అత్తగారు వద్దంది. అబ్బులు కలగచేసుకోలేదు. ఆ వ్యవహారం అత్తాకోడళ్ళిద్దరికే విడిచిపెట్టేశాడు.

చిన్నమ్మికి రోజులు గడుస్తున్నకొద్దీ ఒంటరితనం యిబ్బందిగా వుంది. వెలుగొచ్చింది మొదలు చీకటి పడేవరకూ ఆ యింటిలో తాను ఒక్కర్తే వుండాలి. దడిదాటి బయట అడుగు పెట్టొద్దని అత్తగారు చెప్పింది దడిలోపల యింటిచుట్టూ

బంతి, పీలగోరింత మొక్కలు - కూర గాయల పాదులు వేసింది వాటితో కాల క్షేపం చేస్తోంది. చీకటిపడే ముందు అత్తగారు, ఆ తర్వాత భర్త వస్తూ వుంటారు. వాళ్లు వచ్చిన దగ్గర్నుంచి తెల్లవారేవరకూ వాళ్ళ సాహచర్యంలో తన యిబ్బంది మరిచిపోతుంది

ఆరు నెలలు ఆనందంగా గడిచిపో యిన తర్వాత ఆ పూరింటి నడికుప్పమీద తిరిగి గెద్ద వాలింది. ఒకనాటి సాయం సంధ్యలో ఎప్పటిలాగ పనినుంచి తిరిగి వచ్చిన తల్లీ కొడుకులకు - యింట్లో చిన్నమ్మి కనిపించలేదు. ఈసారి కొడుకు కంటే తల్లే ఎక్కువ తల్లడిల్లిపోయింది. వూరంతా తిరిగింది. అందరూ మేం చూడలేదంటే మేం చూడలేదన్నారు.

అబ్బులు మాత్రం నిశ్చేతనుడై తల పట్టుకొని మంచంమీద పడుకున్నాడు. వూరంతా తిరిగి తిరిగి వెదికి వేసారి అలిసిపోయి యిల్లు చేరుకొంది పాపమ్మ. ఆరాత్రి తల్లీకొడుకులు మంచినీరైనా తాగలేదు మర్నాడు చిన్నమ్మి పుట్టింటికి మనిషిని పంపింది. ఆ వార్త వినగానే అబ్బులు మేనమామ, చిన్నమ్మి తల్లి దండ్రులూ ఎక్కడి పని అక్కడ వది లేసి ఆ వూరు చేరుకున్నారు ఈ వార్త తెలియగానే ఆ చిన్న పల్లెటూరు అట్టు డికినట్టు వుండికిపోయింది ఆ వూరి చరిత్రలో ఆడపిల్లను అపహరించుకు పోవడం యిదే తొలిసారి ఆ వూరి యువకులిద్దరు అబ్బులికి నచ్చచెప్పి- వాడు రానన్నా బలవంతంగా తీసుకువెళ్లి పోలీసులకు రిపోర్టు యిచ్చి వచ్చారు. రెండో రోజున కూడా చిన్నమ్మి జాడ తెలియలేదు.

మూడో రోజున సూర్యోదయం అయ్యేసరికి ఆ వూరి చెరువులో చిన్నమ్మి శవం తేలింది. వూరు వూరంతా పిన్నలూ, పెద్దలూ చెరువు చుట్టూ మూగారు. పోలీసులు వచ్చారు. శవ పంచాయితీ జరిగింది. శవం మెడలో మంగళ సూత్రాలతో వున్న పసుపుతాడు అబ్బులు చేతిలో పెట్టారు. శవ పరీక్షలో -చిన్నమ్మిని చెరిచి గొంతునులిమి చంపినట్టు తేలింది. ఆ తర్వాత మృత దేహాన్ని బంధువులకు యిచ్చేశారు.

అంత్యక్రియలు జరిగాయి. ఆ తర్వాత జరగవలసిన కర్మకాండ అంతా జరిపి - బంధువులంతా ఎక్కడివాళ్ల క్కడికి వెళ్లిపోయారు. తల్లీకొడుకు లిద్దరే మిగిలారు.

ఈ సంఘటన జరిగిన తర్వాత- అబ్బులులో ఎవరూ వూహించని మార్పు వచ్చింది. వాడి గుండె బండరాయిలాగ మారింది. వాడికి విచారం లేదు. ఆనందం లేదు. ఎప్పటిలాగ పనిలోకి వెళుతున్నాడు. కష్టపడి పనిచేస్తున్నాడు- ప్రతిరోజు పొద్దున్న లేవగానే చూరు లోంచి గుడ్డసంచి పైకి తీస్తాడు. మేక కొమ్ముల్ని, పసుపుతాడును చూస్తూ -

సులు చిత్తశుద్ధితో హత్య జరిగిన రోజు నుంచీ అబ్బులు అంతర్ధానం అవడం వాళ్ల అనుమానాన్ని మరింత బలపర చింది. పాపమ్మను పోలీసులు తీసుకు పోయి నానాహింసా పెట్టారు. "అడు నోరులేనోడు బాబుగారు! అలాంటి పని అ దెప్పుడూ సెయ్యడు. అడు యేమైపోయాడో, అణ్ణి ఎవశెత్తుకు పోయారో తెలియదు బాబు" అంది. అ వూళ్లోవాళ్లందరూ అ మాటే చెప్పారు. "అడు సాదువు! అడు నోరెత్తి ఎవరినీ తిట్టడమైనా మేం ఏనాడు చూసి ఎరగం" అన్నారు

"మరి వాడెందుకు పరారీఅయ్యాడు!" అని వాళ్లు అడగారు." అడు పారిపోయే మనిషికాదు. అణ్ణికూడా ఎవళో చంపి శవాన్ని కనపడకుండా చేసేసి వుంటారు" అని వూరువూరంతా ఒకేమాట చెప్పింది పోలీసు దర్యాప్తు కొనసాగుతూనేవుంది.

అ జంట హత్యల తర్వాత అ వూరికి కొత్త చైతన్యం వచ్చింది. జనం స్వేచ్ఛగా, హాయిగా, నిర్భయంగా తిరుగుతున్నారు, వయసొచ్చిన అడ పిల్లలు కూడా లేడిపిల్లలులాగ కళ కళలాడుతూ వీధులలో కనపడుతున్నారు తీరిక సమయాలలో యువకులు అట పాటలతో ఆనందంగా కాలం గడుపు తున్నారు-పట్టాభి కుటుంబం అ వూరి నుంచి శాశ్వతంగా పట్నానికి మకాం మార్చేశారు. సొంత వ్యవసాయం మానేశారు. పొలాలన్నీ కౌలుకు యిచ్చే శారు. అ మేడ చాలకాలం పాడుపడి వుంది. చివరకు కొందరు పెద్దల కోరిక మీద అస్పత్రి పెట్టడానికి అ మేడ యిచ్చేశారు

అ పల్లెలో ప్రతి యువకుడూ పాపమ్మను తన సొంత తల్లికంటే అదరంతో చూస్తాడు. పిన్నలూ, పెద్దలూ అడామగా అంతా పాపమ్మను ఎంతో గౌరవంగా చూస్తున్నారు. అమెకు ఏ లోటూ రానివ్వడంలేదు పాపమ్మ కూడా తన విచారం మరిచిపోయింది. జనంతో కలిసిపోయింది. వాళ్ల కష్టసుఖాలు పంచుకుంటోంది.

ఇది జరిగి యిరవై ఏళ్లయినా అబ్బులు ఇంకా బతికే వున్నాడని-వాడు నేడో రేపో తప్పకుండా వస్తాడని అవూరివాళ్ల నమ్మకం.



# కొన్ని, కొన్ని, మన జీవనంతో అలా ముడిపడిపోతాయి...
# నూరేళ్ళు గడచినా అలాగే నిలిచిపోతాయి!




నూరేళ్ళ క్రితం ఒక సంప్రదాయం వెలసింది,
దాన్ని అందరూ సన్‌లైట్ అన్నారు. ప్రపంచమంతటా,
ఇంటింటా అమ్మ అమ్మాయికి అందించడం
ఆ సంప్రదాయం, రోజులు మారాయి. అయితేనేం, శుద్ధమైన,
మృదుత్వంగల సన్‌లైట్ యొక్క సంప్రదాయం మాత్రం
చెక్కు చెదరకుండా నిలిచేవుంది ఈ నాటికీ. అలా
అనేక శతాబ్దాలు నిలచెట్టాలనే మా దృఢసంకల్పం'

**సన్‌లైట్ సబ్బు 100 సంవత్సరాలుగా విశ్వసనీయమైన సంప్రదాయం**

LINTAS SUN 11 1811 TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# ఈ జీవితం నాది!

## సీరియల్

(గత సంచిక తరువాయి)

అంధకారపు గుహల్లో ఎక్కడో తెరుచుకున్న ప్రాణుల్లా, మధుర కనురెప్పలు మెల్లగా విడివడినాయి.

ఎదురుగా మీదకి వంగి ఎవరో చేయిపట్టి 'మధురా!' 'మధూ' అని పిలుస్తున్నారు.

"ఊ!" శక్తి అంతా తెచ్చుకుని పలికినా, ఆ కంఠం నూతిలోనుంచి విన్పించినట్లు అస్పష్టంగా వుంది.

"మధురా! మధూ!"

"ఎవరూ!"

"నేను ప్రియని! నీ స్నేహితురాలిని మధూ! గుర్తుపట్టగలుగుతున్నావా!" స్నేహమిశ్రితమైన ఆ స్వరం మధురకి ఆనందామృతం తాగిస్తున్నట్లుగా వుంది.

"ప్రియా!"

"అవును. గుర్తుపట్టావా! నేను మాట్లాడేది తెలుస్తోందా!"

"తెలుస్తోంది ప్రియా-నువ్వు-" మాధురి లేవబోయింది.

"లేవకు. నీకు ఓపిక లేదు."

"నువ్వెలా వచ్చావు నా దగ్గరకి-" దీనస్వరంతో అడిగింది.

"నువ్వే నా దగ్గరకి వచ్చావు. నా దగ్గరకి నిన్ను తెచ్చుకున్నాను. ఒక్కసారి కళ్లు బాగా తెరిచి చూడు. ఎక్కడున్నావో తెలుసుకో."

మధుర కళ్ళు సాంతం తెరవాలని, చుట్టూ చూడాలని చూసింది. కానీ కళ్ళముందు అంతా తెల్లటి బట్టలు అరగట్టినట్లు అయోమయంగా వుంది.

"ఎక్కడున్నాను." మందుల ప్రభావంతో మత్తుగా అడిగింది.

"మా యింట్లో నా దగ్గర!"

---

యద్దనపూడి సులోచనారాణి

---

"నీ దగ్గరా! మీ యింట్లోనా."

"అవును."

మాధురి క్షణంసేపు అయోమయంగా చూసింది.

ఆ ముఖం కుచించుకుపోయినట్టుగా అయింది. "లాభంలేదు. ప్రియ కాలేదు. నేను కలగంటున్నాను" అంటూ గొణుక్కుంది

"నువ్వు కలగనటం లేదు. నువ్వు నిజంగా నా దగ్గర వున్నావు. నీ తల నా ఒడిలో వుంది. కాస్తంత ఓపిక తెచ్చుకో. యీ కొంచం హార్లిక్స్ తాగు ప్రియ బలవంతంగా మధురని లేపి హార్లిక్స్ నోటికి పట్టింది. అతి ప్రయత్నంమీద రెండుమూడు గుక్కలు తాగిన తర్వాత మాధురికి కాస్త మెలకువ వచ్చింది. కళ్ళముందు తెల్లకాగితం పరుచుకున్నట్లుగా వున్న శూన్యం మాయమై, గదిలో వస్తువులు కనిపించసాగాయి. టేబుల్, ఏవో రంగుల గుడ్డలు. ఏమిటవి! అలా అలా ఎగురుతున్నాయి మేఘాలలా! కళ్ళు చిట్లించి చూచింది. కాదు. మేఘాలు కాదు. కిటికీ కర్టెన్లు.

"ఈ కొంచెం తాగు," ప్రియంవద బలవంతంచేస్తూ తాగించింది. మాధురికి పూర్తిగా మెలకువ వచ్చింది.

తలెత్తి చూసింది. తన ముఖంమీదకి వంగిన ప్రియంవద ముక్కున ఒంటిరాయి ముక్కుపుడక ధగధగలాడుతున్నట్టు మెరుస్తోంది.

"ప్రియా!" మాటలు రాలేదు సరిగ్గా?

"మధు! హమ్మయ్య. ఎప్పటికి నన్ను గుర్తుపట్టగలిగావు."

ప్రియంవద మాధురిని గుండెలకు అదుముకుంది.

"నేను, నేను, నిజంగా బ్రతికివున్నానా?"

"నిజంగా బ్రతికివున్నావు. నాదగ్గర వున్నావు. నేను నీ దగ్గర వున్నాను. ప్రియంవద స్నేహితురాలి భుజాల చుట్టూవున్న చేతుల్ని మరింత బిగించింది. దాంతో మాధురి ముఖం ప్రియంవదకి మరింత దగ్గరగా వచ్చింది.

"మధూ! మధూ! ఈరోజు నా కెంత సంతోషంగా వుందో తెలుసా!" ప్రియ ఆవేశంగా, ఆనందంగా తొట్రుపాటు నిండిన కంఠంతో అంది.

మాధురి ప్రియంవద గుండెలో ముఖం దాచుకొని ఏడవసాగింది.

"ఇది నిజమేనా!"

"నిజంగా నిజం!"



ఉదయాస్తమానం పని వుంటూనేవుంటే ఉత్తేజాన్నిచ్చే టీ వుండాలంతే...

"అయితే నాకు యింక భయంలేదు. నేను ఒంటరిదాన్నిగానుగా ప్రియా." మాధురి ఆయాసపడ్తూ యిక-నేను - చచ్చిపోతాను. తొందరగా చచ్చిపోతే బాగుండు."

"ఛీ! ఏంమాటలవి."

మాధురి ప్రియంవద వక్షస్థలిలలో తలదాచుకొని ఏడవసాగింది.

"ప్రియా! నువ్వు నన్ను వదిలి వెళ్ళవు కదూ! నేను బ్రతికినా ఎక్కువసేపు బ్రతకను. తొందరగానే చచ్చిపోతాను. నన్ను వదిలి వెళ్ళకు"

"మధూ! నువ్వు నిద్రపో! నర్స్ మందు తీసుకురా."

ప్రియ పురమాయించింది.

నర్స్ మందు తెచ్చింది.

ప్రియంవద మాధురిచేత తాగించింది.

"నువ్వు నిద్రపో! యిక నీ కెలాంటి భయమూ లేదు."

"నేను నీ దగ్గరే వుంటాను. ఎక్కడికీ వెళ్ళను."

"వాడు. వాడు ఆ డామీగాడు కనిపిస్తే చంపేస్తాను." మాధురి గుప్పిళ్ళు బిగిసినాయి. "వాడు నన్ను మోసంచేశాడు."

"నువ్వు నిద్రపోమ్మా. మంచిదానివి కదా. మనం తర్వాత నీకు బాగా ఓపిక వచ్చిన తర్వాత మాట్లాడుకుందాం."

"ఓపికా! నాకా - రాదు - నేను చచ్చిపోతాను. నా వొంటినిండా రోగాలే." మాధురి ఏడ్చింది.

"ఏ రోగాలు అయినా మందు తీసుకుంటే అవే పోతాయి."

"నేను, నేనంటే నీ కసహ్యం లేదా!"

"అసహ్యమా! నాకా! మాధురి అంటే నాకెప్పుడైనా, యిష్టంతప్ప యింకే భావం అయినా వస్తుందా."

"నేను, నేను ఓడిపోయాను."

"నువ్వు నిద్రపో!"

"చెడిపోయాను! నన్ను అందరూ కలిసి చెడగొట్టారు. నన్ను మోసం చేశారు." మాధురి అరవసాగింది.

"నన్ను మోసంచేశారు వాళ్ళని చంపేస్తాను. నేను చావను. బలం తెచ్చుకుని, బ్రతికి, వాడిని పాతేస్తాను. వాడి రక్తం కళ్ళచూస్తాను! ఎక్కడ!

# కాలిన గాయమా?



## కాలితే వెంటనే రాయండి బర్నాల్— కాలిన గాయాలకు ప్రత్యేక చికిత్స




కాలిన గాయాల బాధే వేరు. కాలిన గాయాలు చురుక్కుమంటూ నొప్పి పెడతాయి. కాలితే పొక్కులు లేస్తాయి. వాటికి కావలసింది గాయాలను మాన్పే మందు—బర్నాల్ యాంటిసెప్టిక్ క్రీమ్. బర్నాల్ చల్లదనాన్నిచ్చి వెంటనే ఉపశమనాన్నిస్తుంది. పొక్కులు లేవకుండా వెంటనే ఆపుతుంది. కాలిన గాయాలను త్వరగా మాన్పే మందు, బర్నాల్ యాంటిసెప్టిక్ క్రీములో ఉంది.

ఎప్పుడూ బర్నాల్‌ని ఇంట్లో ఉంచుకోండి.

# బర్నాల్

కాలిన గాయాలకు ప్రత్యేక చికిత్స

BCL-5641R

వాడెక్కడ. ఒరేయ్ దానిగా ఎక్కడ్రా నువ్వు!!" మాధురి డెలీరియం స్టేజీకి మళ్ళీ రావటం ఆ గొంతుకి బలంవచ్చింది. ఆ గొంతు కీచుగా, ప్రాణం అంతా వుగ్గబట్టి అరుస్తున్నట్టుగా ఆ యిల్లంతా విన్పిస్తోంది. నర్స్ గబాల్న ఇంజక్షన్ తీసి బలవంతంగా యిచ్చింది.

"వాడిని చంపేస్తాను. ఒరేయ్ నేను వూరుకోనురా." అరిచింది. కానీ యీసారి అరుపుల్లో ఆ వుద్రేకం లేదు. గొంతు తగ్గిపోయింది.

కాసేపటికి మాధురి నిద్రపోయింది.

ప్రియంవద నర్స్‌కి అప్పచెప్పి యివతలకి వచ్చింది.

అక్కడ గదిలో వికీ కూర్చుని ఎకౌంట్స్ చూసుకొంటున్నాడు. అతని వడిలో కూర్చొని అతని మెడచుట్టూ చేతులు పెనవేసి, కూతరు అతని గుండెల్లో ముఖం దాచుకుని కూర్చునివుంది దివ్య.

"ఏమిటి అలాగుంది!" అడిగింది ప్రియ.

"నీ స్నేహితురాలి అరుపులు విని బెదిరిపోయింది." ప్రియ మాటలు వినగానే దివ్య లేచి కళ్ళుతెరిచి చూసింది.

ప్రియంవద వచ్చి దివ్యని ఎత్తుకోబోతుంటే ఎడంచేయి విసిరి, "ప్రియా నువ్వు బట్టలు మార్చుకురా" అన్నాడు వికీ.

"నేనా! ఎందుక!"

"జ్వరంమనిషి దగ్గరనుంచి వస్తున్నావు. ఇన్‌ఫెక్షన్"అతను ఎకౌంట్స్‌లో నుంచి తలెత్తకుండానే అన్నాడు. ప్రియంవద ఒక్క నిమిషం అప్రతిభురాలయినట్టు చూసింది. తర్వాత తన గదికి వెళ్ళి బట్టలు మార్చుకొని కొత్త దుస్తులు ధరించి వచ్చింది.

దివ్య తండ్రిని వదిలి తల్లిదగ్గరకు వచ్చింది.

పిల్లలిద్దరికీ అన్నం పెడుతుంటే దివ్య అడిగింది.

"మమ్మీ! ఆ పిచ్చిది మన ఇంట్లోంచి ఎప్పుడు వెడుతుంది."

"పిచ్చిదా ఎవరు!"

"ఆ జ్వరంగా వున్న పిచ్చిదే"

ప్రియంవద యీడ్చి కొట్టింది. ఆమాట అనవద్దని ఎన్నిసార్లు చెప్పాను. ఆవిడ నా స్నేహితురాలు. నువ్వు ఆంటీ అని పిలవాలి." అప్పటికే దివ్య ఏడుపు లంకించుకొంది.

"ఎందుకలా కసురుకుంటావు పిల్లలికేం అర్థం అవుతుంది! కొస్త ఓర్పు వుండాలి దా నాన్నా!" వికీ కూతురిని ఎత్తుకొని కళ్ళు తుడుస్తూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

కొడుకు ఒక్కడే మిగిలాడు.

"ఏంకావాలి! భోజనంలోకి" అని అడిగింది.

"ఏం వద్దు" వరుణ్ అక్కడ నుంచి తండ్రి వెంటే వెళ్ళిపోయాడు. ప్రియంవద ఒక్కత్తే టేబుల్ దగ్గర కూర్చుండిపోయింది.

భర్త, పిల్లలు అన్నం మధ్యలో లేచి వెళ్ళిపోయారు. ఆమెకి అసలు అన్నం తినబుద్ధి కాలేదు. ప్రియంవదకి భర్త మీద కూడా చిరాగ్గా వుంది. ఆయన అలా కూతురుని వెనకేసుకుని రాకండావుంటే చాలా బాగుండేది పిల్లలు సభ్యతగా ప్రవర్తించకపోతే, తలితండ్రులిద్దరూ ఒక్కమాటమీద వుండి, వాళ్ళ ప్రవర్తనని ఖండించాలి. ఒకరు కసరగానే, మరొకరు దగ్గరకి తీస్తే, ఆ సానుభూతి దొరకడంతో వాళ్ళకి తాము చేసిన తప్పు అర్థంకావాలి. 'ఇప్పు డసలు నావల్ల ఏం పొరపాటు జరిగిం ది' ఇంట్లో నౌకర్లు అందరు వింతగా చూస్తున్నారు.

వుదయం స్నానంచేసి, భర్తకి టిఫిన్ సిద్ధంచేసి వంటయింటివైపు వెళితే, అక్కడ వంటమనిషి, పనిమనిషి తనగురించే గుసగుసలాడుతున్నారు.

"ఆ పిచ్చి దెవరమ్మా యింట్లో! దానికి అమ్మగారి సేవలేమిటి?"

"ఏమిటో నాకూ అర్థంగావటంలేదు. ఆవిడ కొవాల్సిన మనిషట!"

"ఎవరికి కావాల్సిన మనిషి! అయ్యగారికా, అమ్మగారికా!"

"ఏమో! వారికే తెలియాలి. పెద్దాళ్ళ సంగతులు మనకి చెబుతారా?"

"ఆళ్ళు చెప్పేదేంటి, నిత్యం యింట్లో వుండేవాళ్ళం. మనకి కళ్లు, చెవులు చురుగ్గావుంటే, అన్నీ మనకే తెలుస్తాయి. నాకింకా తెలియలేదు. తెలిస్తే నీకు చెప్పుతాలే."

ప్రియంవద దగ్గింది. ఇద్దరూ చెరోవైపు పనిమీదకెళ్ళారు.

పనివాళ్ళ మనస్తత్వాలే అంత! ఎంతబాగా చూసినా యజమానుల విషయాలు మనకి ఎందుకులే అనుకోరు. అన్ని ఆలూ కావాలి! ఎక్కడలేని ఆసక్తి! ప్రియంవదకి వాళ్ళ ప్రవర్తన వింతగా ఏమీ అన్పించలేదు.

కానీ యీరోజు వుదయంనుంచీ వికీ కూడా చిరాగ్గా వున్నాడు ఎందుకో!

ప్రియంవద పడకగదిలోకి వచ్చింది. వికీ మంచంమీద వెల్లకిలా

"ఎందుకలా కసురుకుంటావు పిల్లలికేం అర్థం అవుతుంది! కొంచెం ఓర్పు వుండాలి దా నాన్నా!" వికీ కూతురిని ఎత్తుకొని కళ్ళు తుడుస్తూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

కొడుకు ఒక్కడే మిగిలాడు.

"ఏంకావాలి! భోజనంలోకి" అని అడిగింది.

"ఏం వద్దు." వరుణ్ అక్కడ నుంచి తండ్రి వెంటే వెళ్ళిపోయాడు. ప్రియంవద ఒక్కత్తే టేబుల్ దగ్గర కూర్చుండిపోయింది.

భర్త, పిల్లలు అన్నం మధ్యలో లేచి వెళ్ళిపోయారు. ఆమెకి అసలు అన్నం తినబుద్ధి కాలేదు. ప్రియంవదకి భర్తమీద కూడా చిరాగ్గా వుంది. ఆయన అలా కూతురుని వెనకేసుకుని రాకుండావుంటే చాలా బాగు దేది పిల్లలు సభ్యతగా ప్రవర్తించకపోతే, తలితండ్రులిద్దరూ ఒక్కమాటమీద వుండి, వాళ్ళ ప్రవర్తనని ఖండించాలి. ఒకరు కసరగానే, మరొకరు దగ్గరకి తీస్తే, ఆ సానుభూతి దొరకడంతో వాళ్ళకి తాము చేసిన తప్పు అర్థంకావాలి. 'ఇప్పు డసలు నావల్ల ఏం పొరపాటు జరిగిం ది' ఇంట్లో నౌకర్లు అందరు వింతగా చూస్తున్నారు.

వుదయం స్నానంచేసి, భర్తకి టిఫిన్ సిద్ధంచేసి వంటయింటివైపు వెళితే, అక్కడ వంటమనిషి, పనిమనిషి తనగురించే గుసగుసలాడుతున్నారు.

"ఆ పిచ్చి దెవరమ్మా యింట్లో! దానికి అమ్మగారి సేవలేమిటి?"

"ఏమిటో నాకూ అర్థంగావటంలేదు. ఆవిడ క్కావాల్సిన మనిషట!"

"ఎవరికి కావాల్సిన మనిషి! అయ్యగారికా, అమ్మగారికా!"

"ఏమో! వారికే తెలియాలి. పెద్దాళ్ళ సంగతులు మనకి చెబుతారా?"

"అళ్ళు చెప్పేదేంటి, నిత్యం యింట్లో వుండేవాళ్ళం. మనకి కళ్ళు, చెవులు చురుగ్గావుంటే, అన్నీ మనకే తెలుస్తాయి. నాకింకా తెలియలేదు. తెలిస్తే నీకు చెప్పుతాలే."

ప్రియంవద దగ్గింది. ఇద్దరూ చెరోవైపు పనిమీదకెళ్ళారు.

పనివాళ్ళ మనస్తత్వాలే అంత! ఎంతబాగా చూసినా యజమానుల విషయాలు మనకి ఎందుకులే అనుకోరు. అన్ని ఆరాలూ కావాలి! ఎక్కడలేని ఆసక్తి! ప్రియంవదకి వాళ్ళ ప్రవర్తన వింతగా ఏమీ అన్పించలేదు.

కానీ యీరోజు వుదయంనుంచీ వికీ కూడా చిరాగ్గా వున్నాడు ఎందుకో!

ప్రియంవద పడకగదిలోకి వచ్చింది. వికీ మంచంమీద వెల్లకిలా

# అయినా మరి ఆమె సర్ఫ్ కొంటుంది.

"అవును నిజమే! సర్ఫ్ నా డబ్బుకు గొప్ప విలువ ఇవ్వడమే అందుకు కారణం అందుకే నే మరే ఉతికే పౌడరూ కొనాలనుకోను ముఖ్యంగా ఈ రోజుల్లో"

**అది సరే గానీ, చౌకగా దొరికే ఉతికే పౌడర్లను కొంటే డబ్బు బోలెడు ఆదా కాదా మరి?**

"చాల్చాల్లే, ఊరుకో! సర్ఫ్ కొనడం లాభసాటి బేరం. దానికి చౌకబారు వాటికీ పోలికేమిటిలే"

**సరే ఒప్పుకున్నాం సర్ఫ్ మరింత విలువ ఎలా ఇస్తుంది?**

"విను మరి ఒక కిలో చౌకబారు పౌడర్ల బ్యాగ్‌లో ఎంత పౌడర్ వుంటుందో అంత, కేవలం $1/2$ కిలో సర్ఫ్ ప్యాక్‌లో వుంటుంది".

**అయితే మాత్రం .**

"ఆగు విను, సర్ఫ్ కున్న మరింత విలువ ఆ చౌకబారు పౌడర్లేవీ నాకు సర్ఫ్ యిచ్చే తెల్లదనాన్ని యివ్వనూ లేవు, రంగు బట్టల తళతళలను సర్ఫ్‌లా నిలపనూ లేవు అందుకే మరి మా ఇంట్లోవారందరి బట్టలూ కొత్త వాటిలా కనిపిస్తూనే వుంటాయి మళ్ళీ మళ్ళీ ఉతికాక కూడా!"

**ఆ! ఇప్పుడు అర్థమైంది**

"మరో విషయం సర్ఫ్ నా చర్మానికి ఏమీ హానిచెయ్యదు గనక నా చేతులు <u>సురక్షితంగా</u> వుంటాయి"

**సర్ఫ్ లాభసాటి బేరం అని నువ్వంటే ఇదన్న మాట**

"అవును, నెలకి ఎంతో కొంత కూడ బెట్టాలని ఎన్నో విశేషాలు గల సర్ఫ్‌ని నే వదులుకోలేను <u>తెలివిగా</u> లెఖ్ఖ వేసుకొని ఎంచుకోవాలన్నది నా నమ్మకం"




**తూచి చూస్తే తెలుస్తుంది.
సర్ఫ్ కొనడంలోనే వివేకం ఉంది.**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

పడుకొని పుస్తకం చదువుతున్నాడు. అతని పొట్టమీద తల ఆనించి కూతురు నిద్రపోయింది. చేతులమధ్య కొడుకు దూరినట్టుగా ముడుచుకొని పడుకున్నాడు.

ప్రియంవద వచ్చి వాళ్ళని ఎత్తుకొని తీసుకువెళ్ళి వాళ్ళగదిలో మంచం మీద పడుకోబెట్టి, పెద్దలైటు తీసి, చిన్నలైటు వేసి వచ్చింది. వికీ యింకా చదువుకొంటున్నాడు.

"పిల్లలు యీ మధ్య మరీ అసభ్యంగా ప్రవర్తిస్తున్నారు" ఫిర్యాదుగా అంది.

"చెప్పానుగా! పసిమనసులు. వాళ్ళకేం తెలియదు. మనం పెద్దవాళ్ళం మనమే అర్థంచేసుకోవాలి."

"మధుర విషయంలో వాళ్ళకి నచ్చందేముంది. ఏం తెలుసునని అలా మాట్లాడాలి. నాకు స్నేహితురాలు అని చెప్పానుగా!"

"నువ్వు ముందు ఆవేశపడటం మానాలి!" వికీ కళ్ళజోడు తీసి పక్కన పెడుతూ, "నువ్వు వాళ్ళకంటే అసందర్భంగా ప్రవర్తిస్తున్నావు. నువ్వు వాళ్ళకి అవిడ గురించి ఏంటీ అని చెప్పావు. నీకు స్నేహితురాలు అంటే, యిప్పటి వరకూ నీ స్నేహితులంతా వున్నవాళ్ళు, ఆరోగ్యవంతులు అమ్మ స్నేహితులంటే, అలాగే వుంటారు అనుకోవచ్చు! వాళ్ళ నమ్మకానికి మధుర రూపానికి సామ్యం కల్పడంలేదు. దానికి తోడు యింట్లో పనివాళ్ళ గుసగుసలు. వాళ్ళ మనసులు అంగారుపడడం సహజం. నువ్వు మధురని యింటికి తీసుకురాకుండా, వేరే యెక్కడైనా వుంచితే బాగుండేది."

ప్రియంవద నివ్వెరపోయినట్టు చూసింది.

"ఏమిటీ? నేను చేసినపని మీకూ నచ్చలేదా! క్షమించండి. అయితే రేపే నేను మధురని హాస్పిటల్‌కో, అనాధ ఆశ్రమానికో పంపించివేస్తాను."

"అదిగో! అదుగో! ఆ ఆవేశమే కూడదంటున్నాను." అతను ప్రియ మనసు చిన్నబుచ్చుకొందని గ్రహించగానే, గభాల్న వంగి, భార్య చేయిపట్టి దగ్గరకి లాక్కున్నాడు. ప్రియంవదని చేతులతో చుట్టి ఛాతీమీదకి లాక్కుంటూ, "ప్రియా నీవు ఎంతమందికి ఎన్ని సహాయాలు అయినా చేయవచ్చు! కానీ మన జీవితం, మన చుట్టూవున్న మనవారు, మన కుటుంబ పరువు వీటిని గురించి కూడా ఆలోచించాలి. మనం స్థిరంగా, సుఖంగా వుంచేనే కదా యింకోరు ఆపదలో వుంటే మనం ఆదుకోగలిగేది."

"ఇప్పుడు నేను అంత కానిపనేంచేసాను మీరు చెప్పండి! మధుర సాయం లేకపోతే యీ రోజున నేను యిలా వుండేదాన్ని కాదు! మధురకి అనారోగ్యంగా వుంటే, ఆదుకోవడం తప్పా? మీరే చెప్పండి."

వికీ మాట్లాడలేకపోయాడు.

"చెప్పండి. తప్పు అని మీరు అంటే, యిప్పుడే యీ క్షణంలో మధురని పంపించివేస్తానండీ."

"ప్రియా! నువ్వు తప్పేం చేయటంలేదు!"

అతని కంఠం ధృడంగానే పలికింది.

ప్రియ అతనివైపే రెప్పవాల్చకుండా కళ్ళలోకి వెతుకుతున్నట్లుగా చూసింది. ఆ కళ్ళలోకి క్రమంగా, ఆనందభాష్పాలు నిండుకువచ్చాయి.

"హమ్మయ్య! మీకు యిష్టంలేనిపని నేనేం చేయటంలేదు కదా! నా కింకా దిగులు లేదు" అతని మెడచుట్టూ చేయివేసి అతని మెడ ఒంపులో ముఖం దాచుకొంటూ–

"నేను మూర్ఖురాలిలా చేసానండీ! పిల్లలపట్ల ఆవేశంగా ప్రవర్తించాను. నాది తప్పే! మీరన్నది నిజమే! వాళ్ళని నేను కోప్పడకూడదు. అర్థం అయేలా నచ్చచెప్పాలి. రేపటి నుంచి అలాగే చేస్తాను." అంది

"ప్రియా!" అతను పిలిచాడు.

"ఊ!!"

"రేపు విశాఖపట్నం నుంచి మా చిన్నత్తయ్య వస్తోంది."

"వరలక్ష్మి పిన్నిగారా? ఎప్పుడు వచ్చింది ఉత్తరం!"

"మధ్యాహ్నం శంకరం ఫోన్‌చేసి చెప్పాడు."

"రానీండి. ఆవిడ వస్తే యిల్లంతా సందడే. పిల్లలకి కావాల్సినంత కాలక్షేపం." అంది సంతోషంగా. ప్రియకి అతని స్నేహితులతోగాని, బంధువులతో గానీ ఎలాటి పేచీలేదు అందరూ వికీకి తగిన భార్య అంటూ ప్రియని యిష్టపడ్తారు. కొంత సేపటికి ప్రియంవద అలాగే పడుకుని నిద్రపోయింది.

వికీ, భార్య జుట్టు, చెంపలు నిమురుతూ వుండిపోయాడు. అతనికి యింకా నిద్ర రావడంలేదు. మాధురి విషయం అందరికీ వింతగా వుంది. ఆవిడ మీద పోలీసుకేసు కూడా వున్నట్టు విన్ననే తెల్సింది. డి.యస్.పి. సత్యం నిన్న ఫోన్‌చేసాడు.

# అబ్బబ్బ! మావాడి తపన చూడడం నాతరంకాదు బాబూ. ఎంతగా అల్లలాడి పోతాడో పాపం. చూశారా, స్కూల్నించి వస్తూ శుబ్బరంగా తడిశాడు... ఈ పాపిష్ఠి జలుబు తెచ్చుకున్నాడు.



పోయినసారి వాడు తడిసొచ్చినప్పుడు భయంతో నాకు వణుకు పుట్టింది. ఆ తుమ్ములూ, ఆ ముక్కు కారడం. అబ్బ! ఇక ఒళ్లంతా నొప్పులని అన్నాడు. నేనేమో వెంటనే వాడి ఒళ్లు తుడిచి పక్క మీద పడుకోబెట్టాను. ఆపైన విక్స్ వేపోరబ్ వాడి ముక్కుపైనా, గొంతుపైనా, ఛాతీపైనా, ఇంకా వీపుపైన కూడా బాగా రాశాను. విక్స్ చలవే అనాలి.... నా బాబు రాత్రంతా చక్కగా నిద్రపోయాడు. తెల్లారగానే హుషారుగా స్కూలుకు వెళ్లటానికి తయారయాడు. ఏమిటీ, వాడి జలుబా! అదిగో.... హూష్ కాకి!

ఇంక నాకేం దిగుల్లేదమ్మ! ఎప్పుడూ పనిచేసే విక్స్ వేపోరబ్ సీసా తయారుగా దగ్గరుంచుకుంటా, నా బాబు హుషారుగా ఉంటాడని తెలిసి తృప్తిగా ఉంటా!

## విక్స్ ఇచ్చే అభయం మీ ఆప్యాయతకు సమానం

విక్స్ వేపోరబ్ జలుబు లక్షణాల్ని త్వరగా తగ్గిస్తుంది. ఎందుకంటే దానిలో రెండు విధాల పనిచేసే శాస్త్రీయ సూత్రం ఉంది. దాని ఔషధ యుక్త ఆవిర్లు మీ శ్వాసనాళాల్ని తెరిచి హాయిగా గాలి పీల్చుకోనిస్తాయి. ఇక దాన్ని చర్మంపై రాసినప్పుడు ఒళ్లు నొప్పులు ఉపశమిస్తాయి. అందుకే. అది కుటుంబానికంతటికీ అతి విశ్వసనీయమైన జలుబు మందయింది.




## విక్స్ వేపోరబ్

ఇస్తుంది హాయిగా ఊపిరిపీల్చుకొనే
లాంటి ఉపశమనం
ఇక కులాసాగా ఉండగలిగే
అనుభవం

RHL 20/84 TEL

"షి యీజ్ బ్యాడ్ క్యారెక్టర్. మీ కెందుకు యీ లంపటం. త్వరగా మీరు ఆ యింట్లోంచి పంపివేయండి" అని హెచ్చరిక చేసాడు.

ప్రియంవద యీ స్థితిలో మధురని వదిలిపెట్టి వుండదని అతనికి తెలుసు।

ప్రియలో అతనికి నచ్చిన గుణాలే అవి. క్షమ। ప్రేమ। ఆమెలో యివి అపారంగా వున్నాయి. ఎదుటి మనిషిని, తన మంచి మనసుతో, ప్రేమతో పునీతం చేస్తుంది। స్త్రీకి దైవత్వాన్ని ఆపాదించే యీ గుణాలే ఆమె చరిత్రకి వన్నె తెస్తాయి। అని అతను నమ్ముతాడు. ప్రియంవదలో ఏవి చూసి అతను ఆకర్షింపబడ్డాడు, ఏవి భార్యలో వుండడంవల్ల వ్యాపారవేత్త అయినా, అతని జీవితం సుఖమయంగా వుంది. అవే యిప్పుడు అతన్ని నిలదీస్తున్నాయి। నిన్నటి వరకూ అతను ఆనందపడి, అభినందించిన గుణాలని, యిప్పుడు, హఠాత్తుగా మార్చుకోమంటే ఎలా? క్షమ, ప్రేమ, తెలిసిన ప్రియ జీవితంలో అధఃపాతాళానికి వెళ్ళిన స్నేహితురాలికి చేయూతనివ్వకుండా వుండగలదా। ఒక చేయి వేయి చేతులుగా మారి స్నేహితురాలికి ఆదుకోవటానికి సిద్ధంఅవుతుంది. ఇప్పుడు సమస్య యిదేమైంది ప్రియంవదకికాదు। అతనికి।। మధురను తన యింట్లో భరించటం, ...క పరీక్షగా నిలుస్తోంది. ఈ పరీక్ష మరీ కఠినతరం కాకుండా, మధురని మెలాసాగానిచ్చి యీ యింట్లోంచి వెళ్ళ... అనుకోసాగాడు.

[సశేషం]




Printed and Published by A Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

